# స్త్రీ శక్తి



మూలం
వినోబా భావే

అనువాదం:
చర్ల గణపతిశాస్త్రి

ప్రకాశకులు:
సర్వోదయ సాహిత్య ప్రచార సమితి, తెనాలి
గాంధీ సాహిత్య ప్రచురణాలయము,
1-8-43, చిక్కడపల్లి, హైదరాబాద్-20.

# ముందుమాట

శారీరకమైన శ్రమశక్తి తక్కువగా నున్నను కార్యసిద్ధిని సులభ మొన ర్చుటయె సాధనములలోని గొప్పదనము. ఉపకరణముల విషయములో పరిశోధన జరగనంతవరకు జీవనములో మిగుల యెక్కువ పరిశ్రమ చేయువారిదే యధికారమయి యుండెను. భీమసేనుడు, హెర్క్యులెసుల శరీరములలో వేలకొలది యేనుగుల బలముండెడిది. ఉపకరణములు కనిపెట్టబడనప్పుడు ఆ కాలములో ఇటువంటి మల్లుర సత్తయె యమలులో ఉండి యుండును, దాని పిదప ఉపకరణములు కనిపెట్టిన పిదప బాహుబలముకంటె ఉపకరణముల నేర్పునకే మహత్త్వము పెరిగెను. ఉపకరణముల వికాసము జరిగినట్లే యాయుధముల వికాసమును జరిగెను. ఉపకరణములు, ఆయుధములు మిగుల నేర్పుగాను, సూక్ష్మముగాను అయినకొలది శరీరబలముకంటె యుపకరణముల యొక్క, యాయుధముల యొక్క మహత్త్వము వర్ధిల్లెను. ఈ వికాసమునకు తాత్పర్యము సంస్కృత వాక్యములలో "బుద్ధిర్యస్య బలం తస్య" "బుద్ధి ఎవనిదో వానిదే బలము" అని వ్యక్తపఱచవచ్చును.

మనుష్యుని ప్రగతి శరీరబలమునుండి బుద్ధిబలమువైపు వెళ్ళెను. నేడో శరీరబలమును, సంఖ్యాబలమును వైజ్ఞానిక బలముముందు గతార్థమై పోయినవి. పురుషులకంటె స్త్రీలు శరీరబలములో తక్కువయనెడు కారణమునుబట్టి మాత్రమే స్త్రీ అబలయు, రక్షణాకాంక్షిణియు, పరాధీనయు కానేరదని, దీని యర్థము. శస్త్రవిద్య, అస్త్రవిద్య, యంత్రవిద్యలు వికసించిన పద్ధతివిబట్టి చూడగా మనోబలము, బుద్ధిబలము ఎక్కువగా నున్నచోట వాస్తవికశక్తియు, స్వత్వమును ఉండునని నిశ్చయముగా ఊహించవచ్చును. విజ్ఞానముయొక్క ప్రగతి స్త్రీని, పురుషుని తుల్యబలము గల వానినిగా జేసివైచెను.

శక్తులనుబట్టి స్త్రీల జీవనము పురుషులమీద ఆధారపడి పురుషులను ఆపేక్షించినదై యున్నది. కనుక ఆమెలో బలిదానము, ఆత్మోత్సర్గము, కష్టసహనము, అనుపమానమైన శక్తి యున్నను కుటుంబములోను సమాజములోను ఆమెయొక్క భూమిక అప్రధానముగనే యున్నది. ఈశ్వర భక్తిలోను ఆత్మజ్ఞానములోను నిమగ్నులైన పురుషులు ఆమెను మోక్ష మార్గమునకు ముఖ్యమైన ప్రతిబంధకముగా తలచిరి. సభ్యులైన పురుషులు స్త్రీనిగూర్చి చర్చించుట విషయభోగములయొక్క లక్షణముగా తలచిరి, విరాగులు ఆమెను చూచుటకూడ నిషిద్ధమనిరి. విలాసవంతులు. కవులు ఆమెను విలాసమునకు, భోగమునకు సాధనముగా తలచిరి. గృహస్థులు మాత, సోదరి, కన్యల రూపములో ఆమెను దేవతగాను, పవిత్రమైన ధనముగాను తలచిరి. కాని ఎవరును ఆమెను తుల్యస్వత్వమును, తుల్యపరాక్రమమును గల మానవునిగా తలపలేదు, కాని నేడో సామాజిక జీవనములో స్త్రీకి ఇది స్త్రీ యనెడి యపేక్షలేకుండ నాగరికత యొక్క యధికారము ప్రాప్తించెను. కనుక ఆమె తన స్త్రీత్వమును రక్షించుకొనుచు వికాసము బొందుచు పురుషులమీద ఆధారపడి పురుషుల నపేక్షించిన జీవితమునుండి పైకి లేవవలెను. సమాజములో స్త్రీ పురుషులకు సహజీవనము ఉండును. ఇద్దఱ జీవనము పరస్పర పోషకమై ఒకదాని నొకటి పూర్తిచేయునదై యుండును. కాని ఇంకమీదట స్త్రీ జీవనము పురుషులను అపేక్షించి పురుషుల మీద ఆధారపడి యుండదు. స్త్రీ తాను పరంపరగా వచ్చు పొరపాటు భావములను వదలి స్వరక్షితురాలయినప్పుడే ఇది కాగలదు. ఇందువలన ఉజ్జ్వలమైన చారిత్ర్యమునకు ఎంత అవసరముగలదో అంతే పవిత్ర జీవికకును అవసరము గలదు, కళంకములేని నడతయే శుద్ధ జీవికయే స్త్రీ యొక్క గౌరవమైన నాగరికత్వమును వాస్తవముగా చేయగలదు.

శోషిత వర్గములోకూడ స్త్రీ నీచముగా శోషితురాలయి యున్నది. పురుషు డెంత నికృష్టుడైనను వాని యధికారము నేటివఱకు చెలాయించినది.

ఇందువలన రాజ్యాంగవిధిలోను విధానములోను ఆవశ్యకమైన పరివర్తనములలో కొన్ని ముఖ్యమైన పరివర్తనములు ఇతరమైన సభ్య రాష్ట్రముల వలె ఆధునిక భారతదేశములోను ఇదివరకే చేయబడినవి. ఇంకను ఆవశ్యకమైన పరివర్తనములు చేయబడుచున్నవి, కాని రాజ్యాంగ విధి వల్ల, విధానమువల్ల లాభము పొందుశక్తి స్త్రీల చారిత్ర్యబలము వల్లనే, ఆత్మబలమువలననే రాగలదు. దాని సూచనలు వినోబా భావములలో నున్నవి. విజ్ఞానయుగము ఆత్మబలముయొక్క మార్గమును ప్రశస్తము చేసెను. కనుక వర్తమాన యుగములో స్త్రీల స్వాధీనజీవితమె పుణ్యపర మగును.

కాశీ　　　　　　　　　　　　　　　　దాదా ధర్మాధికారి

౧౧ అక్టోబరు, ౫౮

## మూడవ ముద్రణకు

# పీఠిక

స్త్రీశక్తి 3వ ముద్రణమును ఆంధ్ర పాఠకలోకానికి సంతోషపూర్వకముగా సమర్పించుకొంటున్నాము. సాధారణముగా తెలుగుపుస్తకాలు, అందులోను మంచి పుస్తకాలు పునర్ముద్రణకే నోచుకోవు. అయినప్పటికీ వినోబాజీ గీతా ప్రవచనము అనేక ముద్రణలు పొంది కొన్ని వేల ప్రతులు పాఠకలోకంలో వ్యాపించినవి. స్త్రీశక్తి 3వ ముద్రణ భాగ్యమును పొందింది. ఈవిధంగా వినోబాజీ భావపరంపరను పాఠకలోకం ఆదరణ పూర్వకంగా స్వీకరించటం శుభభవిష్యత్తునకు సూచనగా మేము భావిస్తున్నాము.

మొదటి రెండు ముద్రణలు అఖిలభారత సర్వసేవాసంఘ పక్షమున సర్వోదయ సాహిత్య ప్రచార సమితి ప్రచురించినది. ఈముద్రణ సర్వోదయ సాహిత్య ప్రచారసమితి (తెనాలి), గాంధీ సాహిత్య ప్రచురణాలయం (హైదరాబాదు)ల సంయుక్త ప్రచురణగా పాఠకలోకానికి సమర్పిస్తున్నాము. బహుశా మున్ముందు చాలా వరకు ఈవిధంగానే ప్రచురణలు వెలువడగలవని ఆశిస్తున్నాము, మా యీ నూతన ఉద్యమాన్ని ఆంధ్ర ప్రజానీకం ఆదరించగలదని విశ్వసిస్తున్నాము. ఇది గాంధీ సాహిత్య ప్రచురణాలయపు 91వ ప్రచురణగా వెలువడుతున్నదని విన్నవిస్తున్నాము.

ఇట్లు
కోదాటి నారాయణరావు
కార్యదర్శి, సంపాదక సమితి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం,
హైదరాబాదు

# అనుక్రమణిక

సోదరసోదరీమణులు ముందుకు రావలయునని మాటి మాటికి నాకు తోచుచున్నది. ఇద్దరో, నలుగురో సోదరీమణులు ఇవతల పడిరి. కాని సోదరు లెంత మంది యున్నారో అంతమంది సోదరీమణులు ముందుకు ఎందుకు రాకూడదు? సార్వజనికమైన చింతనము, బ్రహ్మసాధన మొదలగువాని తీవ్రత సోదరీమణులకు ఎందు కుండగూడదు? సంసారములోనున్న సోదరీమణులు ముందుకు రాలేకపోవచ్చును. కాని ఇంకను సంసారములో అడుగు పెట్టనివారు ముందుకు వచ్చినచో నా భావి జీవనము వారికై కాగలదు. నా దృష్టిలో ఇటువంటివారు ఆరేడుగురు ఉన్నారు. వారు ఈ పనిలో తమ జీవనమును గడపగోరుచున్నారు. ఈ సోదరీమణులు సద్గుణములలో పెద్ద ఆదర్శురాండ్రనుమాట యేమియు లేదు. వారిలో అనేక దోషములుకూడ ఉన్నవి. కాని వారికిగల కోరిక వారి దేశమునకు సేవచేయుటయే.... ఆధ్యాత్మ విచారమునకై పురుషుల కెంత యధికారము ఉన్నదో సోదరీమణులకును అంతే యున్నది. అయినను వారు ముందుకు ఎందుకు రాలేదో ఈ విషయము నా మెదడులోనికి వచ్చుటలేదు.

—వినోబా

# బాపూజీ శతజయంతి ప్రచురణలు

తెనుగుసేత

పాతూరి నాగభూషణం

బా-బాపు : ఆదర్శదంపతులగు బా, బాపుల
పవిత్ర వైవాహిక జీవితగాథలు

గుజరాతీమూలం : ముకుల్ భాయ్ కలార్థీ

ఆంగ్లానువాదం : గురుదయాల్ మల్లిక్

బా, బాపుల గృహస్థ జీవితంలోని ఆసక్తిదాయకమైన ఘటనలు స్త్రీ పురుషుల నిరుపురను సమానంగా అలరించే విషయాలు ౧౧౭ శీరికలక్రింద ఇవ్వబడినవి. అనుబంధములలో 'బా'ను గురించిన బాపు భావాలు ఉటంకించబడినవి.

⅛ క్రౌను xvi+142 పుటలు

వెల మూడురూపాయలు

## బాపూజీ ముచ్చట్లు :

హిందీరచన : విష్ణుప్రభాకర్

మానవోత్తముడైన మహాత్మగాంధి జీవితంలోని కొన్ని ఘటనలు.

⅛ క్రౌను viii+36 పుటలు

వెల 75 పైసలు

## విద్యార్థి గాంధీ :

హిందీసంగ్రహణ : అశోక్

ప్రాథమిక తరగతుల విద్యార్థుల కనువుగా గాంధీజీ ఆత్మకథను సంక్షిప్తపరచి వ్రాసినది.

⅛ క్రౌను viii+36 పుటలు 7 రంగుపటములు

వెల 75 పైసలు

బాపూజీ జీవితఘటనలు

గుజరాతీమూలం : ముకుల్ భాయ్ కలార్థీ

ఆంగ్లానువాదం : హెచ్. యం. వ్యాస్

⅛ క్రౌను viii + 42 పుటలు

వెల 60 పైసలు

మొత్తం 10 పుస్తకాలు.

వివరాలకు, ప్రతులకు

1. గ్రంథాలయ పుస్తకశాల
శ్రీ సర్వోత్తమ భవనము
విజయవాడ-6

2. గాంధీసాహిత్య ప్రచురణాలయం
చిక్కడపల్లి, హైదరాబాదు-20

# స్త్రీ శక్తి

## ఆధ్యాత్మిక సమత్వము

స్త్రీ పురుషులలో భేదము కల్పించు ప్రవృత్తి నాలో లేదు. సమాజములోను కుటుంబములోను రాజకీయములలోను పురుషులకెట్టి యధికారములు కర్తవ్యములు ఉన్నవో స్త్రీలకును అట్టివే యున్నవని నేను అంగీకరింతును. ఇద్దరకును ఆర్థికమైన అధికారములు ఒక్కటైనట్లే నైతికమైన యధికారములును ఒక్కటే. స్త్రీ పురుషులకు ఉండు భేదము బాహ్యములోనే కాని అసలుమూలములో లేదు. దీనికి భిన్నముగాగూడ లోకములో ఒకవిధమైన యభిప్రాయమున్నది. కాని నా యుద్దేశములు నావే. స్త్రీలోను పురుషునిలోనుగల మానవ సంబంధమైన యాత్మయొకటే. కనుక పైకి భేదము కనిపించినను దాని కెక్కువ ప్రాధాన్యము నివ్వనవసరము లేదు. బాహ్యమైన భేదమునుబట్టి యిద్దఱి కార్యక్షేత్రములలో కొంత తేడా యుండుట సహజమే. అయినను ఈ మాత్రపు ఆధారమునుబట్టి లోకులలో మనకు గనిపించు భేదభావము సరియైనదని చెప్పలేము!

### అనర్థకరమైన కావ్యశక్తి

స్త్రీ పురుషుల భేదము మూలములో నున్నదె యని తలచు ఆలోచనాపరులు కొందఱు హిందూదేశములో మధ్యకాలమున బయలుదేఱిరి. వారికిగల ఆధారము కేవలము వారి

లోని కవిత్వ శక్తియె. సాంఖ్యులు సృష్టిని పరీక్షించి రెండు తత్త్వములను కనుగొనిరి. ఒకటి వివిధరూపములను ధరించిన ప్రకృతి. రెండవది అద్వితీయానందముగల చైతన్యము. ఒకదానికి ప్రకృతియని రెండవదానికి పురుషుఁడని వారు పేర్లు పెట్టిరి. రెండింటి సంయోగమువలన సంసారము నడచుచున్న దని వారనిరి. ప్రకృతి అనుశబ్దము స్త్రీ లింగము. పురుషశబ్దము పులింగము. శబ్దగతమైన యీ లింగభేదమునుబట్టి "ప్రకృతి తత్త్వము స్త్రీకిని పురుషతత్త్వము పురుషునకును ప్రతినిధి యగుచున్న"దని కవులనిరి. కొందఱు పరిశోధకులు దీనికొక గంభీరస్వరూపమిచ్చి "స్త్రీ సంసారమందు ఆసక్తురాలయి యుండును. ఆమె మోక్షమునకు అధికారురాలు కాజాలదు. స్త్రీయే కనుక మోక్షము పొందవలసియున్నచో ఆమె మరియొక జన్మలో పురుషుడుగా పుట్టవలసి యుండును" అని వారి మతము. ఈ పరిశోధకుల యీ యాశయసిద్ధికి వారికిగల వికృతబుద్ధియు కావ్యశక్తియు తక్క యింకేయాధారములును లేవు. కాని సాంఖ్యులు ప్రకృతిని ప్రధానమను పేరుతో వ్యవహరించిరి. మఱి యీ శబ్దము పుంలింగమె.

వాస్తవముగా స్త్రీ పురుషులలో చైతన్యమనబడు పురుష తత్త్వము సమానముగనె యున్నది. మఱివారిద్దఱి శరీరములైతే ఆ ప్రకృతి తత్త్వముచేత తయారుచేయబడినవే ఇద్దఱిలోని సంసారాసక్తియు సంసార బంధమును సమానమె. మోక్షాధికారము కూడ ఇద్దఱకును సమానమె. అయినను కావ్యశక్తి ఎంత యనర్థము గలిగించుచున్నదో దానికి ఈ

ప్రకృతి పురుష శబ్దములు ఒక యుదాహరణముగా అయినవి.

దమయంతి యంతఃపురములోనికి వాయువునకు గూడ ప్రవేశము లేదని సంస్కృత కావ్యములలో నేను జదివితిని. ఎందుకు ప్రవేశము లేదు అనగా వాయువు పుంలింగము కనుక పరపురుషునికి దమయంతి యంతఃపురములోనికి ప్రవేశము ఎట్లు కలుగును? నే నిది చదివినప్పుడు దమయంతి యంతఃపురములో వాయువు లేనిచో దమయంతి కెట్టి స్థితి కలుగునోగదాయని నాలో వ్యాకులత కలిగినట్లయినది. కాని మఱుక్షణములోనే నిశ్చింతుఁడనైతిని. ఏలయనఁగా, సరే వాయువు లేకపోతే లేకపోయినదికాని అక్కడ వాయుగతి లేకపోదు. ఏలయనఁగా వాయుగతియన్నది స్త్రీలింగము కనుక. శబ్దముల మహిమ యిట్టిది.

## గుణములతో భేదములేదు

"స్త్రీ సంసారమందు ఆసక్తురాలయి యుండును. పురుషుఁడు మోహాసక్తుఁడయి విరాగియై యుండును" అని పరంపరగా వచ్చెడి యాశయముకంటె నింకొక యాశయముగూడఁ గలదు. "స్త్రీ పురుషునికంటె శ్రేష్ఠురాలు. ఆమెయందు దయాభావము సహజముగ అధికమైయుండును. బాలుర విద్యాశిక్షణమును సహజ శాసనమును స్త్రీలచేతి కప్పగించినచో అహింసకమైన సమాజ నిర్మాణము సులువుగా సిద్ధించును" అని యీ యాశయము చెప్పును. ఇటువంటి పనులలో స్త్రీలు పాల్గొనవలెనని నేను కోరుచున్నాను. ఇంతవఱకు

ఈ పనులు పురుషులు మాత్రమె చేయుచు వచ్చుచున్నారు. కనుక స్త్రీలు ఆ పనులలో పాల్గొన్నచో వానిలో ఒకవిధమైన నూతనత్వము కలుగును" అని నేను ఒప్పుకొందును. కాని నూతన సంస్కర్తలు ఒప్పుకొనుచున్నట్లు నేను ఒప్పుకొనను. ఏలయన దయ మొదలగు గుణములు ఒకేజాతిని ఒకే లింగమును ఆశ్రయించినవికావు. బాహ్యమైన యుపాధినిబట్టి గుణములు ప్రకాశించుటలో అవి ప్రకటమగు పద్ధతిలో భేదము గలుగవచ్చును. కాని యిద్దఱిగుణములలోనే భేదమున్నదనుట మన భావములకు అనుభవములకు విరుద్ధమైన సంగతి. వారి సంగ్రహశక్తిలోను భేదము లేదు.

కాని స్త్రీ పురుషులలో భేదమును అంగీకరించువారు గుణములలోనైతే భేదమును అంగీకరించుటయేగాక గ్రహణ శక్తిలోగూడ భేదాను అంగీకరించుచున్నారు. "స్త్రీల కర్తవ్యములు అనుకూలమైనవే కాని గణితము ప్రతికూలము. పురుషునిలో పరాక్రమస్వభావము అధికముగానుండును. కనుక వాని బుద్ధిలోని గ్రహణశక్తికిని స్వభావమునకును అనుకూలమైన సంగతులే వారి యధ్యయనమునకు విషయము కావలయును. ఇట్లే స్త్రీలలో సౌందర్యభావన, కరుణ మొదలైనమృదుశక్తులు ఎక్కువగానుండును. అట్లే వారి గ్రహణశక్తికి అనుకూలమైన సంగతులె వారి యధ్యయనమునకు విషయమై యుండవలయును" అని వారు చెప్పుదురు. కాని వారియందున్న మూల స్వభావములను ఉపాధివలన కలిపిన భేదములను చక్కఁగా విడమర్చి చూడకపోవుటవలన ఈ భ్రాంతులు కలుగుచున్నవని నా యభిప్రాయము.

## ప్రతిష్ఠలోను భేదములేదు

నయీతాలీము (నూతనవిద్యావిధానము)లో బాలురు కూడ వంటపని నేర్చుకొనుచున్నారు. దీనికి ఒక సోదరుడొక యభ్యంతరమును లేవదీసెను. బాలురకు శిక్షణ యిచ్చు సమయమును పాడుచేసి ఎందుకు మీరు మమ్ము ప్రొయ్యిలో కుక్కదలచుచున్నారు. అని అతడు దుఃఖించెను. వాని యుద్దేశము ఈ ప్రొయ్యిలో బాలికలనే కుక్కవలయునని. ఏలయన పొయ్యిలో కట్టెలను కుక్కవచ్చును. మఱియు స్త్రీలు స్త్రీలింగములు * కట్టెలు స్త్రీసమములేగదా అని వారి ఉద్దేశము. అపుడు నేను వారితో "కాష్ఠములను మండింపవచ్చునుగదా, పురుషులతోపాటు కాష్ఠములు (కట్టెలు) పుంలింగములు" అని యంటిని. బాలురచే వంటవండించుట అగ్నికి ఇష్టముగానిది కాదు. జొన్న రొట్టెకు లింగభేదము తెలియనే తెలియదు. అది స్త్రీ పురుషుల యాకలిని సమభావముతోనె శాంతి పఱచును. ఆకలికికూడ లింగభేదము తెలియదు. మఱి చెప్ప వలసినది ఇంకేమియు లేనిచో ప్రతిష్ఠా సమస్యను లోకులు లేవనెత్తెదరు. ప్రతిష్ఠ అన్నది స్త్రీకిని లేదు పురుషునకును లేదు అని మనము తెలిసికొనవలయును. ప్రతిష్ఠకు యోగ్యులైన వారియందు మాత్రమె అది యుండును. ప్రతిష్ఠకు ఏ విశేష కర్మతోడను సంబంధములేదు.

---

* తెలుగు వ్యాకరణములో డు ము వు ప్రత్యయములు లేక స్త్రీ లింగ శబ్దములతో సమానముగానుండు పదములు స్త్రీసమములు అనబడును. ఇక్కడ కట్టెలు స్త్రీ సమ శబ్దమని భావము.

## సంపర్కమువలన కలుగు గుణదోషములు

బాలికలు బాలురతోగూడ ఉండుటను కొందఱు ఆక్షేపింతురు. బాలికలు బాలురతో గలిసియుండి చేయు విద్యాది ప్రయోగములు హానికరమని వారందురు. కాని మనము చేయు ప్రయోగమునుబట్టి ఆ ప్రయోగము స్థిరపడును. అది మనశక్తిమీాద ఆధారపడియుండును. ఎవరైనఇద్దరు వ్యక్తులు కలిసియున్నప్పుడు కొన్ని గుణములు కొన్ని కష్టములు ఎట్లు కలుగునో అట్టివే ఇక్కడను కలుగును. "అయితే మీారు బ్రాహ్మణ బాలురను హరిజన బాలురను ఒకే విద్యార్థి నివాస గృహములో ఉంచెదరా? సంపర్కమువల్ల నష్టము ఏమియు కలుగదా?" అని కొందరు నన్ను ప్రశ్నించుచున్నారు. "అట్టి భయము నాకును లేకపోలేదు. బ్రాహ్మణ బాలురు హరిజన బాలురు కలిసియున్నప్పుడు బ్రాహ్మణుల వరకే యున్న గర్వము హరిజనులలోగూడ వ్యాపించునను భయము తప్పకుండ ఉన్నది. కాని మనము వారికి శిక్షణ యివ్వ ప్రారంభించునపుడు అటువంటి కష్టములను ఎత్తివేయ వలసియే యుండును. కష్టములు లేనిచోట సాధన కవకాశమే లేదు. సాధనలేనిచోట శిక్షణమును ఉండదు. నాకే సాహసము లేకుండినచో నా అపజయమును, నా వోటమిని నేను ఒప్పుకొందును. కాని సిద్ధాంతమును అట్లే స్థిరముగా ఉంచెదను." అని నేను చెప్పుదును.

## గురుమంత్రము

ఒక బాలిక యిట్లు అన్నది: "భగవద్గీతలోనైతే స్త్రీలకే యుపదేశమును శిక్షణమును ఇచ్చినట్లు కనిపించదు.

అందులో స్థితప్రజ్ఞునిగూర్చి గుణాతీతునిగూర్చి యోగిని గూర్చి చెప్పబడినదేకాని స్థితప్రజ్ఞురాలినిగూర్చిగాని గుణాతీతురాలిని గూర్చిగాని యోగినిని గూర్చిగాని లక్షణములు చెప్పబడలేదు"అని. బహుశా ఆమె "వాడు, ఆమె" అని యీ విధముగా శాసనములలోని భాషను గోరుచున్నదను కొందును. అప్పుడు నేనిట్లంటిని. "దానిని గూర్చి నీవేమియు చింతింపకు. గీత స్వయముగా తనంతతాను స్త్రీలింగమెగదా. దాని యుదరములో స్థితప్రజ్ఞుడు మొదలగువారు పడియే యున్నారు. మనకు "తత్త్వమసి" (అది నీవైయున్నావు) అను గొప్ప మంత్రము దొరకినది. తెలుపు - నలుపు, హరిజనులు - పరిజనులు, హిందువులు - ముసల్మానులు, స్త్రీలు-పురుషులు ఇవన్నీ భ్రాంతులే. నీవు వీనికంటె భిన్నమైన విశుద్ధమైన కేవలాత్మవు. నీవు శవమవుకావు, శివుడవు. నీవు నేను మొదలైన వన్నియు శవములే, పీనుగులె. బ్రతికి యున్నది ఒక్క ఆత్మతత్త్వము మాత్రమె. దానిని గుర్తించి దానిని మఱచిపో. భేదములలో అభేదమును గుర్తించుటయె ఆత్మబుద్ధికి లక్షణము. భేదములను పెంచుకొనుటయే హీన బుద్ధికి లక్షణము. అది పురుషార్థ హీనత.

మహిళాశ్రమ పత్రిక

నవంబరు ౭౬

## సమత్వముతోపాటు వివేకముకూడ ఉండవలెను

సమత్వ సిద్ధాంతము ప్రతి యుగములోను సంగతము గానె యుండును. కాని నేటివలె ఏ కాలములోను సమత్వము

కోసమై భూమి పంచవలసిన యవసరము కలుగలేదు. ఆ కాలములో ఓటుహక్కు అవసరము కలుగలేదు. నేడు అది యవసరమైనది. అందరకు ఓటుహక్కు లభింపవలెనను భావనయు, జాగృతియు నేడు కలిగినది. మనము హిందూ దేశములో స్త్రీ పురుషులను సమానముగనే చూచుచున్నాము. వారిలో ఏ భేదమును మన్నించుటలేదు. కనుక స్త్రీలకు ఓటు అధికారము లభించినది. కాని నేడుకూడ కొన్ని పాశ్చాత్య దేశములలో స్త్రీలకు ఓటు అధికారములేదు. మరి ఆ దేశపు స్త్రీలకు దానిని గురించిన కోరికయులేదు. ఇది పురుషులపని. వారినే చేయనివ్వండి అని వారు చెప్పుదురు. స్త్రీ పురుషులలో సమత్వము ప్రాచీనకాలమునుండి కనీసము ఆలోచనలలోనైనను అంగీకరింపఁబడినది. కాని ఆచరణలో నేడుగూడ అంగీకరింపబడలేదు. మరి దానిని సంస్కరింప వలసిన యవసరమున్నది.

మన శాస్త్రములు చెప్పునది యేమనగా స్త్రీ పురుషులిద్దఱకు మోక్షమందు సమానాధికారము ఉన్నదని. మనము కేవలము రామునిపేరు కృష్ణునిపేరు మాత్రమేగాక సీతారాముల, రాధాకృష్ణులపేర్లు చెప్పుకొనుచున్నాము. బ్రహ్మవిద్య విషయములో మనము వెళ్ళినంత ముందుకు ప్రపంచములో ఏ యితర దేశమును వెళ్ళలేదు. స్త్రీ పురుషుల సమానత్వమును మనము అంగీకరించుచున్నాము. కనుకనే సీతారాములని యనుచున్నాము. వాస్తవమునకు ఈశ్వరుడొక్కడే అను మూలతత్త్వమును మనము ఎఱుగకపోలేదు. ఇందువలన హిందూదేశములో స్త్రీలకు ఓటు హక్కు

సిద్ధించుటకై ఆందోళనము చేయవలసిన పని కలుగలేదు. ఇంగ్లండులో ఏబదేండ్ల వరకు స్త్రీలు అట్టి ఆందోళన చేయవలసి వచ్చెను. మఱియు బీదలకు విరోధులైన ధనికుల సమస్యలు లేచినట్లుగానె స్త్రీలకు విరోధులైన పురుషుల సమస్యలును లేవవలసి వచ్చెను. కాని యిక్కడి స్త్రీలకు దీనియవసరము కలుగలేదు. ఏలయన, ఇక్కడి వాతావరణములో ఆధ్యాత్మికమైన మానసికమైన యధికారములు సమానములగు సంగతి ప్రాచీన కాలమునుండి వచ్చుచున్నవి. హిందూదేశమువంటి దేశములో ఇట్టి సమానత్వమును గూర్చిన యాలోచనలు ప్రాచీన కాలమునుండి వచ్చుచునే యున్నవి.

సమత్వ ప్రవృత్తితోపాటు వివేక బుద్ధికూడ ఉండవలెను. విదేశీయులు సమానత్వమును గూర్చి చెప్పుచుందురు కాని అక్కడ అవివేకముచే పనులు చేయబడుచున్నవి. హత్యలు, హింసలద్వారా సమానత్వము తెచ్చుటకు చేయు ప్రయత్నము లన్నియు వివేకశూన్యములు. అదేమియు పెద్ద సమత్వముకాదు. వారైతే సమత్వమను పేరుతో ఒకటే మూసలో పడవేయ దలచుచున్నారు. అందఱును ఒకటే మూసలో పోతపోయుట మనకెప్పుడును ఇష్టముకాదు. మనము మానసిక సమానత్వమును మన్నించుచున్నాము. దేహమునకు ఎంత యవసరమో అంత సమత్వమునె మనము కోరుచున్నాము. తల్లి పిల్లలకు అన్నము పెట్టునపుడు చిన్న పిల్లవానికి ఎక్కువ పాలును, కొంచెము పెద్దవాని తక్కువ పాలును, పెద్దవానికి అన్నమును, రొట్టెయును పెట్టును. గణి

తము ప్రకారము అందరు పిల్లలకు సమానము పాలుగాని, అన్నముగాని పెట్టరు. మన సమత్వముకూడ ఇట్టి వివేకముతో కూడినదే. ఇంటిలోవలెనే సంఘములోని జనులకు వారి ఆకలికి వారి జీర్ణశక్తికి తగిన విధముగా వారికి ఆహారము ఇచ్చెదము. పాలు ఇవ్వవలసిన వారికి పాలును, అన్నము పెట్టవలసిన వారికి అన్నమును పెట్టెదము. ఇట్లు వివేకముతో ప్రవర్తింపక సమత్వమును దెచ్చినచో అది పనికిరాలిన దగును. కనుక హింసద్వారా తెచ్చిన సమత్వము వివేక శూన్యమగును. మనమో ఆధ్యాత్మిక సమత్వమునె కోరుచున్నాము. ఇదే సనాతన ధర్మ చింతనము.

లోహరదగా

౨౪-౧౧-౫౨

## అన్నిచోట్ల ఒకే సమానమైన స్త్రీశక్తి

భారతదేశములోని జనులందఱిలో ఒకే విధమైన స్త్రీశక్తి పడియున్నదన్నది మనము తెలిసికొనవలసినసంగతి. స్త్రీలలోనైతే ఆశక్తి యుండనేయున్నది. స్త్రీలలో ఏశక్తియైన ఉన్నదా లేదా అని కొందఱి యాశంక. కాని స్త్రీలలో మాత్రము ఆశక్తి యుండనేయున్నది. దీనితోపాటు ఇక్కడి పురుషులలోఁగూడ ఆశక్తి పడియున్నది. ఈ విచిత్ర సంగతి మీకు నేను చెప్పుచున్నను స్త్రీ అబలయని రక్షింపదగినది యని చాలమంది యందురు. స్త్రీకి ఏదో యొకశక్తి యుండనే యుండును. అయినను దానికి రక్షణ యగుచునే యుండును. ఇక్కడి స్త్రీలను తరువాత తరువాత అబలలని చెప్పసాగిరి.

అసలు స్త్రీల మొదటి పేరు మహిళ. మహిళ అనఁగా మహా శక్తిశాలిని యని యర్థము.

మన దేశములో స్త్రీమూర్తియె శక్తిగామన్నింప బడినది. పురుషమూర్తిని శక్తియని యనలేదు. "మహిషా సురుని మర్దింపవలసి యున్నది. మహిషాసురుడు దేవతలను మనుష్యులను బాధింపసాగెను. ఆ మహిషాసురుని నుండి మన కెట్లు ముక్తి గలుగును" అను సమస్యరాఁగా దేవతలందఱు విష్ణువు దగ్గరకు చేరిరి. చివరకు అందఱుకూడి శక్తిమాత దగ్గరకుపోయి మహిషాసురునినుండి మాకు ముక్తి కలిగింపు మమ్మా, అని ప్రార్థన చేసిరి. అపుడాతల్లి "మీరందఱు మీమీ దగ్గఱఉన్న శస్త్రము లన్నిటిని నాకప్పగింపుఁడు" అనెను. అప్పుడు విష్ణువు శంకరుఁడు, తమ శస్త్రములను ఆమెకిచ్చి వేసిరి. ఎవరెవరి దగ్గఱ ఏయే శస్త్రము లున్నవో అవి యన్నియు ఆమెకిచ్చి వేసిరి. అపుడు ఆ శక్తి మహిషాసురుని మర్దించినది. ఈ కథ పురాణములలో నున్నది కనుక హిందూ దేశములో స్త్రీనే శక్తిగా ఆరాధింతురు.

ఇందువలన తేలినదేమనగా "హిందూ దేశములో ఆ స్త్రీశక్తి స్త్రీలలో ఉండనేయున్నది." అని. కాని అది పురుషు లలోకూడ వున్నది. అనగా హిందూ దేశములోని పురుషులలో కొన్ని అంశములు స్త్రీలవే యున్నవి. మన దేశములో కేవలము రామనామమును మాత్రమేగాక సీతారామ నామ మును, కృష్ణనామమును మాత్రమేగాక రాధాకృష్ణ నామ మునుగూడ స్వీకరించిరి. ఇద్దఱను ఒకేచోట చేర్చి మనము చింతన చేయుచున్నాము. దానికి ఫలితముగా ఒక విచిత్ర

చిత్రము హిందూదేశములో మనకు గనిపించుచున్నది. ప్రపంచములోని ఏ చిత్రకారుడుగాని, కళాకారుడుగాని దానిని ఊహించి యుండడు. అదే అర్ధనారీశ్వర నటరాజు చిత్రము. ప్రపంచములో ఏ యితర దేశమునందును ఇట్టి చిత్రమును చూతమన్నను దొరకదు. ఈ హిందూ దేశపు భావనలో ఒక యద్భుతమైన గొప్ప ప్రతిభయున్నది. హిందూదేశ కవులు ఈ ప్రతిభను ఎఱుగుదురు కనుక వారెప్పుడు స్త్రీలను గౌరవించుచునే వచ్చిరి. ఇది భారత దేశముయొక్క విశేషతయని చెప్పదలచు చున్నాను. స్త్రీల గుణములు హిందూదేశ స్త్రీలలో పూర్తిగా ప్రకటితమయి యున్నవి. అటువంటి స్త్రీ శక్తిని ఉపయోగించు యోజన హిందూదేశములోనే చేసినచో హిందూదేశమును ఉద్ధరించు తాళముచెవి హిందూదేశమునకే దొరకును.

సాబర్మతి (అహమ్మదాబాద్)
౨౧-౧౨-౪౮

---

## ౨ సామాజిక సమత్వము

### అభేదమును ఎట్లు తీసికొని వత్తుము

స్త్రీ పురుషులలో గల తేడా ప్రపంచమునకు తెలియును. దానిని తీసివేయ వలయునని ఎవరికిని కోరిక లేదు. శక్తియును లేదు. కాని ఆ బాహ్యమైన తేడా యొక్క స్వరూపము లోకులలో ఏవిధముగానైనదో అది అట్టిదిమాత్రముగాదు.

కేవలము అదియొక దృష్టితో చేసిన యోజనమాత్రమె. దానికి మూలములో ఒక పవిత్ర భావన యున్నది. సంతానమును గలిగించుటకు అదియొక సాధనము మాత్రమే. కాని మనుష్యుడు దీనిని మిక్కిలి దురుపయోగము చేసెను. వాస్తవమునకు అదియొక శాస్త్రీయ వస్తువు. కాని నేడు అది లజ్జావిషయమైనది. ఆ విషయమునుగూర్చి బహిరంగముగా మాటలాడుటకూడ చేయలేము. సంఘము శాస్త్రీయధారణ గలిగిన దైనప్పుడు ఇందున్న పొరపాటు భావనలన్నియు దూరమగును. నేడు ఈ విషయ మెంత దురుపయోగమగు చున్నదో అప్పుడు అట్లు కానేరదు. కనుకనే ఈ బాహ్య భేదము నను మఱచిపోవలయునని నేను చెప్పుచున్నాను. ఆంతరిక మైన యభేదపు పునాదిమీదనే మానవదృష్టితో మన జీవనమును నిర్మింపవలయును.

## శిక్షణలో అభేదము

"అయితే స్త్రీ పురుషులకిచ్చు విద్యాశిక్షణలో ఏ మాత్రము భేదమును మీరు చేయరా" అని లోకులు అడుగు చున్నారు. ఇట్లు పురుషుల శిక్షణములోగూడ అగును అని నేను చెప్పుచున్నాను పురుషునికి యోగ్యతనుబట్టి భేదము కలుగును. దానిని అనుసరించి విశేష శిక్షణము ఇవ్వబడుచునే యుండును. కాని సర్వసామాన్యముగానిచ్చు శిక్షణ దృష్టిలో ఒకనికి ఇంకొకనికి భేదము చేయబడదు. ఇట్లే స్త్రీలవిషయములో అని గ్రహింపవలయును. "పిల్లల విషయమై జాగ్రత్త వహించి శిక్షణయిచ్చుట స్త్రీ శిక్షణలో ముఖ్యవిషయము

కాదా”అని యొక సోదరి యడిగినది. అవును అది నిజమే. కాని దానియర్థము పురుషులకు పిల్లలవిషయమైన శిక్షణ యిచ్చుట యనవసరమని యన్నచో దానిని నేను అంగీకరింపను. సంతానము తల్లిదండ్రు లిద్దఱకు సంబంధించినవారేగదా. కనుక సంతానము జాగ్రత్తకు సంబంధించిన జ్ఞానము ఇద్దఱకుతప్పక యుండితీరవలయును. అవును. తల్లికి ఇంకను విశేషముగా ఉండవలయునని మాత్రము అంగీకరింపవచ్చును. దృష్టిలో ఆమూలాల పరివర్తనము అవసరము.

కానియిది చాల స్థూలమైన భేదము. ముఖ్యమైన సంగతి యేమనఁగా, “స్త్రీ పురుషులను గూర్చిన నేటి మన దృష్టిలో ఆమూలపరివర్తనము అవసరమైయున్నది.”

ఒక యుదాహరణము తీసికొనుడు. “ఇవి సీత నగలగునా కావా గుర్తింపు”మని లక్ష్మణునిముందు ఉంచినపుడు లక్ష్మణుఁడీక్రింది విధముఁగా జెప్పినట్లు రామాయణములో మనము చదువుచున్నాము.

శ్లో॥ “నాహంజానామి కేయూరే, నాహంజానామి కుండలే
నూపురేత్వభిజానామి, నిత్యం పాదాభివందనాత్”
“నేనెఱుంగ భుజపురు, లెఱుంగఁగుండలంబులన్
అందెల్ మాత్రమెఱుంగుదు, నెప్డున్ గాళ్ళకు
మ్రొక్కుటన్”

అని ఏమి మనము ఈ పద్యములోని స్థూలార్థము తీసుకొందమా లేక యాయర్థమును ఆదర్శముగా మన్నింతమా? “పవిత్రభావన యున్నవాఁడు ఏ స్త్రీ మొగమువైపును చూడనైన చూడరాదు.” అన్నది స్థూలార్థము.

వాల్మీకి యాశయ మిదేమైనచో దీనిలో ఉత్తమత్వము లేదు. ఇది చాల యప్రధానమైన యాదర్శము. కాని ఇది వాల్మీకి యాశయముకాదని నేనెరుంగుదును. కాళ్ళకుప్రెముక్కుటయను సంగతిని చర్చించి లక్ష్మణుడు కేవలము తన పూజ్య భావనను ప్రకట పఱచెను. దీని కారణమేమనఁగా, మన మే దేవతనైనను ధ్యానింపవలసినపుడు తఱచు ఆ దేవత పాదాబ్జములను ధ్యానింతుము. ఒకవేళ తనయన్న రాముని భూషణములను గుర్తుపట్టవలసిన యవసరము వచ్చినను లక్ష్మణుడు ఈ జవాబునే యిచ్చి యుండును. ఏలయన వాని విషయములోఁగూడ అతని భావనయదే.

వాస్తవముగా సౌందర్యమును జూచినందువలన బుద్ధి పవిత్రముకావలయునేగాని మలినముకారాదు. సూర్యోదయ దర్శనమువలన, ప్రవహించుచున్న నదిలోని నిర్మల జలమును చూచుటవలన బుద్ధి పావనమగును. సౌందర్య దర్శనమువలన బుద్ధి మలినమగుచున్నదనఁగా అక్కడ వికృతబుద్ధి యొక్క లక్షణములు ప్రకటమగుచున్న వన్నమాట.

## పవిత్రత ఆంతరికమైన వస్తువు

మనదేశములో స్త్రీ పురుషులొకరితో నొకరు కలిసి యుండు విషయములోఁగూడ కావలసినన్ని ప్రశ్నలుదయించు చున్నవి. స్త్రీ పురుషులు కలిసి యున్నప్పుడు వాతావరణము పవిత్రముగా నెట్లుండును? అనియె దానిలో చింతకలుగు చున్నది. పవిత్రతను గుఱించిన చింత నాకును గలదు. నేడు ఎంత పవిత్రతయున్నదో అంతకంటె వేయిరెట్లు పవిత్రతను

నేను కోరుచున్నాను. ఏలయన 'నేడు మనలో నున్న పవిత్రత పైపైది మాత్రమే అని నే నెఱుగుదును. సంఘము పవిత్రతకు ఏమాత్రము రక్షణ యివ్వలేదని నేననను. కొంచెము రక్షణ యిచ్చినది. కాని అదియైనను కొన్ని యడ్డుగోడలు పెట్టి. దీనివల్ల పవిత్రతయొక్క చాలభాగము ఆ భాగము మాత్రముగనే నిర్మాణము కాగలదు.

పవిత్రత ఆంతరికవస్తువు. స్త్రీ పురుషులు ఒకచోట ఉండుటకంటె పవిత్రులుగా నగుటకు ఎక్కువ సాయపడ వలయునని నేనొప్పుకొందును. కాని నేటి వాతావరణము దానికి విపరీతముగ నున్నది. దానికి కారణము మన సాహిత్యమె. నేనొక్క యర్వాచీన సాహిత్యము సంగతినిగూర్చి మాత్రమె చెప్పుటలేదు. అది బహుశా దాని పరిణామమె. ప్రాచీన సాహిత్యమె దీనికి బాధ్యత వహింపవలసియున్నది. ఈ సాహిత్యములో ధార్మిక మనబడు సాహిత్యమునుగూడ సమావేశపఱచుచున్నాను. సాహిత్యదృష్టి కలుషితమై పోయినది. దానికి మనము విసరి పాఱవేయవలసియుండును. దృష్టికి మనము కాటుక పెట్టుకొనవలసియుండును. బుద్ధిని శుద్ధిపరచవలసియుండును.

సంస్కృత కవులు స్త్రీని భీరువుగా వర్ణించిరి. భీరువు అనగా పాపభీరువు అని యర్థమైనచో అది యొక యుత్తమ విశేషణమై యుండెడిది. కాని భీరువు అనగా పిఱికి యను నర్థములో వారు దానిని ప్రశంసారూపములు ఇచ్చిన ఇవ్వనిండు. కాని స్వీకరించినవారు ఏమని స్వీకరించిరి? వారు దానిని

ప్రశంసకే స్వీకరింపలేదు. సంతోషముతో స్వీకరించిరి. ఇది పురుషులందఱు పనేయని మీరు చెప్పుదురు. అప్పుడైతే జడము – చేతనముల సంగతిని మీరు అంగీకరించిన వారగుదురు. నిజముగా పురుషుఁడు చేతనము, స్త్రీ జడమునా ? స్త్రీ జడమే యైనచో గడియారమువలె ఆమెను ఎక్కడ ఉంచిన అక్కడనే పడియుండవలసియున్నది.

## స్త్రీ ల బా ధ్య త

స్త్రీల దుర్దశకు చాలవరకు పురుషులే బాధ్యులని నేను మొదటనే యొప్పుకొంటిని. నేను పురుషుడనుగా సమస్తమైన బాధ్యత వహించుటకు నేను ఇష్టపడుదునేకాని అయినను అది సరికాజాలదు. ఏలయన, రెండు చేతన వస్తువులలో అన్యోన్య పరిణామములకు బాధ్యత కేవలము ఒకనిమీదనె పడవేయ బడజాలదు. నేనె గనుక స్త్రీనైనచో వెంటనే పురుషులందఱకు ఈ బాధ్యతనుండి విడుదల యిప్పించి యుండెడివాడను. ఈ బాధ్యత యంతయు నాదేయని చెప్పి యుందును. నేను జడమునై, స్త్రీగాగాని పురుషుడుగాగాని యుండకున్నచో నోరుమూసికొని పడియుండెడివాడనే. నేనేమో చేతనమునైతినిగదా. కనుక సమస్తమైన బాధ్యత ఇతరులమీద పడవేయుట కెట్లు ఇష్టపడుదును.

## క్రాంతికరమైన ప్రవృత్తిని తీసికొనివత్తము

నేనేగనుక స్త్రీనైనచో ఎంతగా తిరుగుబాటు లేవదీసి యుందునో ఎఱుగను. కాని స్త్రీలవైపునుండి యొక తిరుగుబాటు రావలయునని మాత్రము నేను కోరుచున్నాను. కాని

వైరాగ్య మూర్తియైన స్త్రీ అట్టి తిరుగుబాటును లేవ దీయునా? వైరాగ్య ప్రవృత్తి ప్రకటమైనచో అప్పుడే మాతృత్వముగూడ సిద్ధమగును. కనుక స్త్రీలలో శంకరాచార్యుని వంటి తేజస్విసియైన స్త్రీ ఆవిర్భవించినచో అప్పుడు వారికి ఉద్ధరణ జరుగును. స్త్రీలు స్వాతంత్ర్యము కోరువారే యైనచో వారు భోగలాలసలో కొట్టుకొని పోరాదు.

పోలికలో పట్టణవాసపు స్త్రీకంటె పల్లెటూరి స్త్రీ ఎక్కువ స్వతంత్రురాలని నేననుకొనుచున్నాను. ఆమె దుర్మార్గుడైన తన భర్త చెంప వాయించిన సంగతి నేను స్వయముగా జూచితిని. ఈ సంగతి చదువుకొన్న భార్యది గాదు. అక్షరములురాని భార్యది. చదువుకొన్న స్త్రీలు ఎక్కువగా అణగియుండుటను చూచుచున్నాను. వారు చదువుకొన్న వారగుటచేగాదు సుఖాభిలాషిణులై యున్నారు గనుక. అడవిలోని సింహము సుఖాభిలాషియయి యుండదు. కనుక స్వైరవిహారము చేయుచు స్వతంత్రముగా నుండగలుగు చున్నది.

తిరుగుబాటుచేయు ప్రవృత్తిలోను వినయశీలతకును ఏ విరోధమును లేదు. వినయస్వభావమువల్లనైతే తిరుగుబాటు ఎక్కువ శక్తిగలదగును. బుద్ధిపూర్వకముగ తెలిసి ఉచితమెఱిగి ఏదైన యుచితమైన ఆజ్ఞను మన్నించుటయే వినయశీలత. అనుచితమైన ఆజ్ఞను మన్నింపక పోవుటయే తిరుగుబాటు. అనగా మఱి యీ తిరుగుబాటు వినయపూర్వకముగా ఉండవచ్చును. అందులో స్వతంత్రతయున్నది.

ఇద్దఱునుకలసి ఒకరితోపమునొకరు పూర్తిచేయుదురుగాక

స్త్రీ పురుషులు ఒకరికొకరు అనిష్టమును గలిగించు వారు అని చెప్పుచు స్త్రీ నిప్పు, పురుషుడు నేయి అని నిప్పు నేయిదృష్టాంత మీయబడుచున్నది.

దృష్టాంతము దీనికి వ్యతిరేకముగాగూడ నీయ వచ్చును. స్త్రీ పురుషు లొకరికొకరు రక్షకులుగాగూడా నుండ వచ్చును. స్త్రీ పురుషుని, పురుషుడు స్త్రీని రక్షించుదురు గాక. స్త్రీ పురుషులు పరస్పరము తమలోని లోటుపాట్లను సరిదిద్దుకొని పూర్తిచేసికొనుచు పరిపూర్ణులైన స్త్రీ పురుషులుగా అగుదురుగాక. అనగా పురుషుడు స్త్రీగాను స్త్రీ పురుషుడుగాను అయి యిద్దఱు పరిపూర్ణులు గావలసి యుందురు.

పరిపూర్ణులగు పద్ధతి యిటువంటిదే, అందులో పురుషుడు స్త్రీ కావలసియుండును, స్త్రీ పురుషుడు కావలసియుండును. కూలివాడు విద్యావంతుడై-విద్యావంతుడు కూలివాఁడు కావలసియుండును. ఇక్కడ ఆశ్రమములో ఒక విద్వాంసుడు వంట వండుచుండగా చూచి కొందఱు ఇట్లు ప్రశ్నింపసాగిరి. "ఇటువంటి విద్వాంసునికి మీరు వంటపని యప్పగించితి రేల" అని. అప్పుడు నేనిట్లంటిని "తమ్ముఁడా! నేనేమి చేయుదును. ఇప్పుడైతే విద్వాంసుడే, అయినను మఱి యితనికి ఆకలి వేయుచున్నది. లేకపోతే యితనిని వంటపని కప్పగించి యుండను. స్త్రీలకు అయితే వంటపని చేతనగును. వంట చేతకానివారు ఆ వంటపని నేర్చుకొనవలసినదే. పరిపూర్ణ ప్రక్రియ యిదే.

## అహింసకు మనము అగ్రదూతల మగుదుముగాక

కొందఱు సోదరీమణులు వచ్చి "మమ్ము మా రక్షణ నెట్లు చేసికొనమందురు?" అని అడుగుచుందురు. నేను వారి కిట్లు చెప్పుదును: "ఇందులో మీరు ఆలోచించవలసిన దేమియు లేదు." మనము స్త్రీలోను పురుషునిలోను తేడా చూపరాదు. ఇద్దఱను పరిపూర్ణులను గావింపవలయును. పురుషు డెట్లు తన రక్షణ చేసికొనుటకు సహజముగా సమర్థుడని అనుకొందుమో — (అతడు ఎన్నోసారులు అట్లు ఆత్మ రక్షణ చేసికొనలేదు లెండు) — అట్లే మనమును మన రక్షణ చేసుకొనగలము అను విశ్వాసము మనము మన హృదయములో ఉంచుకొనవలయును" అని. అప్పుడా సోదరీమణు లిట్లు అనిరి. "పురుషుల దగ్గరనైతే కత్తియున్నది." అని "అయితే అదేమీకు వచ్చినలోటు అయినచో మీరును కత్తిని దగ్గర ఉంచుకొనవచ్చును. ఏ హక్కు పురుషుల కుండునో అది మీకును ఉండవలసినదే. కాని ప్రతి పరిస్థితి లోను మీరు నిర్భయురాండ్రు కావలయును. కత్తివలన నిర్భయత్వము కలుగునను విశ్వాసము నాకు లేదు. నిర్భయుడైన మనిషి చేతిలోకూడ కత్తి పనికివచ్చునన్నది వేఱు సంగతి. కాని పురుషుడుగాని స్త్రీగాని తాను కత్తిపట్టి తన గొప్పదనము ప్రకటించుకొని కత్తిమీదనే సమాజ నిర్మాణము కావలయునని తలచి నమ్మినచో అపుడు స్త్రీ పురుషు లిద్దఱకు పాశ్చాత్య దేశములందువలె ఇట్టి క్షేత్రము తెఱవబడి యుండవలెను. అహింసను ఆచరణలో పెట్టుటలో స్త్రీలే ముందడుగు వేయగలరు. కాని అట్లు చేయుటలో వారు

అసమర్థురాండ్రైనచో మనము వారిద్దఱిలో తేడా చేయనే రాదు.

## భాషను సరిచేయుడు

నేనైతే స్త్రీ పురుషులను భాషలోగూడ తేడా చూప తలపోయను. హిందీ, మరాఠీ, తెలుగు మొదలగు భాషలలో వ్యర్థమైన యీ భేదము కలిగినదా ప్రతి వాక్యములోను నేను పురుషుడను, నేను పురుషుడను, నేను పురుషుడను, నేను స్త్రీని, నేను స్త్రీని, నేను స్త్రీని అని చెప్పబడుచున్నది. ఇద్దరలోను వెళ్ళుట అనుక్రియయైతే సమానమె. కాని వాడు వెళ్ళినాడు, ఆమె వెళ్ళినది అని విభక్తి ప్రత్యయములలో భేదము వ్యవహరింపబడుచున్నది. దీనికి అవసరమేమున్నది? జీవనములో వచ్చిన కృత్రిమతకు లక్షణముగా దీనిని మన మనుకొనవచ్చును. ఏమైననుసరే మన మీ భాషను గూడ సరిదిద్దవలయును. ఇది గాలిలో ఎగిరి చెప్పు మాటగాదు. ఇది ఈ భూమిమీది మాటయె. స్త్రీ పురుషులు సమానముగా మాట్లాడునపుడు రూఢ భాషలో లింగభేద మున్నను పురుషులతో సమానముగా స్త్రీలుగూడ "నేను వచ్చుచుంటిని" అని చెప్పుచున్నారు.

"ప్రతియొక సోదరియు ఆత్మనిష్ఠురాలు కావలయు" నని మాత్రమె చివరకు నేను చెప్పగోరునది. నాకు మాత్రము "నిర్భయ" శబ్దముగూడ అంతగా నచ్చదు. భయముతో పరిచయములేని బాలుడు "నిర్భయ" శబ్దము తెలిసికొనలేడు. కనుక "ఆత్మనిష్ఠ" పదమునే నేను వాడితిని. మీలో ఆత్మ

నిష్ఠ హెచ్చగవలయుననియె భావన. ఆ యాత్మనిష్ఠ పెరుగ బోవుచున్నదను శ్రద్ధయుండుట నాకు ప్రియముగా తోచుచున్నది.

మహిళా ఆశ్రమ పత్రిక,
నవంబరు ౧౯౪౬.

## స్త్రీలను పురుషులు దోచుకొనుచున్నారు

వార్ధాలో మా సోదరులు పారిశుద్ధ్య కార్యము చేయుటకు వెళ్ళుచుందురు. అక్కడ ముఖ్యముగా భంగీస్త్రీలే పారిశుద్ధ్య కార్యమును చేయవలసి వచ్చుచున్నదని మా సోదరుల వలన దెలిసినది. మురికిమైన మరుగుదొడ్ల నుండి తగిన సాధనములు లేకుండ మలమును ఆ స్త్రీలే బాగుచేయవలసి వచ్చుచున్నది. వారే ఆ మలమును నెత్తిమీద పెట్టుకొని మోయుచు తీసికొని డబ్బాలలో నింపి బండ్లలోనికి తీసికొని పోవుచున్నారు. భంగీపురుషులు కేవలము బండ్లనుమాత్రమె బాగుచేసివత్తురు. అనఁగా అక్కడి పురుషులు స్త్రీలను దోచుకొనుచున్నారని భావము.

## పురుషులు తమ కగౌరవమని ఏల యనుకొనవలెను ?

స్త్రీలకోసము ఏపనియైన చేసినచో అది తమకు అగౌరవమని పురుషులమైన మనము తలచుచున్నాము. వ్యాకరణమును అనుసరించి, అది పుంలింగములో ఉండవచ్చును. ఒక మనుష్యుడును తన బట్టను తనంతట తాను ఉదుకుకొనడు. తండ్రి బట్టలు కుమార్తె ఉతుకును. సోదరుని బట్టలను సోదరి

ఉతుకుట తప్పనిసరి యగును. తల్లి చీర ఉదుకుటకుగూడ కుమారునికి సిగ్గగును. సరే యింక భార్యచీర ఉదుకుసంగతి చెప్పవలసిన దేమున్నది? ఏదైన కష్టసమయము వచ్చినచో ఎవరోయొక బంధురాలే ఉదికివేయును. ఆమెకూడ దొరకనిచో ప్రక్కయింటియామె ఉదుకును. అదికూడ కుదురనిచో భార్యచీర ఉదుకవలసిన సమయము వచ్చినచో ఆ పని ఎవరును చూడకుండునట్లు ఏ సాయంకాలమో ఇటువంటిపని నిశ్శబ్దముగా, దొంగతనముగా చేయుచుందురు. ఇదే స్థితి.

జమాల్‌పురము,
౨౨—౧౦—౪౩.

## పురుషులే ప్రధానముగాగల సమాజముయొక్క రాజ్యము

స్త్రీ పురుష భేదము నిలవజాలదు. స్త్రీ పురుషులకుండు సంబంధమును నేడు కృత్రిమముగా చేసితిమి. స్త్రీని రక్షింపదగినదానిగను, పురుషుని రక్షించువానినిగను మనము అంగీకరించితిమి. ఇది తప్పు. స్త్రీ కేవలము సురక్షితురాలుగా కాక స్వరక్షితురాలు కావలయును. అడవిలోని ఆడు సింహమును మగసింహము రక్షింపదు. ఆడుసింహము తనరక్షణను తానే చేసికొనును. కాన స్త్రీని రక్షితురాలనుకొనుట తప్పు. మనము స్త్రీకి గృహోపకరణమని, భోగసాధనయని ఏపేరు పెట్టినను చివరకు ఆమెను జడవస్తువునుగా తలచు పరిస్థితిలోనికి వచ్చితిమి. "పురుషుడు ఆత్మ, స్త్రీ ప్రకృతి" యని యొకడనెను. "ఆధ్యాత్మిక భాష వదలిపెట్టి ఆలోచించు పురుషుడైతే ఆత్మతత్త్వము" అని నేనన్నాను. ఆత్మకే లింగమును

లేదు. ఆ యాత్మ స్త్రీ పురుషు లిద్దఱకును గలదు. ప్రకృతి జడతత్త్వము. అది స్త్రీ పురుషు లిద్దఱిలోను గలదు. ప్రకృతి పురుషుల తత్త్వము లిద్దఱిలోను గలవు. పురుషునిలో పురుషుని తత్త్వము అధికముగాను స్త్రీలో ప్రకృతి తత్త్వము అధికముగాను ఉన్నదనుట తప్పు. స్త్రీకి స్వాతంత్ర్యము ఇవ్వరాదని ఆమె మన రక్షణలో ఉండవలయునని మనము ఒప్పుకొంటిమి. కొమారుడు పుట్టినచో పండుగ చేసికొనుట, ఆడపిల్ల పుట్టినచో దుఃఖము పొందుట ఇంతవరకు కొన్ని సంఘములలో ఉన్నది. కొడుకు పుట్టినచో స్వర్గము వచ్చునను నంతవఱకు ఇది పోయినది. పురుషప్రధాన సంఘము తయారు కావలయునని ఈ భ్రమ వ్యాపింపజేయబడెను. తెలిసియే ఇది వ్యాపింపజేయబడినది. నేను కొన్ని కఠోర శబ్దములు వాడుచున్నాను. కాని ఇది సత్యము.

పూర్వకాలములో మనము స్త్రీలపై ఎన్ని దురాక్రమణలు జరిపితిమో! ద్రౌపదిపై అత్యాచారము చేయబడెను. సీతను రావణు డెత్తుకొనిపోయెను. అనగా మనము స్త్రీకి స్వాతంత్ర్యము ఇవ్వలేదు. సురక్షితురాలుగా ఉంచునంతవఱకు ఇది అయినది. మనము సురక్షితురాలిని జేయలేకపోయినచో మనము సిగ్గుపడితిమే కాని ఆమెను సురక్షితురాలినిగా మాత్రము చేయమైతిమి. ఈ భేదమును మనము తీసివేయవలసి యున్నది.

మణిపుర (సహార్ష

౧౪-౧౨-౫౩

## మహిళనుండి అబలవఱకు

ఈ సమ్మేళనములో పురుషులకంటె స్త్రీలు ఎక్కువగా కనిపించుచున్నారు. ఇట్టి భేదమెందుకు వచ్చినది? భగవంతుడు పురుషులకంటె తక్కువమంది స్త్రీలను పుట్టించలేదు. కాని నేడు ప్రణాళికలన్నియు పురుషులచేతిలోనున్నవి కనుక స్త్రీలకు తక్కువస్థానములె యివ్వబడినవి. ప్రతి కమిటీలోను ఒకటో అరో స్త్రీలకు స్థానము లివ్వవలయునని యనుచుందురు. అల్పసంఖ్యాకులకు ఒక ప్రతినిధి యుంచవలసినట్లే స్త్రీలకుకూడ ఒక ప్రతినిధి యుంచవలెను. కాని ఇప్పటికికూడ స్త్రీలు నిలుచుండుటలేదు. ఏలయన, పురుషుల మెదడును పాడుచేసిన శిక్షణమే స్త్రీలకును నేర్పబడుచున్నది. స్త్రీల శిక్షణలో ఆధ్యాత్మిక జ్ఞానము ఉండవలయును, కాని యిప్పుడు అది యివ్వబడుటలేదు. ఈ స్థితిలో ప్రపంచమును ఎవరు రక్షింతురు? భారతదేశపు స్త్రీలు ముందుకు రావలసియున్నది. మహిళా శబ్దమువంటి శబ్దము ఇంకేభాషలోనైన నున్నదా? ఆ మహిళాశబ్దములో స్త్రీల మహిమ చెప్పబడియున్నది. మహిళశబ్ద మహత్త్వమును సూచించునది. కాని మధ్యలో స్త్రీలను అబలలని పిలిచెడి ఒక కాలము వచ్చినది. మహిళా శబ్దముపోయి అబలాశబ్దము వచ్చిపడినది.

పండరిపురము

30-౫-౫౮

## ఘోషా పద్ధతి నింకను అట్లే యుంచుట ఏమంత తెలివైన పని?

నేను దక్షిణ తెలంగాణాలో తిరుగు చున్నపుడు సభకు ఎంతమంది పురుషులు వచ్చుచుండెడివారో అంతమందే స్త్రీలుగూడ వచ్చుచుండెడివారు. అక్కడి స్త్రీలైతే నిర్భయముగా సభలో నిలబడి నన్ను ప్రశ్నలడుగు చుండెడివారు. కాని ఇక్కడో, మహమ్మదీయుల ప్రభుత్వము నడిచినది. కాన మహమ్మదీయ రాజులను సంతోషపెట్టుటకు వారి పర్దా పద్ధతిని హిందువులు గూడ స్వీకరించిరి. ఇతరుల మంచి యలవాటులను అలవఱచు కొనుటలో తప్పేమియు లేదు. కాని పర్దాపద్ధతి చాల చెడ్డది. సోదరీమణులను పర్దాలో పెట్టివైచుట ఏమంత తెలివైన పని? ఇంక ఇట్లే సమాజము నడుచు చున్నచో ఈ స్వాతంత్ర్యము ఎంతకాలమో నిలబడదు. మహమ్మదీయులుకూడ పర్దా పద్ధతిని వదలిపెట్టవలసియున్నది.

ముసల్మానులును ఇపుడు పర్దాపద్ధతిని విడనాడవలసినదే. అజ్మీరులో దరగాహశరఫ్‌లో మహమ్మదీయుల సభలో నేనిట్లంటిని. "ఇక్కడకూడ ఒక స్త్రీయైన కనుపడుట లేదు. దేవుని మసీదులో గూడ స్త్రీ పురుష భేదమెందుకు? మీరు పర్దాను విడువవలసియుండును. స్త్రీలను పర్దాలో ఉంచు సమాజ మెన్నటికీ ఉన్నతిని పొందలేదు. నా భావములో సత్యముండుటచే వారు అపుడు నా మాటను ప్రేమతో విన్నారు.

## స్త్రీలను పురుషులనుగా జేయుట హానికరము

నేడు పురుషులు చేయు సామాజిక కార్యములు సరిగా జరుగుటలేదు. ఇపుడు పురుషులకు అహింసాపద్ధతులు నేర్పుటకు బదులు సమానత్వమను పేరుతో స్త్రీల సేనలే ఏర్పాటు చేయబడుచున్నవి. అనగా స్త్రీలు పురుషులుగా జేయబడుచున్నారు. పురుషులు చేయు సంహారకార్యములో స్త్రీలు చేయికలుప మొదలిడినచో ఇంక ప్రపంచమును రక్షించువారెవరు? సముద్రమేగనుక గంగకు స్థానమివ్వక పోయినచో అది ఇంకెక్కడికిపోవును? జగత్తును రక్షించు శక్తికల స్త్రీలే భుజములపై తుపాకులు ధరించ మొదలిడినచో ప్రపంచము నింక నెవరు రక్షింతురు? కనుక స్త్రీలు పురుషులను ఒక హద్దులోనుంచ ప్రయత్నింతురుగాక! పురుషులు పైపిస్టు లగుచున్నారు. స్త్రీలుగూడా పైపిస్టులు అగుదురుగాక. దీనిలో సారమేమియు లేదు. స్త్రీలు అహింసాశక్తిని ప్రకటపఱచి ప్రపంచమును రక్షింప తమ పరాక్రమమును జూపవలయును.

## స్త్రీలు తమ్ముదామె రక్షించుకొనువారు అగుదురుగాక

స్త్రీలు తాము ఇతరులచే సురక్షితులుగా కారాదు. తమ్ము తామె రక్షించుకొనవలయును. చిన్నపిల్లలను సురక్షితులనుగా నుంచుట మంచిదే. కాని స్త్రీలు పురుషులవలె తమ్ముతాము రక్షించుకొనువారు గావలెను. తమ్ము రక్షించుకొను శక్తి స్త్రీలలో లేదని చెప్పుట భ్రమ. స్త్రీల శరీరము పురుషుల శరీరముకంటె నెక్కువ రక్షణశక్తిగలదని విజ్ఞానము చెప్పును. రోగిసేవలో రెండుమూడు నెలలు మేల్కొనవలసి

వచ్చినచో పురుషుడు తాను స్వయముగా రోగములో పడి పోవును. కాని స్త్రీలు ఇవన్నీ చేసి ఇంటిపనులు నెరవేర్చు కొనుచుగూడ నిలబడుచున్నారు. దీని ఆశయమేమనగా స్త్రీల శరీరములో ఆటుపోటులకు నిలబడగలశక్తి యధికముగా నున్నదని.

హీరాపురము (బొంబాయిరాష్ట్రము)
౮-౭-౫౮

## ఏమి యింకను సోదరీమణులు లోపలనే యుందురా?

ఇతర దేశములలో సోదరీమణులు సోదరులుకూడి పని చేయుచున్నారు. వారెగనుక కూడఉండి పనిచేయనిచో సోదరులశక్తి అపూర్ణముగానె యుండిపోవును. ఈ విధమైన యపూర్ణశక్తివలన పని ఎంతవఱకు జరుగగలదు. ఇపుడు ఈరాక్, ఈజిప్టు దేశములలో పర్దాను తొలగించి వేయు చున్నారు. సోదరీమణులందఱు ఇవతలికివచ్చి పనిచేయు చున్నారు. ఇపుడు కాంగ్రెసుకు అధ్యక్షురాలు ఎవరో మీరు ఎఱుగనే యెఱుగుదురు. ఇందిర కాంగ్రెసుకు అధ్యక్షురాలుగా నున్న దేశములో సోదరీమణులు లోపలనే యుందురా?

మీరు మీ సోదరీమణులను నాటకములకు, సినిమా లకు తీసికొని వెళ్ళుదురు. కాని బాబా (ఈ వినోబా) ప్రవచ నములు వినుటకు మాత్రము తీసికొనిరారు. ఇదిఏమి తెలివైన సంగతి. నాటకములకు, సినీమాలకు తీసికొని వెళ్ళకపోయినచో అది తెలివైన సంగతే. కాని జ్ఞానము గలిగించు సంగతులను వినుటకు తీసికొని వెళ్ళకపోవుట తెలివైన సంగతి యెట్లగునో

నా మెదడులోనికి వచ్చుటలేదు. మీ రిప్పుడు మీ యింటి లోని సోదరీమణులను ముందుకు రానియ్యండి. మీ కుడిచేతి వైపు కాశ్మీరమున్నది. మే మిప్పు డక్కడనుండియే వచ్చు చున్నాము. కాశ్మీరములో అల్లా, లల్లాయని రెండు పేర్లు విన్నాము, లల్లా అను పేరుగల ఒక గొప్పస్త్రీ 700 సం॥ల పూర్వము ఉండినదట. ఆమె శైవమతమును పాటించు హైందవ స్త్రీ. ఆమె రచించిన భక్తి భజనకీర్తనలను నేడు హిందువులు, మహమ్మదీయులు అందఱు ప్రేమతో పాడు చుండిరి. రెండవవైపు మీ ఎడమచేతివైపు రాజస్థాన మున్నది. రాజస్థానములో మీరాబాయి పేరు మ్రోగు చున్నది. మీరా భజనలుకూడ ఇంటింట పాడబడుచున్నవి. మీరు రాజస్థానమునకు కాశ్మీరునకును మధ్యగా ఉన్నారు. ఏమి యిక్కడి సోదరీమణులు భక్తిజ్ఞానములలో వెనుకబడి యుందురా?

మమరోటు (పంజాబు)

౨౧-౧౧-౫౯

## స్త్రీలకు సంపదపై గల యధికారము

సోదరీమణులకు మోక్షము కొంచెముగాను సోదరులకు ఎక్కువగాను లభింపవలయునా? రాముడు భరతునిపై ఎట్టి ప్రేమను చూపెనో అట్టి ప్రేమనే శబరిమీదకూడ చూపెను. కాని నేడు సమాజము స్థితి ఎట్లున్నదో చూడుడు. ఆడపిల్ల పుట్టినా కుటుంబమువారందఱకు దుఃఖమె. ముఖము వాడి పోవును. మేము చెప్పునది యేమనగా: మీ తల్లికూడ ఆడ

పిల్లయే గదా. అందఱు మగపిల్లలే పుట్టి ఆడపిల్లలు పుట్టక పోయినచో మీకు ఇష్టముగా నుండునా? అట్లుగానిచో తల్లి కున్నవిలువ తండ్రికున్నవిలువ సమానమైయైనపుడు మగ పిల్లవాని విలువ ఎక్కువయి, ఆడపిల్లవిలువ తక్కువ ఎందుకు కావలయును? మగపిల్లవానిచేతిలో ఆస్తియుండును. వాడు శిక్షణపొందును. కాని ఆడపిల్లకు ఆస్తిహక్కు లేదు. ఆమె శిక్షణమునుగూడ పొందలేదు. తండ్రియింట ఆమెకు ఏ హక్కును లేనేలేదని చెప్పుచుందురు. ఆమె భర్త యింటికి వెళ్ళినప్పుడె ఆమెకు హక్కు లభించును. ఒకవేళ ఆడపిల్ల భర్తయింటికి వెళ్ళనిదైనచో తండ్రి దయాధర్మములమీదనే యామె అదృష్టము ఆధారపడియుండును.

సోదరీ సోదరులకు సమానహక్కు లివ్వబడినచో వారి మధ్య ప్రేమ భావము తగ్గిపోవునన్నంతవఱకు వచ్చినది. సోదరునికి హక్కు ఇచ్చినచో సోదరునికి సోదరునికి మధ్య ప్రేమ నశించి పోవునుగదా! గాన మీరిపుడు తండ్రి చని పోగానే మీరు ఎట్టెటునంతను వినో బాకు ఇచ్చివేయుడు. ఇంక ఏ పేచీయు ఉండదు. స్త్రీకే హక్కిచ్చినచో మతముమీద ఆక్రమణ యగునందురు. కొంచెము దక్షిణముగాపోయి చూచినచో అక్కడ స్త్రీలకే ప్రాధాన్యము ఇచ్చు సమాజము ఉన్నదని మనకు తెలియును. తండ్రియింట ఆడపిల్లకు హక్కేలేనిచో ఆడపిల్లలో తన తండ్రి గుణములు ప్రకటము కాకూడదు. కాని తండ్రియొక్క రూపమును గుణములుగల ఆడపిల్లలను మనము చూచుచున్నాము తండ్రి రూపములు గుణములు ఆడపిల్లకు వచ్చుచున్నవి. ఇటువంటప్పుడు వారికి

హక్కు ఇవ్వక పోవుటలో అర్థమేమున్నది? పురుషుడు సర్వ సంపదను తన చేతిలో ఉంచుకొన గోరుచున్నాడు. స్త్రీపైన తన యధికారమును చెలాయింప వలయునని కోరుచున్నాడు. పైగా అధికారము చెలాయించుట అవసరమని లోకులు చెప్పుదురు. ఇట్లు చెప్పుటకు వీరు మతమును ఆధారముగా తీసికొందురు. నీవు మంచినే గనుక కోరువాడవైనచో "తీసికొని వెళ్ళి ఆ పుస్తకములను సముద్రములో పాఱ వేయుము" అని మేము చెప్పుచున్నాము.

టీకాపట్టి (పూర్ణియా)
౨౦—౧౧—౪౪

విడాకు లిచ్చుటలో ఉదారత్వము చూపుదుముగాక

భార్యాభర్తలలో అన్యాయము, అనాచారము, అత్యాచారము ఒకరిపై నొకరికి ద్వేషము కలిగినచో వాని వల్ల పిల్లలకు హానికలుగును. ఇటిస్థితిలో వారికి విడాకు లిచ్చు కొను హక్కే యున్నచో ఏమియు హానిలేదు. ధర్మమంతయు స్వేచ్ఛమీద నిలబడియున్నది. కాని శాసనముమీద నిలబడి లేదు. ధర్మము ఆజ్ఞ యివ్వదు. అనుమతి ఇచ్చును. కనుక ప్రత్యేక పరిస్థితులలో విడాకులహక్కు ఇచ్చుట ఉచితమని ఒప్పుకొన వలయును. ఇట్లయినచో "చాలమంది విడాకు లివ్వ మొదలిడుదురు" అని ఎవరైన అనవచ్చును. కాని యిట్లు అంగీకరించుట ధర్మమునకు మంచిది కాదు. అవును. విడాకులకై కొన్ని కారణములు నిబంధింపవలయును. మూలా

శయములను స్థిరముగా ఉంచుచు ఉదార బుద్ధితో విడాకులకు ఒప్పుదల యివ్వవలయును.

పున్‌పున్ (పాట్నా)
౨౬—౧౦—౫౨.

### ఆధ్యాత్మికమైన అనధికారములు పోగొట్టబడునుగాక!

గృహరక్షణకు సంబంధించిన పనులు స్త్రీలకే యుండవలయునను సంగతిఅయితే దైవమే చెప్పియుండెను. మఱి అది ప్రగతిశీలమైన అమెరికాయైననుసరే, వెనుకబడియున్న భారతదేశమైననుసరే, అసలు ముఖ్యసమస్య ఎక్కడ అడ్డినదో ఆ సంగతి సరిగా ఇప్పటివరకు పరిశీలింపబడలేదు. హిందూమతములో స్త్రీలు కొంతవరకు అపాత్రులుగానే యుండిరి. “స్త్రీలకు ఆస్తివిషయములో హక్కు లభించుటలేదు. వారికి పురుషులతోపాటు సమానముగా హక్కు లభించవలెనని ఇప్పుడు ఘోషింపబడుచున్నది. ఈ విషయములో వారిపై నాకు సానుభూతి యున్నది, హిందూకోడ్ బిల్లు బాగున్నదని నా మొదటి ఢిల్లీ యాత్రాసమయములో చెప్పితిని. ఆ వెనుకటి ఎన్నికల సమయములో సనాతనులు హిందూకోడ్ బిల్లు సమస్య తీసికొని పండిత నెహ్రూను ఉత్తేజపఱచిరి. “మీరు వెళ్ళి ఈ విషయములో వినోబాను అడుగుడు. ఏలయనగా — ఆయన శాస్త్రములను బాగుగా ఎఱిగినవాడు” అని యపుడు ఆయన అనెను. వినోబా అయితే దానికి అనుకూలుడే. కాని వాస్తవముగా ఏ సమానాధికారము అవసరమో దానినెవరును అడుగుటయే లేదు.

స్త్రీలకు హిందూమతము సంన్యాసమునకు బ్రహ్మ చర్యమునకు అధికారము ఇవ్వలేదు. ఈ యధికారము ఇచ్చినచో వందలకొలది స్త్రీలు సంన్యాసిను లగుదురని భయపడనక్కర లేదు. ఆధ్యాత్మికముగ స్త్రీలు అపాత్రలనుట వలన వారిలో ఒక స్థిరమైన హీనభావన వచ్చినది. ఈ అపాత్రతను పోగొట్టుటకై గృహస్థాశ్రమమునకు మహత్త్వము నిచ్చెడి

"సహస్రంతు పిత్రాన్ మాతా గౌరవేణాతి రిచ్యతే"

"తండ్రికంటె తల్లి గౌరవములో వేయిరెట్లు గొప్పది." అను సూక్తులు హిందూమతములో బయలుదేరినవి. ఏ మనుస్మృతిలోనైతే ఇటువంటి వాక్యము లున్నవో దానిలోనే

"పితా రక్షతి కౌమారే, భర్తా రక్షతియౌవనే
పుత్రో రక్షతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి"

"బాల్యములో తండ్రి రక్షించును, యౌవనములో భర్త రక్షించును, ముసలితనములో కొడుకు రక్షించును. కాన స్త్రీకి స్వాతంత్ర్యార్హత లేదు"అను శ్లోకమున్నది.

చారిత్రక దృష్టితో చూచినచో ఈశ్లోకము ప్రక్షిప్తమో లేక తరువాతిదో అయియుండును. ఈ శ్లోకము ఒకవేళ ఒకే లేఖకునిది కాకపోయినను ఇవన్నీ ఒకే పుస్తకములో నున్నవి. మఱి ఆపుస్తకము హిందూ మతమునకు శిరోధార్యమైనది. ఆడపిల్లలకు తండ్రి ఆస్తిలో హక్కు ఉండరాదను వారు "స్త్రీలకు రెండువైపుల హక్కులు ఎందుకుండవలెను?

పెండ్లిఅయిన తరువాత భర్తవైపునుండి ఏదో కొంత లభించును గదా అని ప్రశ్నించుచున్నారు. అనగా ఎవతెయైన ఒక స్త్రీ పెండ్లి లేకుండ ఉండునేమో అను స్థితిని గ్రహించుట కెవరును తయారుగా లేరు. "ఆడపిల్ల ఇక్కడనుండి అక్కడకు వెళ్ళి తీరవలసినదే" అనే వారికి తోచుచున్నది. స్త్రీలకు కేవలము గృహస్థాశ్రమమునకే కాని ఇతరాశ్రమములకు అధికారము లేదని దాని భావము. ప్రాచీన బ్రాహ్మణ గ్రంథములో "దుహితా పండితా జాయేత" తన కుమార్తె పండితురాలు కావలయునని కోరువాడు ఈ యాగములు చేయవలయునని దానిఅర్థము. దీనికి శంకరాచార్యులు ఎట్టి అర్థమును చెప్పెనో చూడుడు. ఎవరిని గురించి అయితే నా ఆపాద మస్తకము ఆదరముతో నిండియున్నదో ఆ శంకరాచార్యులు పండిత అను పదమునకు "గృహకార్యములందు నేర్పుగలది" అని అర్థము చెప్పెను. బాలిక తాను స్వతంత్రముగా పండితురాలు కావచ్చుననెడి కల్పననైన వారు చేయలేకపోయిరి. బాలిక సంన్యాసిని అగునను కల్పనకూడ వారు చేయలేకపోయిరి. అందువలన వారు అట్లు అర్థము చెప్పిరి. స్త్రీలు గృహ కార్యములలో కుశలురాండ్రుగా ఉందురుగాక అను విషయములో నాకెట్టి విరోధము లేదు. వారు అట్లు నేర్పరులు కానిచో దేశమునకెట్టి లాభము ఉండదు. కాని వారికి గృహ కార్యములందు మాత్రమే వారి పాండిత్యము పరిసమాప్తి పొందవలయునను మాటమాత్రము సరికాదు. ఆధ్యాత్మిక విషయములలో వారికి అధికారము లేదని ఒక సమయములో స్త్రీలపైని, శూద్రులపైని రుద్దబడిన సంగతి పోవలసినదే.

నా చిన్నతనములో మా అమ్మ మజాగల ఒక మంచి చక్కని కథ చెప్పుచుండెడిది. "విన్యా! పిల్లలను కనుట ఎంత కష్టమైన సంగతో నీవు తెలిసికొనలేవు. మొదటిలో ఈపని నేస్పు శంకరుని దగ్గఱ ఉండెడిది. కాని అతడు విసిగి వేసారి నాలుగు దినములు ఈ పని నీవు సరిదిద్దుము. అని పార్వతికి చెప్పి ఒప్పగించెను. అప్పటినుండి ఈ పని పార్వతి నెత్తిపైని పడెను. ఇప్పుడు శంకరుఁడాపనిని సరిదిద్దుటే లేదు" అని. ఈ విధముగా ఆపని స్త్రీలపైని పడినందున వారు గృహకార్యములలో ప్రవీణులు కావలయుననుటలో సందేహము లేదు. కాని వారిపైని ఆధ్యాత్మిక విషయములలో రుద్ధబడిన అనధికారమును తొలగించియే తీరవలయును. ఈ అనధికారము శాసన సభవలన పోదు. అందువలన ఎంతవఱకు శంకరాచార్యుని వంటి తేజస్విని, జ్ఞానిని వైరాగ్య సంపన్నురాలు అయిన ఎవరో ఒక స్త్రీ అవతరింపదో అంతవరకు స్త్రీ జాతి యుద్ధరింపబడనేరదని ఎల్లప్పుడును చెప్పుచున్నాను.

హీరాపురము (బొంబాయి రాష్ట్రము)
౮—౭—౫౮

# 3. స్త్రీల యుద్ధరణము - రక్షణము

హిందూ దేశములో స్త్రీలకు ఒక ప్రత్యేక స్థానము, చరిత్రయు గలవు. అసలు స్త్రీ పురుషుల చరిత్ర కలిసియే యుండును. అయినను స్త్రీలకు ప్రత్యేకముగా ఒక స్థానము ఉన్నది. ప్రాచీనకాలమునుండి హిందూ దేశములో సంస్కార

ముల యొక్క సాంప్రదాయము వచ్చుచున్నది. అది కనీసము పది వేల సంవత్సరములకు పూర్వపుదిగానే యుండును. దాని చరిత్రకూడ మనకిప్పుడు తయారుగానున్నది. వ్రాయబడిన చరిత్రలు దొరకినట్లుగా ఆ సాంప్రదాయ చరిత్ర వ్రాయబడినది దొరకుటలేదు. అయినను ఇంతకంటె మంచిపద్ధతిలో వ్రాయ బడిన చరిత్ర దొరకుచున్నది. అనగా వేలకొలది గ్రంథము లలో ఆ సంప్రదాయపు ప్రకాశము కనిపించుచున్నది.

## స్త్రీలను ఉద్ధరించినవారు ముగ్గురు

స్త్రీలను ఉద్ధరించుటకు ప్రయత్నములు చేసినవారి పేర్లలో ప్రాచీనకాలమున శ్రీకృష్ణభగవానుని పేరు, బుద్ధ భగవానుని పేరు, నేటికాలమున గాంధిమహాత్ముని పేరు విన వచ్చుచున్నవి. మధ్యకాలమంతయు వ్యర్థముగా పోయినదన రాదు. దానికిని ఒక చరిత్రయున్నది. కాని యీ ముగ్గురి పేర్లు మాత్రము మఱువరానివి.

## శ్రీకృష్ణ భగవానుడు

శ్రీకృష్ణభగవానుడు స్త్రీలకొఱకు చేసిన మహా కార్యములను గూర్చిన గుణగాథలు హిందూదేశమంతటి లోను అయిదువేల సంవత్సరములనుండి ఎడతెగకుండ గానము చేయబడుచున్నవి. ద్రౌపదిమీద చేయిచేసుకొని యామె వస్త్రాపహరణము చేయబడుచున్న సమయములో ఆమె శ్రీకృష్ణుని ప్రార్థించెను. దానినిగూర్చి మూడు శ్లోకము లున్నవి. అవి మనుష్యుని సంసార సముద్రమునుండి తరింప జేయుటకు సమర్థమైనవని అంగీకరింపబడుచున్నవి. గాంధి

మహాత్ముడు ఆశ్రమములో నడుపు ప్రార్థనలో స్త్రీలకై ఈశ్లోకములు పలుకబడుచున్నవి. "నాభర్త ఓడిపోయెను. ఇతర సోదరులు ఊరక చూచుచున్నారు. భీష్మద్రోణులుకూడ మాటాడలేక పోయిరి. కృష్ణా! నీవుతప్ప ఇంక నన్ను రక్షించువారెవరు?" అని ద్రౌపది శ్రీకృష్ణుని స్మరించి ప్రార్థించెను. ఆ శ్లోకములలో శ్రీకృష్ణభగవానుని విశేషముగా సంబోధించిన పదములలో "గోపీ జనప్రియా! కృష్ణా!" అన్నది కలదు. అనగా ఓ కృష్ణా! ఎవడైతే గోపీజనులకు ప్రియుడో, ఎవనిపై గోపికలకు ప్రేమయున్నదో, అటువంటి నీవు నన్ను రక్షించుటకొరకు" అని యర్థము. ఇట్లు ద్రౌపది ప్రార్థించెను. సమస్త భాగవతము ఈ యొక్క కథమీదనె నిలబడి యున్నది. శ్రీకృష్ణునికి గోపికలపై ఎట్టి ప్రేమయున్నదో, స్త్రీలకై అతని మనస్సులో ఎట్టి గౌరవము ఉన్నదో, బంధువులని స్త్రీలకై అతడు ఎట్టి పనిచేయుచుండెనో అది హిందూ దేశ చరిత్రలో అద్వితీయమైనది. హిందూదేశములో శ్రీకృష్ణుని గాథకంటె మధురమైన యింకొక గాథ వినుటకు గాని చదువుటకుగాని దొరకదు.

## భగవానుడైన మహావీరుడు

మహావీరుని చరిత్ర యొక యద్భుత చరిత్రము. మహావీరుని కాలమునకు నలుబది సంవత్సరముల పిమ్మట గౌతమ బుద్ధుడు అవతరించెను. లోకమాన్యుని తరమునకు నేటి తరమునకు కాలములో గలతేడాయే మహావీరుని కాల

మునకు బుద్ధుని కాలమునకు గలదు. ఇద్దఱు పుట్టుక ఒక్క బీహారు ప్రదేశములోనే అయినది. కనుక మహావీరుని బుద్ధుడు చూచియుండ వచ్చును. మహావీరుడు వృద్ధుడు గాను, బుద్ధుడు యువకుడుగాను ఉండవచ్చునని మనము ఊహించవచ్చును. అట్టి ప్రమాణములుకూడ ఉన్నవి. మహావీరుని సాంప్రదాయము లో స్త్రీ పురుషులలో ఏవిధమైన భేదము చూపబడలేదు. పురుషులకెట్టి యధికారము లివ్వబడినవో అట్టి అధికారములన్నియు స్త్రీలకును ఇవ్వబడినవి. ఈ రోజులలో నేడు అందఱు చర్చించుచున్న యధికారములనుగూర్చి చెప్పుటలేదు. ఆ కాలములో ఇటువంటి యధికారములను పొందుటకు అవసరము కలిగియుండక పోవచ్చును. నేనయితే ఆధ్యాత్మికమైన యధికారములను గూర్చి మాటాడుచున్నాను. పురుషులకెన్ని యధికారములయితే ఉన్నవో అవియన్ని స్త్రీలకును ఉండవచ్చును. ఈ ఆధ్యాత్మికమైన యధికారములలో మహావీరుని కెట్టి భేదబుద్ధియును లేదు. ఇందుకు ఫలితంగా అతని శిష్యులలో శ్రమణులకంటె శ్రమణ స్త్రీలే ఎక్కువగా నుండిరి. ఆ సాంప్రదాయమే నేటివరకు జైన ధర్మములో వచ్చుచున్నది. నేడుగూడ జైన వనితలు(సాధ్వీలు) సంన్యాసినులగుచుండిరి. సంన్యాసులు ఒంటరిగా తిరుగరాదని జైనధర్మములో ఒక నియమమున్నది. ఇద్దరకంటె ఎక్కువమందిగాని ఇద్దరికంటె తక్కువమందిగాని తిరుగరాదని సంన్యాసులకు సంన్యాసినులకు నియమము కలదు. అందువలన ఇద్దరిద్దరు సాధ్వీలు హిందూదేశములో తిరుగుచు కనబడుచుందురు.

మహావీరునికి నలుబది సంవత్సరముల పిదప గౌతమ బుద్ధుడు బయలుదేరెను. స్త్రీలకు సంన్యాసములిచ్చుట యుచితముగాదని యతడు తలచెను. స్త్రీలకు సంన్యాసము ఇచ్చినచో ధర్మమునకు నిలకడ ఉండదని ఆయనకు తోచినది. ఒకనాడు బుద్ధుని శిష్యుడు ఆనందుడు ఒక సోదరిని తీసికొనివచ్చి భగవానునితో నిట్లుపలికెను. "ఈ సోదరి మీ యుపదేశములకు సర్వదా అర్హురాలను సంగతి నేనెరుగుదును. ఈమెకు సంన్యాస దీక్ష ఇప్పింపవలయును" అని. అపుడు బుద్ధభగవానుడు ఆమెకు దీక్షయిచ్చి "ఆనందా! నీ బలవంతముచేతను నీయందలి ప్రేమ చేతను ఈమెకు దీక్ష యిచ్చుచున్నాను. కాని ఇట్లుచేసి నేను మన సాంప్రదాయమునకు ఒక గొప్ప యపాయమును నెత్తిమీద తెచ్చుకొంటిని" అని యనెను. ఏ యపాయము వచ్చునని బుద్ధునికితోచెనో ఈ వాక్యమునుబట్టి తెలియుచున్నది. బౌద్ధధర్మ చరిత్ర మిగుల పరాక్రమశాలి యయినది. దానిలో దోషము లున్నను దానినిబట్టి దేశము గర్వపడదగియున్నది. బుద్ధునికి గలిగిన భయము మహావీరునికి లేదని తెలిసినపుడు ఆశ్చర్యము కలుగుచున్నది. మహావీరుడు నిర్భయముగా కను పట్టుచున్నాడు. నా మనస్సుపైని అతని ప్రభావము ఎక్కువగా పడినది. ప్రపంచ మంతటిలోను అతని కరుణాభావన వ్యాపించుచున్నది. కనుకనే అతని వ్యక్తిత్వములో ఏవిధమైన న్యూనతయైనను ఉండునని నేననుకొనను. మహాపురుషుల ప్రవృత్తులు వేరు వేరుగా నుండును. కాని గౌతమబుద్ధుని లోకవ్యవహార భూమిక స్పృశించెననియు అది మహావీరుని స్పృశింపలేకపోయెనని చెప్పవలసి వచ్చును. నా మనస్సులో

వారి విషయమై విశేషమైన యాదరము కలుగునంతగా వారు దృఢప్రతిజ్ఞ కలవారై ఉండిరి.

రామకృష్ణ పరమహంస సాంప్రదాయములో స్త్రీ కేవలము ఒక్కతేయున్నది. ఆమెకూడ శారదా దేవియె. ఆమె రామకృష్ణ పరమహంసకు భార్య. ఆమె పేరుకు మాత్రమే భార్య. అట్లే ఆమె వారికి తల్లియే యయిపోయినది.

ఆ సాంప్రదాయములోని సోదరులందరకు ఆమె మాతృదేవి స్థానములోనే యున్నది. అయినను ఆమెకు తక్క ఇంక ఏ స్త్రీకిని దీక్ష యివ్వబడలేదు. మహావీరునికి పిదప 2500 ఏండ్లు గడిచెను. కాని స్త్రీలకు దీక్ష ఇచ్చు సాహసము కలుగజాలదయ్యెను. స్త్రీలకు దీక్ష యివ్వవలయునని నాలుగేండ్లకు పూర్వము రామకృష్ణ మఠమువారు నిర్ణయించినట్లు వింటిని. స్త్రీ పురుషులకు ఆశ్రమములు వేరువేరుగా నుండవలయుననుట వేరుసంగతి. కాని యింతవరకు స్త్రీలకు దీక్షయే దొరకెడిదికాదు. అది యీనాడు దొరకుచున్నది. దీనినిబట్టి 2500 సంవత్సరములకు పూర్వము స్త్రీలకు దీక్ష యిచ్చు విషయములో మహావీరుడు ఎంత పరాక్రమము చూపెనో తెలియుచున్నది.

## శ్రీకృష్ణునిలోను మహావీరునిలోను గల పోలిక

శ్రీకృష్ణుడు చేసిన కార్యము సంన్యాసదీక్షకు సంబంధించినది కాదు. స్త్రీ పురుషులు భక్తభావములో సమానులయి, అనాసక్తులయి, నిర్లిప్తులయి, తమ మతము ఏమాత్రము సంకోచము లేకుండ ఉండవలెను— అను విషయములో అది

పని చేసెను. ఇది జీవితములోని ప్రాథమిక సూత్రము. సోదరీ మణులకు సంన్యాసము పుచ్చుకొను హక్కు లభించినచో ఎక్కువమంది స్త్రీలు సంన్యాసము పుచ్చుకొందురేరే అని అనుకొనుటకు వీలేమియు లేదు. ఆ స్థితిలో తక్కువమంది స్త్రీలే సంన్యాసము పుచ్చుకొందురను సంగతి వేరు.

సంన్యాసమునకు సమానమైన యధికారము తీసికొనుటలో ఒకవిధముగా కష్టమున్నది. కాని సర్వసామాన్యమైన గృహస్థాశ్రమములోగూడ సంకోచము లేకయుండి ఒకరింకొకరితో సోదరీ సోదర భావముతో కలిసికొనుచు ఉందురు గాక : యని శ్రీకృష్ణుడు బోధించెను. జీవనదృష్టినిబట్టి శ్రీకృష్ణుడు చేసిన పని యిది. కాని తత్త్వవిచారదృష్టితో చూచినచో నాకు మహావీరుని చరిత్ర అద్వితీయమయి తోచుచున్నది.

## మహాత్మ గాంధి

మనకు ఆధారమైన చింతన గ్రంథములలో దొరకని విషయము బహుశా యిక్కడ ఏయొక్కరికో తోచును. మన దేశములో బ్రహ్మచింతనము ఎక్కువగా అయ్యెను. ఇందువలన క్రొత్త భావములకు ఆధారము దొరకదనుకొనుటకు వీలులేదు. కాని ఒక వ్యావహారిక విచారముయొక్క పద్ధతిగా ఆలోచింపగా శాస్త్రములలో ఆధారమున్నదను సంగతి సరిపడుటలేదు. గృహస్థాశ్రమములో గూడ జనులు వానప్రస్థాశ్రమమందున్నట్లు ఉండవచ్చుననెడి విషయమును గాంధిజీ ప్రారంభించెను. వారి ప్రయత్నము వానప్రస్థాశ్రమము

నకు సంబంధించినది. గృహస్థాశ్రమములో నున్న సమయములో ఇటువంటి ప్రతిజ్ఞకు లోకులు బద్ధులయి యుండలేదు. వారు సంతానము గనుచుందురు. వారికి కోరిక గలిగినచో ఒకరు ఇంకొకరి కోరికను పాలింప ప్రతిజ్ఞ తీసికొందురు. సంతానము గనెడి బాధ్యతను వహింతురు. కాని మెల్ల మెల్లగా ఆ కోరికను విడిచి గృహస్థాశ్రమములో వాన ప్రస్థమునందువలె ఉండగలరు. గృహస్థాశ్రమమునుండి ఎంత తొందరగా విడుదలపొందిన అంత మంచిది. బహుశా పెండ్లి అయిన పిదప ఒక సంతతి కలగనపుడు విడుదల పొందినను గూడ మంచిదే. ఒక సంతానము గలిగిన పిదప విడుదల పొందినను మంచిదే. ఇటువంటి సంగతులు ఎక్కువగా జరుగుననుకొనుటకు వీలులేదు. ఇటువంటివి జరుగుటకు కొంత వాతావరణము కావలయును. మనము ఇటువంటి వాతావరణమును కలిగింపలేకపోతిమి.

## భోగముల ప్రాబల్యము

గాంధీజీ నిరాడంబరముపైపు ఎక్కువ పట్టుదల చూపెను. కాని నేడు భోగసాధనములు మిగుల ఎక్కువగా లభించుచుండెను, పెరుగుచుండెను గూడ. స్వరాజ్యమువచ్చిన పది సంవత్సరములకు పిదప కొంచెము మార్పుగలిగినది. దీనిని మనము గౌరవింపగలము. కాని శోచనీయములగు కొన్ని పరివర్తనములుగూడ కలిగెను. భోగవిలాసముల సాధనములు పెరుగుచున్నవి. భోగప్రవృత్తిలో పొరపాటు పడుచున్నాము. అవియైన మనకు తోచుటయైన లేదు. మనకు పొరపాటు తోచి

నచో దానినుండి తప్పించుకొనుటకు తరణోపాయము కలుగును. కాని నేడు సంతాన నిగ్రహముగూర్చి సిగ్గులేకుండ ప్రచారము జరుగుచున్నది. అటువంటి ప్రచారము చేయు వారిలో చాల జయగలవారు, కరుణావంతులు నగు పురుషులున్న సంగతి నే నెరుగుదును. వా రిట్లు ప్రచారము చేయుటలో వ్యవహారజ్ఞానముమాత్రమే తోచుచున్నది. కాని వారి కరుణ పైపైదేకాని గంభీరమైనదికాదు. ఇది హానికరమైనది. అది మన దేశముయొక్క యాత్మశక్తిని క్షీణింపజేయునది యని స్థిరపడుచున్నది. ఫ్రాంసులో ఇట్లే జరిగినది. అక్కడ పురుషుల హీనత్వమును పురుషార్థశక్తి క్షీణించుటయును కనబడుచున్నది. ఏలయన, వాతావరణమంతయు ప్రతికూలముగా కనుపట్టుచున్నది. దీనినిబట్టి గాంధి మహాత్ముని యాశయములు వ్యాపింపనట్లు కనిపించుచున్నది. అయినను మనకొక దారి దొరకినది. కావున ఆయా యాశయములు నశింపవు. గృహస్థులకు ఒక స్వతంత్ర క్షేత్రము దొరకుచున్నది. గృహస్థాశ్రమములో ఉండికూడ మొదటి దినము నుండి బ్రహ్మచర్యముతో నుండుటకు ప్రయత్నించువారు బయలుదేరుదురు. మఱి ఆ ప్రయత్న ఫలితముగా సంతానము కలిగినచో వారు పరాక్రమవంతు లగుదురు. ఈవిధముగా గృహస్థాశ్రమములో వానప్రస్థ ప్రవృత్తి బయలుదేరునని యిట్లు గాంధి మహాత్ముఁడనెను.

కల్లుదుకాణములను ఆపుట (పికెటింగు)

గాంధిమహాత్ముఁడు స్త్రీల శక్తినంతను వెలికిలాగి బయట పెట్టెను. అహింసా శస్త్రము మన ముందుకు వచ్చి

నది. ఆ శస్త్రమును ఎంతగా పురుషులు ఉపయోగించగలరో అంతకంటె ఎక్కువగా స్త్రీలు ఉపయోగింపగలరు. స్త్రీలు ఇప్పుడు తమ బంధనములను త్రెంచుకొని బయటికి రావల యును.

ఇరువదియైదేండ్ల క్రిందటి సంగతి. కల్లు దుకాణము లను పికెటింగు చేయుటకు ఎట్టి ఏర్పాట్లు చేయవలయునో దానినిగూర్చి చర్చసాగుచుండెను. ఎవరికితోచిన యుపాయ ములు వారువారు సూచించుచుండిరి. ఈ పని స్త్రీలది అని గాంధీజీ సూచించిరి. 'గాంధీజీ ఏమన్నారు' అని లోకులు వినగానే నిర్ఘాంతపోయిరి. ఏమాత్రమును నీతిలేని మనుష్యులు వెళ్లుచు, అన్నివిధములైన చెడ్డవ్యాపారములు చేయు మను షుల మధ్యకువెళ్ళి స్త్రీలు ఏమిచేయుదురు? కాని 'స్త్రీలే అక్కడపనికి వత్తు''రని గాంధీజీ అనిరి. అందఱికంటెను పడి పోయినవారికి ఎదురుగా మన దగ్గఱవున్న శక్తులన్నిటిలోను గొప్పదగుశక్తినే పంపవలయును. దానికి ఫలితముగా స్త్రీలు అక్కడికి వెళ్ళిరి. మఱివారు అక్కడికివెళ్ళి ఏపనిచేసిరో అది భారతదేశమంతయు చూచినది.

ఒకసారి అన్నాసాహెబు వర్ధాకువచ్చిరి. గాంధీజీ గారడి చేసిరి అని వారనిరి. స్త్రీలయున్నతికై 25 ఏండ్లు పరి శ్రమచేసియు చేయలేని మనము ఊహింపలేని గొప్పపని గాంధిజీ చేసివైచిరి. గాంధిజీ చేసినదేమిటి? ఈ చేసిన అహిం సయె. మీ శాస్త్రము హింసగా ఉన్నంతవరకు ప్రపంచము లోనికి ఎన్నితత్త్వములను తీసికొనివచ్చినను స్త్రీలస్థానము రెండవతరగతిగానే యుండును. ఎన్ని ప్రయత్నములు చేసి

నను వారికి మొదటిస్థానము లభింపదు. స్త్రీలకే కనుక మొదటి స్థానము ఇవ్వవలసియున్నచో రక్షణ సాధనములు అహింసగా ఉండుటతప్పదు. దీనివల్ల మాతృశక్తికి స్థానము లభించును. బుద్ధభగవానుడు మహావీరుల కాలములో స్త్రీల యుద్ధరణ జరిగెను. మఱి గాంధిజీవల్ల ఇప్పుడు స్త్రీలకు అభివృద్ధికలిగెను. ఏలయనగా: వీరు అహింసనే రక్షణశక్తిగా అంగీకరించిరి. హింసను అంగీకరింపలేదు. హింస అయితే భక్షణశక్తియె.

## మ ధ్య యు గ ము

మధ్యగా వచ్చినకాలము ఇట్టిదికాదు. అట్టిదియును కాదు. మహావీరునితో సమానముగా స్త్రీలకు దీక్ష యిచ్చిన వారును, గాంధిజీతో సమానముగా గృహస్థులకు వానప్రస్థ వృత్తిని కల్పించినవారును, కృష్ణునితో సమానముగా అన్ని క్షేత్రములలోను సహజముగా ఏ సంకోచమును లేకుండ స్త్రీ పురుషులు కలిసి పనిచేయుటకు వీలుకల్పించిన వారును మఱి ఎవరును లేరు. ఆకాలములో భక్తిద్వారా స్త్రీలకు ముక్తిద్వారము తెఱపించిన సంగతి నడచినది. ఆకాలములో స్త్రీలకు సంన్యాసదీక్ష నిషేధించబడినది. మధ్య కాలములో పురుష సంన్యాసులు స్త్రీల దర్శనమును కూడ చేయలేకుండిరి. ఒకసారి మీరాబాయి బృందావనమునకు వెళ్ళినది. అక్కడ ఒక సత్పురుషు డుండెను. ఆయనకు ఎక్కువ ప్రసిద్ధిగలదు. మీరాబాయి వారిని కలుసుకొనవలయునని తనకోరికను ప్రకటించెను. సంన్యాసి దర్శనమైనచో కొంత జ్ఞానము ప్రాప్తించునని ఆమెకు తోచినది. వారి దర్శనమును ఆమె

కోరగా వచ్చినజవాబు ఏమనగా, "స్వామిజీ స్త్రీల ముఖ దర్శనమును చేయ"రని. ఇదివిన్న మీరాకు చాలాఆశ్చర్యము గలిగెను. దుఃఖమైతే కలుగలేదు. ఏమన: ఆమె దుఃఖమును అతీతించిన స్త్రీ భక్తురాలు. ఆమె ఒక కీర్తనము వ్రాసెను.

హరాతో జాణతీ హాతీకే వ్రజమాం పురుషభేవక
వృజమా వసీనే తమే పురుషభో, భబోతమారో వివేక

దీనిలో వినోదముతోనిండిన యొక యుపాలంభ మున్నది. మన గొల్లపల్లె వ్రజములో ఉండికూడ మీ పురుషత్వాహంకారము పోలేదు. గొల్లపల్లెకు వచ్చువారు శ్రీకృష్ణ భగవానుని యుపాసన చేయుచున్నారు. ఉపాసన స్త్రీ కనుక ఉపాసనాబుద్ధివల్ల వారిని (శ్రీకృష్ణుని) పురుషునిగా తలచి తమ్ము స్త్రీగా తలచుకొనుచున్నారు." అని.

ఆ సమయములో స్త్రీల విషయములో ఎంత కఠోరమైన పట్టుదల యున్నదనగా, స్త్రీలకు సంన్యాసము ఇచ్చు పేరైనను లేకపోయెను. కాని ఆకాలములో భక్తిమార్గము దారిని తెలిపెను. మార్వాడులో మీరాబాయి, ఉత్తరప్రదేశములో సహజోబాయి, మహారాష్ట్రములో ముక్తాబాయి మొదలగు వారు భక్తశిరోమణులుగా బయల్పడేటిరి. ఇది హిందూదేశమునకు గౌరవప్రదమైన చరిత్ర. కాని దానికిహద్దు ఉన్నది. సాంసారిక స్త్రీల కిదికాదు, దీనిక భక్తితో సంబంధమున్నది. భక్తికి సంబంధమున్నచోట స్త్రీ పురుష భేదము నశించిపోవు చున్నది.

## మిమ్ము మీరే యుద్ధరించు కొందురుగాక

శంకరాచార్యునివంటి తీవ్రవైరాగ్యముగల స్త్రీ పుట్టునంతవఱకు స్త్రీల యుద్ధరణము శ్రీకృష్ణుడు, బుద్ధుడు గాంధీ మొదలైన పురుషులుకూడ స్త్రీ చేసినట్లు చేయలేరు. ఇటువంటి ప్రయత్నముకూడ చేయబడిన సంగతి యసంభవము కాదు. కాని ఆ ఆత్మోద్ధరణ సిద్ధాంతము ఎక్కడ ఆగును? కొంతవఱకు సాయము చేయవచ్చును. కాని స్త్రీల యుద్ధరణము స్త్రీల వలననె కావలయును. ఇటువంటి స్త్రీ పుట్టినపుడు శంకరాచార్యుని మఠముపైని అధిరోహించును. శంకరాచార్యుని పీఠము ఇటువంటిదికాదు. స్త్రీలకు తమ సొంతపీఠము కావలయును. శాస్త్రములు రచించు సమర్థత కలిగి ధర్మములు మార్చబడి వైరాగ్యశీలముకల జ్ఞాన ప్రచారము చేయు సోదరీమణులు ఎందుకు బయలుదేరరో నా కర్థము అగుటలేదు. స్వాయముగా ముందుకు సాగిపోగల హక్కులు స్త్రీలకు హిందూధర్మములో సంప్రాప్తింపలేదు. వారు పదవుల స్వీకరించుట యింకను మిగిలియున్నది.

పండరిపురము

30-౫-౫౮

## ఆత్మశక్తిని వికసింపజేసికొందురుగాక

స్త్రీల రక్షణ పురుషులపై ఆధారపడియున్నదని శతాబ్దములనుండి యంగీకరింపబడినది. ఈ భావన స్థిరపడి యున్నంతవఱకు స్త్రీలకు నిజమైన రక్షణ కలుగుట యసం

భవము. స్త్రీలను రక్షింపవలసిన అవసరమున్నదని నిజమునకు అంగీకరింపవలసిన పనిలేదు. కాని యిట్లు యంగీకరింపబడు చున్నది. ఎందుకిట్లు అంగీకరింపబడినది? స్త్రీ దగ్గఱ హింసా యుత సాధనములు పూర్తిగా లేవు గనుక. హింసా క్షేత్ర ములో ఆమె పురుషునికంటె బలహీనురాలుగా పడిపోవు చున్నది. కనుకనే ఆమె పురుషులద్వారా రక్షింపబడినదగు చున్నది. అనగా దీనిలో హింసయొక్క ప్రతిష్ఠ స్వీకరింపబడి నది. కాని నేడు హింసకుగాక అహింసకే ప్రతిష్ఠ స్థాపింపబడ వలసియున్నదని నేటి పరిస్థితి స్పష్టముగా కనిపించుచున్నది.

## ఆత్మజ్ఞానము చాల సులువైనది

ఏ పరిస్థితిలోనైననుసరే స్త్రీ ఆత్మబలముపైని తన్ను తాను రక్షించుకొనగలదని మనము తెలిసికొనవలసియున్నది. శరీరముమీద ఆధారపడుటకు బదులు ఆత్మమీద ఆధారపడి జీవింపగల కళను మన మందఱము నేర్చుకొనవలసియున్నది. నిత్యము జీవితమంతయు నిష్ఠతో సేవచేయవలసియున్న మనుష్యుడు ఆత్మజ్ఞానమునుగురించి తెలిసికొనవలసియున్నది. నేడు మనకీ ఆత్మజ్ఞానమను శబ్దము కొంత పెద్దగా తోచు చున్నది. ఈ సంగతి ఒక మామూలు బాలుడుకూడ సులువుగా తెలిసికొనగలిగినంత సరళమైనది. లెక్కలు నేర్చు కొనుట కష్టము కావచ్చును. కాని ఆత్మజ్ఞానము లెక్కల కంటెను సులువు. మనము ఏడుగురము (We are Seven) అను వర్డ్సువర్తు కవిత్వము ప్రసిద్ధమైనది. ఆ బాలిక చని పోయిన తన సోదరులను లెక్కపెట్టి మేము ఏడుగురము అని

చెప్పను. ఆత్మయొక్క యమరత్వము ఆమెకు సహజముగానే లభించినది.

శరీరపరాయణత్వమునుండి భయము.

దీనిని తెలిసికొనుటయైతే కష్టముగాదు కాని దానిని అమలు పరచుట మాత్రము కఠినముగా దోచుచున్నది. ఏలయన నేడు మన జీవితమంతయు శరీరప్రధానమైపోయినది. సౌందర్యమునుగూర్చి ఆలోచించుచున్ననుసరే, బలమును గూర్చి ఆలోచించుచున్నను సరే, కాని మన దృష్టి శరీరము ప్రధానముగానే యున్నది. ఈ శరీరపరాయణత్వ మున్నంతవరకు స్త్రీల మనస్సులో భయము స్థిరముగానే యుండక దుష్టులలోగల యాశరీర పరాయణత్వమును బట్టి లాభము పొందుదురు. ఇందులో నుండియే భయము నిర్మాణ మగును.

నిర్భయత్వమునందలి యాత్మతేజము

రామాయణములో సీతనుగూర్చిన వర్ణనమును మనము చదివితిమి. రావణుడు ఆమెతో లజ్జాకరములయిన మాటలు మాట్లాడుచుండెను. ఆమెవానితో మాటాడనైన మాటాడ లేదు. ఒకమారు మాటాడవలసినపుడు మాత్రము ఒక గడ్డి పరకను అడ్డుపెట్టుకొని మాటాడెను. "ఓరావణా! నేను నిన్ను ఒక గడ్డిపరకగా తలచుచున్నాను." అని సీత వానితో చెప్ప నోరెను. రావణుడు ఆమెకేహానియు చేయలేకపోయెను. సీత యుదాహరణము అసామాన్యమైనదని మనము తలంప కుందుముగాక. ఇట్లే అయినచో ఇట్టి దృష్టాంతములు మన

యెదుట ఏల ఉంచబడుచుండెను. కాంగ్రెసు అధ్యక్షురాలుగా ప్రతియొకరు కాలేరు కాని సీతగామాత్రము ప్రతియొకరు కాగలరు. ఏలయన, అది ఆత్మకు సంబంధించిన విషయము. ఆత్మమీద ఆధారపడిన వ్యక్తియొక్క కన్నులలోనున్న నిర్భయత్వతేజస్సు ఇతరులను తత్ప్రభావవశులనుగా చేయకుండనుండలేదు. చివరకు పశువులుకూడ కంటిలోని ఆ తేజస్సును ంపగలవు.

వాల్మీకి నారదుల దృష్టాంతము అయితే అందఱు ఎఱిఁగినదే. వాల్మీకి అనేకులను హత్యచేసియుండెను. కాని అంతవఱకు నారదునివంటి నిర్భయస్థుడు దొరకలేదు. దొరికినవారిలో భయపడి పాఱిపోవువారో లేక వానిపైని ఆక్రమణ చేయువారో ఎవరో ఒకరుమాత్రమే వానికి దొరికిరి. నారదునివంటి సద్వివేకము చెప్పువానిని తన జీవితములో మొదటిసారే చూచియుండెను. దానికి ఫలితముగా మొదటి నుండి హింసకుడైన యొక భిల్లజాతివాడు ఒక మహాఋషి అయ్యెను. ఈ కథలో ఒక జీవన సిద్ధాంతము నిండియున్నది. మనమేకనుక నిర్భయులమై శాంతులమైయున్నచో మనపైని ఆయుధము ఎత్తినవానిచేతులె ఆగిపోవును.

## శ్రద్ధ అవసరము

ఒక సోదరుడు వచ్చి "మహిళాశ్రమమువంటి సంస్థపైకి గుండాలువచ్చి ఆక్రమణచేసినచో ఏమి చేయవలయునని నన్ను అడిగెను. దానికి సమాధానము సరళమైనది. మనకేకనుక నచ్చినచో ఎప్పుడైతే ఆక్రమణజరిగెనో అప్పుడే

మనము కేకలు వేసి ప్రోగయి భగవంతుని భజనను చేయుదుముగాక. దీనికై కావలసినది శ్రద్ధ. శరీరబలము విఫలము.

దీనికి విపరీతముగా మనము మన సోదరీమణుల చేతికి కత్తిఇచ్చుదము అనుకొందము. అప్పుడు ఎదుటివాని చేతిలో కత్తికంటె గొప్పదైన యాయుధము ఉండవచ్చును. అప్పుడే మనకత్తి పనికిమాలినదగుట స్థిరము. ఈయుద్ధములో మనము శారీరకశక్తి యెంత విఫలమైనదో చక్కని నిదర్శనమును జూచితిమి. ఏవిధముగ ప్రదేశ, ఇరవయ్యేసి లక్షల జనులు ఒక్కమారుగా ఇతర దేశములపైని ఆక్రమణచేసిరో ఆ విధముగానే అంత పెద్దసంఖ్యలో లోకులు ఆయుధములు దించి వైచిరికూడ. ఎదుటివాడు బలవంతుడని చూడగనే రెండవ పక్షమువారు తమ యాయుధములు క్రిందపెట్టి శరణు చొత్తురు.

కనుక మనము ఆత్మశక్తిమీద ఆధారపడవలయును. స్త్రీలలో ఇట్టి యాత్మశక్తికి ఏ లోటునులేదు. కాని దానిని ప్రకటపఱచుటకు జీవనమును దానికి అనుకూలముగా చేయవలసియుండును. తినుటకుగాక జీవించుటకే తినవలయును. మనము ఇంటికి అద్దె ఇచ్చునట్లు, బాగుగ పనిచేయుటకై రాట్నములో నూనెవేసినట్లు శరీరముచే పనిచేయించుకొనుటకు దానికి తగిన పోషకత్వముల నివ్వవలయును. దీపావళికై మనము రాట్నములో చేమంతి నూనైనై తే వేయము. ఈవిధముగా కులాసాకో లేక భోగమునకో కాక అవసరమైన దానిలెక్క ప్రకారము మాత్రమె మనము శరీరమునకు ఆహారమును ఇవ్వవలయును. ఏలయనగా-అది వైజ్ఞానిక ప్రయో

గముకనుక. దానిలో భోగమునకుగాని విలాసమునకుగాని తావు లేదు. భోగవిలాసములతో నిండిన జీవితము సమయము వచ్చినప్పుడు పిటికిదై పోవును.

అవమానమా ? చావా ?

"నీవు మహమ్మదీయుడవు కమ్ము, లేదా నిన్ను చంపి వేయుదుము" అని ఎవరైన అన్నచో "సోదరా! మహమ్మదీయుడగుటకు ఒకరకమైన శ్రద్ధ కావలయును. ఆ శ్రద్ధ బలవంతముచే రాజాలదు" అని వానితో స్పష్టముగా చెప్పి తీఱవలయును. దీనిమీదటకూడ ఆ యెదుటివాడు మూర్ఖుడై "కురాను చదువు, లేనిచో చావవలసియుండును" అనియన్నచో "సోదరా! అందఱకు చావు ఉన్నదేగదా! ఇదిగో చంపవలసియున్నచో చంపు" అని వానితో శాంతముగా చెప్పవచ్చును. కాని దానికి బదులు ఎదుటివాని మాటను మనము నోరుమూసుకొని ఒప్పుకొన్నచో బాగుగ శరీరమునుండి రక్షింపబడవచ్చును. కాని మన ఆత్మనుమాత్రము పూర్తిగా అవమాన పఱచివైచినవార మౌదుము. అవమానము పొందుటకంటె చనిపోవుటకే శక్తి యున్నచో ఒక చిన్న బాలుడు కూడ నిర్భయముగ కష్టములను ఎదుర్కొనగలడు.

క్రమశిక్షణయొక్క పాఠము

అట్లే క్రమశిక్షణతో ఉండుటకు తగు పాఠమును మనము నేర్చుకొనవలయును. ఇళ్ళకు నిప్పు అంటుకొన్నపుడు మనము మొత్తము అందఱముకూడ ఒక పద్ధతిలో పనిచేయు

టకు శిక్షణ పొందవలసియున్నది. కవాతు కర్రలతో ఆట మొదలగు వానిద్వారా క్రమశిక్షణ నేర్పబడుచున్నది. కాని అంత మాత్రమున మన పని నెఱవేఱు ననుకొనుటకు వీలు లేదు. మనము శరీరమునకు ఆత్మకుగల భేదమును తెలిసికొనవలయును. మనమే కనుక ఇది తెలిసికొన్నచో ఈయాట శరీరమునుగూర్చి నిర్లక్ష్యముగా నుండుటకును, నవ్వుచు చనిపోవుటకును సాయపడును.

మహిళాశ్రమమువంటి సంస్థలకు దేశములో ప్రతి మూలనుండి సోదరీమణులు వచ్చుచుందురు. చక్కని సంస్కారమును శిక్షణమును పొందుచుందురుగదా. మఱిమీరు ఈ విధముగా నిర్భయముగా ఉండి చనిపోవుటకు నేర్చుకొన్నచో క్లిష్ట పరిస్థితిలో మీరు దేశమునకు గొప్ప సేవ చేయగలరు. గొప్ప శ్రేయస్సును పొందగలరుకూడ.

మహిళాశ్రమము, (వార్ధా)
౫-౧౧-౪౬

## ఆత్మచే ఆత్మ నుద్ధరింపుడు

ఒక ప్రశ్న :– "స్త్రీలయుద్ధరణము స్త్రీల ద్వారానే కావలయును" అని మీరు చెప్పుచున్నారు. కాని యిది యెట్లు అగును ?

స్త్రీలు మేల్కొన్నప్పుడు, స్త్రీలలో శంకరాచార్యుని వంటి తీవ్ర జ్ఞాన వైరాగ్యములుగల భక్తిగల నిష్ఠయున్న స్త్రీ పుట్టినప్పుడు స్త్రీల యుద్ధరణ జరుగును. ప్రపంచములో

నేటివరకు సమాజముపైని ప్రభావము పొందినవారు ఎవరైనను ఉన్నను వారు పురుషులే. ధర్మముమీదకూడ వారి ప్రభావమున్నది. ఈ విధముగా స్త్రీలకు ధర్మము ప్రభావము పడినప్పుడే వారి యుద్ధరణము జరుగును. ఇట్లు అగుట చాల యవసరము.

స్త్రీలను ఉద్ధరించువారిలో శ్రీకృష్ణభగవానుడు ఒకడు. మహావీరజినస్వామికూడ స్త్రీలకై పనిచేసెను. గాంధీజీకూడ స్త్రీలకై పాటుపడెను. (ఇది ఇదివఱకే చెప్పబడెను.) అన్నాసాహెబుకర్వేవంటి పురుషుడుకూడ తన జీవితమంతను ఈపనిలోనే గడపెను. స్వామిదయానందుడుకూడ స్త్రీలకై చాల పఱకు చెప్పెను, చేసెనుగూడ. అయినను స్త్రీలకు నేడు ఎట్టి స్థితియున్నది? సమాజములో పురుషులకే ఎక్కువ యధికారమున్నది. దానికి కారణమేమనగా, స్త్రీలకై పాటుపడు వారందఱు పురుషులే. కనుక అంత ఎక్కువగా వారు చేయలేక పోయారు. ఈపని స్త్రీలే తాము స్వయముగా చేయవలయును. అప్పుడే మంచిపని కాగలదు. ప్రాణియొక్క యుద్ధరణము ప్రాణియొక్క యాత్మబలము చేతనే యగుచున్నది. అనుభవములోనున్న సిద్ధాంతము ఏ ప్రాణియైతే స్వయముగా తనకుతాను ప్రయత్నము చేయునో ఆ ప్రాణికే పరమేశ్వరుని సాయము లభించును. వారి మనస్సులో అత్యంతము తీవ్రత కనిపించినప్పుడే పరమేశ్వరుడుకూడ సాయము చేయును. తీవ్రతలేక ప్రయత్నములో ఆదుర్దా లేనపుడు భక్తి యుండదు. తీవ్రత ఉన్నపుడు భక్తి కలుగును. అపుడు పరమేశ్వరుడు సాయపడును. ఏ జీవము

యొక్క యుద్ధరణమైన జరుగవలెనన్నచో ఆ జీవముయొక్క తీవ్రమైన యిచ్ఛవల్లనే జరుగును. దాని యిచ్ఛాశక్తివల్లనే పనియంతయు నెఱవేరును. ఇట్లు పరమేశ్వరుడు యందఱను ఉద్ధరించువాడే యైనను ఎవడు తన యుద్ధరణకై తీవ్రమైన యిచ్ఛను కలిగియుండునో వానికే అతడు సాయపడును.

## బ్రహ్మవాదినులగు స్త్రీలు

ఒక కాలములో స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యము గలదు. పురుషులు బ్రహ్మవాదులయినట్లే స్త్రీలుగూడ బ్రహ్మవాదినులైరి. స్త్రీల సూక్తములుకూడ కొన్ని వేదములలో వచ్చెను. మొదట స్త్రీలకు వేదము నభ్యసించు నధికారము గలదు. ఇపుడు స్త్రీలకు వేదాధ్యయనాధికారము ఇవ్వబడుట లేదు. కాని వేదములో అంభృణి యనునొక ఋషికన్య సూక్తముగలదు. ఇటువంటి బ్రహ్మవాదినులగు స్త్రీలు ఉండిరి. వారి సూక్తములు వేదములలో చాల ప్రసిద్ధములై యున్నవి. తమ్ము గౌరవించుకొను సమయములో "పరమేశ్వరుని కృతియె నాకృతి" అని చెప్పుకొను నంతగా వారు పరమేశ్వరునితో ఏకరూపలైనారు. "సృష్టిలోని సర్వప్రాణులును నాయాశ్రమములో నున్నవి. కాని వారికి తెలియుటలేదు. వారు నన్ను ఆధారము చేసికొనియె పనిచేయుచున్నవి." అని వారు గానము చేసిరి.

వారు ఈశ్వరునితో ఏకరూపలై అన్నిటికి ఈశ్వరుడే కర్తయని మన్నించి "నేను ఎవరిని పైకెక్కింప గోరు

చున్నానో వారిని ఎక్కించుచున్నాను. ఎవరిని ఋషులనుగా చేయగోరుచున్నానో వారిని ఋషులను చేయుచున్నాను. పరమేశ్వరుని కర్తృత్వమె నా కర్తృత్వము" అని వారు వర్ణించుచున్నారు. వారు పరమేశ్వరుని రూపము తీసికొని చెప్పుచున్నారు.

## నేడు స్త్రీలకు స్వాతంత్ర్యము లోపించినది

నేడు ఇటువంటి స్త్రీలు కలలోనివంటివారై పోయిరి. నేడు ఏ స్త్రీప్రభావమును సమాజముమీద పడునట్లు కని పింపదు. నేడు వారి స్వాతంత్ర్య వ్యక్తిత్వము నిలిచియుండ లేదు. నేడు వారు స్వతంత్రముగా జీవించుటయే లేదు. కను కనే నేడు ఒకరి భార్యగానో ఒకరి సోదరిగానో వారు పరి చయము చేయబడుచున్నారు. నేడు స్త్రీలకు కొన్ని సదు పాయములు చేయబడుచున్నవి. స్కూళ్ళలో స్త్రీలు అధ్యా పికలగుచున్నారు. ఆఫీసులలో పనిచేయుచున్నారు. శాస నమువల్ల వారికి పుత్రునితో సమానముగా హక్కు లభించు చున్నది. స్కూళ్ళలోకూడ వారు చదువగలుగుచున్నారు. పురుషులతోపాటు వారు సమానముగా పనిచేయుచున్నారు. సిగరెట్లుగూడ కాల్చగలుగుచున్నారు. ఇన్ని అధికారము లన్నియు వారికి లభించినను, వీనివలన వారి యుద్ధరణ అగుటలేదు. వారు ఆధ్యాత్మికమైన యధికారములను పొంది నప్పుడే వారి యుద్ధరణ జరుగును. ఈ యధికారము హిందూ ధర్మములోనే కాదు. ఇతర ధర్మములలోగూడ గలుగు చున్నది. బైబిలులోను గలదు. స్త్రీల నుదుటిపైన పురుషుడు

పురుషుని నుదుటిపైన పరమేశ్వరు డున్నాడని అందుగలదు. అనగా స్త్రీకి తిన్నగా పరమేశ్వరునితో సంబంధము లేదన్న మాట. పరంపరగానే మధ్యగా ఒక ఏజెన్సీని తీసికొనియే స్త్రీ పరమేశ్వరునిదగ్గఱకు చేరగలదు. ఈ సంగతి క్రైస్తవ మతములోను గలదు. హిందూమతములోను గలదు. హిందూమతములోనైతే పత్ని పతిచేతితో చేయికలుపు చున్నది. అయితే దాని చేతితోగూడ ధార్మిక కార్యము అయ్యెనని తలచబడుచున్నది. అనగా ఇంజెన్‌తోకూడ పెట్టె చేర్చబడెనన్నమాట. ఇపుడు ఇంజనును ఎక్కడకు తీసుకొని వెళ్ళిన అక్కడకు పెట్టెకూడ వెళ్ళును. ఈవిధముగా పురుషు లనెడి ఇంజనుతోగూడ స్త్రీలనెడి పెట్టె చేర్చబడెను. పెట్టెలో జామపండు ఉండవచ్చును. అరటిపండ్లు, ద్రాక్షపండ్లు నిండి యుండవచ్చును. ఇంజనులో బొగ్గు ఉన్ననుసరే. ఇంజను ఇంజనే. అది పెట్టెను తన నడకతోపాటు లాగును. ఇంజను నడకమీదనే పెట్టెనడక నిశ్చయముగా ఆధారపడియుండును. ఈ విధముగా ఒక స్త్రీ గాంధీజీతోపాటు, ఒకతె కృష్ణుని తోను గలుపబడుచున్నది. అపుడు దానికి దానితో సహజ గతి లభించుచున్నది. దానికి స్వతంత్రగతి లేదు. దాని గతి ఇతరులమీద ఆధారపడియున్నది.

## స్త్రీల యుద్ధరణ యెట్లగును?

ఇప్పుడైతే స్త్రీలకు ఓటు ఇచ్చు హక్కు లభించినది. కాని దానిలోగూడ చాలమంది స్త్రీలు తమ భర్తనడిగి ఓటు వేయుచున్నారు. ఈ యధికారమును ఆమె స్వయముగా

తీసికొనలేదు. ఆమెకు లభించినది. ఇతర దేశములలో స్త్రీల కిట్టి హక్కు లేదు. కనుక ఇది ఇచ్చిన యధికారముగాదు. లభించిన యధికారము. కాని అధికారమైతే సంపాదించివేయ వలసియుండును. కనుక స్త్రీలకు బాగుగా ఓటు హక్కు లభించినను దానివల్ల అధికారము దొరకదు. ఇది నా యధికారము. దానివల్ల నేను నా యిష్టమువచ్చినట్లు చేయగలను అను ఆ భాసగూడ ఆమెకు కలుగుటలేదు. స్త్రీలు నిస్వార్థవతులైనపుడు ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నలైనపుడు శాస్త్రములలో మార్పులు చేయువారైనప్పుడు అప్పుడే వారి యుద్ధరణ యగును. కొన్ని శాస్త్రములలో స్త్రీ పురుషుల భేదమేమియు లేదు. వారిట్లు క్రొత్త శాస్త్రములను తయారుచేసినప్పుడు మానవధర్మము కూడ ఉద్ధరింపబడును. నేడైతే శాస్త్రములను రచించు శంకరాచార్యుడు, బాదరాయణుడు మొదలగు పురుషులు మాత్రమె కనుపట్టుచున్నారు. కాని ఇట్టి పరివర్తన కలిగించు స్త్రీ బయలుదేరినప్పుడు ఆమె మానవత్వశాస్త్రమును రచించును. అపుడు స్త్రీ యొక్కయు, మానవత్వము యొక్కయు ఇద్దర యొక్క యుద్ధరణము జరుగును.

సోఖరా (బరోడా)

౨౮-౧౦-౩౮

## మీ హక్కు పొందుమార్గము

సంన్యాసము, బ్రహ్మచర్యము,పరివ్రజ్యవీనిని తీసికొనుటకు అనుమతియున్నను వేలకొలది స్త్రీలు సన్యాసినులుకారు. నేడు పురుషుల కనుమతియున్నదని వేలకొలది పురుషులు

సంన్యాసులగుట లేదుగదా. కాని అనుమతియున్నది. లేక పోవుట అనెడి (Disability) యొక యవర్హత ప్రగతికి ఒక యడ్డు గలిగించుచున్నది. హిందూ ధర్మములో మొదట ఇట్లు లేదు. కాని "కలియుగములో సంన్యాసము అందరకు వర్జితము" అని మధ్యకాలములో అంగీకరింపబడెను. దీనికి శాంకర సంప్రదాయమువల్ల దెబ్బతగిలెను, శంకరాచార్యుని గురువు సన్యాసి. వారు మొదటిలో గృహస్థాశ్రమము తీసికొని పిదప సంన్యాసమును గ్రహించిరి. బ్రహ్మచర్యము నుండియె సంన్యాసి కావలయునని శంకరుడు తన యిచ్ఛను ప్రకటించెను. సంన్యాసమున కనుజ్ఞ యిమ్మని తల్లినికోరెను. తల్లి యనుజ్ఞ యివ్వలేదు. కాని చివరకు ఇవ్వవలసివచ్చెను. నేడు మనము శంకరాచార్యుని ఎక్కువ గౌరవముతో గానము చేయుచున్నాము. హిందూధర్మము పైన శ్రీకృష్ణ భగవానుని పిదప అందరకంటె ఎక్కువ ప్రభావము పడిన వ్యక్తి ఎవరైన ఉన్నచో వారు శంకరాచార్యులే.

వారి భాష్యములు, స్తోత్రములు మొదలైనవి దేశము మొత్తముమీద అన్నిచోట్ల చదువబడుచున్నవి. కాని వారు ఎట్టి పరిస్థితులలో ఉండిరో దానిని మనము ఊహించలేము.

## చివరవఱకు క్షమార్పణను కోరలేదు

"శంకరాచార్యులు సంన్యాసము తీసికొని ఉత్తర హిందూస్థానములో సంచారము చేయుచుండగా తల్లి తలపునకు వచ్చెను. తలపునకు రాగానే తన తల్లి తన్ను పిలుచు

చున్నదని అతనికి తలెను. కనుక వెంటనే దక్షిణదేశమువైపు నకు మరలి వచ్చివేసెను. ఇంటికి చేరెను. అపుడే వారి తల్లి చనిపోవుటకు సిద్ధముగా నుండెను. తల్లికి భగవంతుని దర్శనము కావలయును కనుక కృష్ణాష్టకమును శంకరాచార్యుడు వెంటనే రచించెను. తల్లి ముఖమునుండి దానిని చదివింప జేసెను. దానిలో చివరి పంక్తిని పలుకుచుండగనే ఆమెకు భగవంతుని దర్శనమయ్యెను'' అని యొక కథ కలదు. తల్లి తన కుమారునికి సన్యాసము గ్రహించుటకు అనుమతి ఇచ్చెను. మఱి కలియుగములోనో సన్యాసము వర్జింపబడినదయ్యెను. కనుక "టాల్‌స్టాయిని పోపు (క్రైస్తవ మతాధికారి) బహిష్కరించి"నట్లు గాంధిజీని హిందూమత శత్రువని తలచి చంపినట్లు సమాజము అనగా నంబూద్రి బ్రాహ్మణులు అతనిని బహిష్కరించిరి. బహిష్కారమువలన తల్లిని శ్మశానమునకు తీసికొనిపోవుట కెవరును సాయము రారైరి. అప్పుడు జాతి భేదమున్నది. అందువలన ఇతరజాతివారు రాలేకపోయిరి. శవమును మోయుటకు ఎవరును రాలేదు. అప్పుడు శంకరాచార్యుడు కత్తితో తల్లి కళేబరమును మూడు ముక్కలు చేసి ఒక్కొక్క ముక్కనే శ్మశానమునకు తీసికొని పోయి తగులబెట్టెను. వారు మిక్కిలి తీవ్రమైన జ్ఞానము గలవారు. ఇట్టి సమయములో గూడ వారు తమ పట్టునుండి దిగజారిపోలేదు. వారు క్షమార్పణ కోరియున్నచో బ్రాహ్మణులు శ్మశానమునకు వచ్చియుండెడివారే. కాని వారు క్షమార్పణమును కోరలేదు.

## హక్కు సంపాదించుట కిదే పద్ధతి

నేడు శంకరాచార్యులను గూర్చి నంబూద్రి బ్రాహ్మణు లలో వారి సంస్కృతిని గురించి "శవమును తగులపెట్టుటకు ముందు శవముమీద మూడుగీతలు గీయుటకూడ ఒక ఆచారమైపోవునంతగా వారియెడ ఆదరము ప్రబలినది. కాని ఆ కాలములో తల్లి శవమును మోయుటకై ఒక్కరును రాలే నంత కఠోరస్థితి యున్నది. అయినను శంకరాచార్యుడు సమాజముపైన ఏ యాక్షేపణమును వేయలేదు. వారి గ్రంథము లలో ఎక్కడను సమాజముపై కటుత్వము చూపలేదు. ఉత్తమ సంస్కర్తయొక్క లక్షణ మిదే. శంకరాచార్యుడు సంన్యాసాధికారమును పొందుట కింతపని చేయవలసివచ్చెను. ఇదేవిధముగా ఒక్కొక్క హక్కు పొందుట కిన్ని చిక్కులు పడవలసివచ్చును.

## స్త్రీ పురుషులు సమానమనెడు హక్కు ఎట్లు లభించును ?

స్త్రీ పురుషులు సమానము అను హక్కునుగూడ ఇట్లే సంపాదింపవలసియున్నది. స్త్రీలుగూడ పురుషులతో సమానము. వారు బీడీ, చుట్టలు త్రాగగోరినచో ఆహక్కు సులువుగానే లభించును. కాని సన్యాసము, బ్రహ్మచర్యము, పరిబ్రజ్య మోక్షముల హక్కును వారు పొందగోరినచో ఎవరైన ఒక జ్ఞానవంతురాలైన తీక్ష్ణమైన వైరాగ్యముగల స్త్రీ బయలుదేరినప్పుడే అది సాధ్యపడగలదు. గాంధిజీగాని మరొకరుగాని ఆ హక్కును ఇప్పించుటవలన ఆ హక్కు సిద్ధింపదు,

శంకరాచార్యుని కోటికి చెందిన ఒక స్త్రీ బయలుదేరినచో ఆ హక్కు వారికి సిద్ధించును.

బడుమపాలెయము
౧౧—౧౦—౫౬

# ౪. మాతృశక్తియొక్క మహత్త్వము

శరీర పరిశ్రమ చేయువారిని నీచముగా తలచుచున్నాము. వారికే విధమైన సెలవులు వుండవు. పాకీవానికి ఒక రోజు సెలవుఇచ్చితిమా గ్రామమంతయు దుర్గంధముతో నిండిపోవును. ఇంత యుపకారము చేయువారిని మనము నీచులుగా దలచుచున్నాము. వారు శుభ్రముగా ఉండుటకు సబ్బువగైరాలైనను ఇవ్వము. వారికి గౌరవములేదు. ప్రతిష్ఠ లేదు. సమ్మానము లేదు. పాకీవాడనగా పవిత్రుడని యర్థము. పాకీవానిని మేహతరు అని హిందీలో అందురు. మేహతరు అనగా మహత్తరుడు. ఇటువంటి మహత్తరుని పాకీవానిని (పవిత్రుని) నీచునిగా దలచితిమి. మహత్తరునైతె నీచునిగా దలచితిమి సరే. కాని మన తల్లినిగూడ మనము నీచముగా దలచితిమి.

## తల్లి గౌరవము

'ఒక శిక్షకుడు పదిమంది యుపాధ్యాయులతో సమానము, ఒక తండ్రి నూరుగురు శిక్షకులకు సమానము. ఒక తల్లి వేయి తండ్రులకంటె ఉత్తమురాలు' అని శాస్త్రములలో

గలదు. తల్లికి ఇటువంటి గౌరవము ఇవ్వబడినది. ఇది శాస్త్ర ములలో చెప్పబడినసంగతి. కాని వ్యవహారములో మనము స్త్రీలను హీనలగా దలచుచున్నాము. పొలములోపనికి స్త్రీలు వెళ్ళినచో వారికికూలి తక్కువ యిచ్చుచున్నాము. స్త్రీలకు ఎక్కువకూలి యివ్వవలసి యున్నది. ఏలయనగా: వారు ఇంటిపనికూడ చూడ వలసి యున్నది. పిల్లలపాలన పోషణ భారము వారిదే. ఎక్కువ యివ్వకపోతె మానె సమానముగా నైనను ఇవ్వుము. ప్రతిచోట స్త్రీలకు కూలి తక్కువే యివ్వ బడుచున్నది. స్త్రీలను బరువుగా చూచుచున్నాము. స్త్రీలు రాత్రింబగుళ్ళు పనిచేయుచున్నారు. ఐనను వారు మనకు బరు వుగానే తోచుచున్నారు. ఏలయనగా- పరిశ్రమ ప్రతిష్ఠ లేనే లేవుగదా.

"స్త్రీలు వస్తూత్పత్తి పని చేయరు. కేవలము వంట మాత్రమె చేయుదురు" అందుము. వంట యనగానేమో మనము తెలిసికొననైనను తెలిసికొనలేము. వంట వస్తూత్పత్తి పని కాకపోతే వడ్రంగము వస్తూత్పత్తిని జేయుపనియా? వడ్రంగి ఏమిచేయును? కఱ్ఱతీసుకొనును. దానితో క్రొత్త వస్తువును తయారుచేయును. అట్లే స్త్రీ పిండి, బియ్యము తీసి కొని రొట్టె, అన్నము తయారుచేయును. క్రొత్త వస్తువును తయారుచేయుటయె ఉత్పాదనపని అన్నచో బ్రహ్మదేవుని తక్క ఇంకెవరిని వస్తూత్పాదన చేయువారిని మనము చూడము. కర్షకుడు పరమేశ్వరుడు పుట్టించి యిచ్చిన గింజను పొలములో నాటును. దానివల్ల వేయిరెటు పంట వచ్చు చున్నది. అదికూడా పరమేశ్వరుడే చేయుచున్నాడు. కఱ్ఱతో

కుర్చీ తయారుచేయుట, తోలుతో చెప్పులు చేయుట అనగా ఒక వస్తువును ఇంకొక రూపములోనికి మార్చుటయేగదా. మనము క్రొత్తవస్తువును తయారు చేయలేము. అసలు మనమే స్వయముగా తయారుచేయబడితిమి. మనము కృతులము (చేయబడినవారము)గాని కర్తలముగాము. కట్టెతో కుర్చీని చేయుట, అనగా కట్టెకు మారురూపము గల్పించుటయే గదా. గోధుమ పిండితో రొట్టె తయారుచేయుట అనగా రూపాంతరము చేయుటయేగదా. మన తల్లులు సోదరీమణులును మనతో "మీరు రోజురోజు పదునెనిమిది అణాలు ఇచ్చినగాని మేము రొట్టె చేయము" అని చెప్పినచో అప్పుడు దీనిని ఉత్పాదన పనియని యనుకొందుమా?

## మాతృ సేవ

తల్లి తన పిల్లలకు రాత్రింబగళ్ళు సేవచేయుచున్నది. ఎవరైన ఆమెదగ్గఱకు వెళ్ళి 'నీవు చేసిన సేవకు రిపోర్టు ఏది?' అని యడిగినచో ఆమె ఏ రిపోర్టు యిచ్చును? తల్లి తాను రిపోర్టు అయినను యివ్వలేనంత సేవ చేయుచున్నది. కావలసినచో ఆమె 'నేను పిల్లలకు ఏ సేవయు చేయుటలేదు' అని యొక్క మాటలో చెప్పివేయును. బలే బాగున్నది. తల్లి రిపోర్టు ఇంత తక్కువగా ఎందుకు ఉన్నదో తెలియునా? దానికి కారణము తల్లి హృదయములో పిల్లలను గురించి ఎంత ప్రేమయున్నదో దానినిబట్టి చూచినచో ఆమెకు తాను సేవచేసినట్లైనను తోచదు. సేవ చేయుటలో ఆమె ఏమీ తక్కువ కష్టములు సహించుటలేదు. కాని ఆ కష్టములు

కష్టములుగా తోచనే తోచవు. కనుక మనము మన యెదుట పెద్ద గొప్పపని చేయవలెనను కల్పన యుంచుకొన్నచో ఇంత వఱకు మనము చేసినది ఏమియు చేయనట్లే తెలియును. 'ఇంద్రియములను నిగ్రహములో ఉంచుకొనవలయును' అను నొక్కవాక్యమే మనయెదుట ఉన్నచో 'ఇన్ని దినములైనవిగదా మనమేమి పని చేసితిమి' అని లెక్కపెట్టిచూచిన ఇంతవఱకు మనకు గలిగిన ఫలమేమియు కనిపింపనే కనిపింపదు. కాని ఒకానొక గొప్పపని చేయవలెనని సంకల్పించుకొన్న దానిని ఇంద్రియ నిగ్రహమందుము. అపుడు దీని విషయములో 'ఇది మేము చేయుచున్నాము' అని కర్తరి ప్రయోగము ఉండదు. 'నిగ్రహము చేయబడుచున్నది' అని కర్మణి ప్రయోగము మాత్రమె యుపయోగింపబడును. లేక 'నిగ్రహమె మనము చేయవలయునది' అనియైన చెప్పుదుము.

## సర్వోదయ భావములకు బీజము

నా పిల్లలందఱకు మంచినీళ్ళు దొరకువరకు నేను మంచినీరు త్రాగను అని ఒక తల్లి చెప్పెను. ఆమె దగ్గర ఒక చెంబెడు మంచినీళ్ళు ఉన్నవనుకొనుడు. పిల్లలందఱి దప్పిక తీరువఱకు ఆమె తన దప్పిక తీర్చుకొనదు. ఒకవేళ ఆమెకు అసలు నీళ్ళు మిగులక పోయినచో ఆమె స్వాయముగా మానసికానందమును అనుభవించును. ఇదే మాతయొక్క మాతృత్వమనగా. దీని తాత్పర్యమేమనగా తల్లి యొక్క ఈ భావన తన పిల్లలతో సర్వోదయ భావనమె. నిస్సంశయముగా ఆమె భావన ఆమె కుటుంబము. ఆమె పిల్ల

లందరవరకు మాత్రమె హద్దుకలిగి యుండును. కనుక ఆమెకు సర్వోదయ భావనగూడ అంతవరకు హద్దుకలిగి యుండును.

## మాతృశక్తియొక్క మహత్త్వము

'మాతృ దేవోభవ'(తల్లిని దేవతగా భావింపుము) అని శాస్త్రములో మొదట చెప్పబడినది. దానికి పిదప "పితృ దేవోభవ" (తండ్రిని దేవతగా భావింపుము) అని చెప్ప బడెను. అనగా తల్లిస్థానము మొదటిదిగా అంగీకరింపబడెను. ఒక ఋషి తన జ్ఞానమునుజెప్పి అది యెట్టిదో చెప్పుచు మాతృవాన్ పితృవాన్ ఆచార్యవాన్ పురుషో వేద _ తల్లి దండ్రులు ఆచార్యుడుగల పురుషుడు జ్ఞానమును తెలిసికొనెను" అని చెప్పెను. అనగా తల్లిదండ్రులు, గురువు ఎట్లు చెప్పుదురో అట్లే యీ జ్ఞానమును అనగా, మొదట జ్ఞానమునుఇచ్చు గురుత్వము తల్లికి అర్పింపబడెను. జ్ఞానదేవుని అభంగములు (గేయములు) ప్రసిద్ధములే. శిశువును ఉయ్యాలలో పరుండబెట్టి ఉయ్యాల ఊపుచు ఊపుచు తల్లి వానికి వేదాంతమును నేర్పెను. తల్లిలో ఇంత శక్తి నిండియున్నది. ఇటువంటి తల్లులు ముందుకు రావలయును. ఇంటిలో వారి రాజ్యము నడచుచున్నది. ఇది మంచిదే కాని బైటకూడ వారి యంకుశము ఉండవలయును. ఎవరి జీవనములో ఇట్టి అంకుశము ఉండునో వారిజీవనములో ఒక విలక్షణమైన వెలుగు ప్రకాశించును. శివాజీకి, సానేగురుజీకి బాల్యములో తల్లివలననే జ్ఞానము లభించెను. మఱి అ దేసమయములోనె ఆమె వారి హృదయములో స్థానము సంపాదించెను. శంకరా

చార్యుడు శ్రుతిని తల్లి అనెను. మావంటి మనుష్యులు కూడ జ్ఞానేశ్వరుని "జానో బామాఉలీ" జ్ఞాన దేవమాత అని చెప్పుచునేయున్నాము. గురుడుకూడ మరాఠీ భాషలో "మాఘవీ" (మాత) అని చెప్పబడెను. జ్ఞానదేవుడుమాత్రము ఇంతకంటెకూడ ముందుకుపోయెను.

"జేథ్ పియాచీ పరిసీమా, తేథభేటే మాఉలీఆత్మా"
"ఎక్కడైతే ఆత్మమాతయొక్క దర్శనమగునో అక్కడ సంసార సుఖము పిప్పిగా అయిపోవును.

రాజూరీ (బీఢ్)
౮ ౯-౫౮

## గ్రామ మాతలము కావలయును

ఇంటిలోనున్న ప్రేమ వాతావరణమే గ్రామములోను నిర్మాణము కావచ్చును. "మీరు గ్రామ మాతలైనచో గ్రామము గోకులమగును." అని నేను సోదరీమణులతో చెప్పగోరుచున్నాను. ఈ ప్రపంచములో వైకుంఠము నిర్మాణమగును. ప్రేమ యున్నచో వైకుంఠ మేర్పడును. అది ఏదో మూల పడియుండదు. అది కైలాసములోనే లేదు. మన మున్నచోటగూడ నున్నది. గ్రామములో ప్రేమ వాతావరణమున్నచో అందఱి జీవితములు పవిత్రములగును. అప్పుడు గ్రామము గోకులమగును. స్త్రీలు దీనిని సులువుగా గ్రహింపగలరు. దీనిని తెలిసికొనుటలో వారికి కష్టమేమియు లేదు. కాని వారినైతే సభలలోనికికూడ రానిచ్చుటలేదు. పర్దాలో ఖైదీలనువలె వారిని ఉంచుచున్నారు. దీనికి ఫలి

తముగా వారి హృదయములు సంకుచితము లయిపోవు చున్నవి. అసలు వారి హృదయములు సంకుచితములు కావు. కాని ఇళ్ళలో సంకుచిత వాతావరణములో పడియుండుట వలన వారు తమ పిల్లల విషయము మాత్రమె ఆలోచించు చున్నారు. కాని స్త్రీల పనిపాటలలో జ్ఞానమువచ్చి పడెనా వారి సంగతి యిట్లుండదు.

స్త్రీ పురుషులు ఇద్దరుకూడ కూడినడచుటవలన సంఘ మను బండి నడచుచున్నది. ఇద్దఱకు మోక్షాధికారము సమానమే. స్త్రీలకు మోక్షమునకు, విజ్ఞానమునకు, జ్ఞానము నకు అధికారము లున్నపుడు వారు కోరినచో ధనమునకు కూడ అధికారము ఉండవలెను. ఇద్దఱకు సమానాధికారము లుండవలెను. తల్లులకు సరియైనరీతిగా జ్ఞానము లభించినచో సమస్త సమాజమునకు రక్షణయైనట్లు ఇంక దేనివలనను కానేరదు.

## శ్రేష్ఠతమమయిన గురువు : మాత

శిక్షణమును గురించి ఆలోచించినకొలది నాకు ఈనాటి యాంత్రిక శిక్షణము ఒక మూసలో పోతపోయబడినదిగా కనిపించుచున్నది. అంతకంటె శిక్షణము లేకుండుటయైనను మేలె అనిపించుచున్నది. ఇప్పుడు నడచుచున్న శిక్షణమును బందుచేసినచో తండ్రి తన కొడుకునకు మానవత్వ శిక్షణము ఇవ్వడని, వ్యవసాయపు జ్ఞానమును సదాచారమును వ్యవ హార జ్ఞానమును ఇవ్వడని మీరనుకొనుచున్నారా ? అందఱ కంటె ముందుగా పిల్లవానికి తల్లిదండ్రులు శిక్షణ యిచ్చు

చున్నారు. అంతకంటె కొంచెము ఎక్కువగా గురువు శిక్షణ యిచ్చును. కనుక "మేమె పిల్లలకు శిక్షణమునిచ్చుచున్నాము" అని గురువులకు అహంకారము ఉండనవసరము లేదు. తల్లులు ఇచ్చుశిక్షణము మొదటితరగతిది. తండ్రులుఇచ్చునది రెండవ తరగతిది. గురువు లిచ్చునది మూడవ తరగతిది. కాని ప్రభుత్వ శాఖలనుండి లభించు శిక్షణ కే నంబరుగాని ఉండజాలదు. ఏలయనగా – అదియొక మూస.

తల్లిదండ్రులున్నంతవఱకు – తల్లిదండ్రులు లేకుండ పుట్టరుగదా–పిల్లలకు జ్ఞానము లభించుచునేయుండును. పరమేశ్వరుని యోజనయే ఇట్టిది. ఎప్పుడైతే పరమేశ్వరుడు పిల్లవానికి ఆకలి అన్నది పెట్టెనో అప్పుడే తల్లిదగ్గఱ పాలు సృష్టించెను. పిల్లవాని ఆకలితో పాటు పిల్లవానికి పాలిచ్చు ప్రేరణను తల్లికి పెట్టెను. ఈ విధముగా చిన్నప్పటినుండి తల్లిద్వారా ప్రేమ శిక్షణ యివ్వబడుచున్నది. బాలురకు మాతృభాష నేర్పుటకు ప్రభుత్వము ఎన్నికోట్లు ఖర్చుపెట్టు చున్నది? కాని తల్లి పాలిచ్చుచు ఇచ్చుచు మాతృభాష నేర్పుచున్నది. ప్రపంచమంతటిలోని పిల్లలు తల్లి దగ్గర భాష నేర్చుకొనుచున్నారు. 'ఇదిగో చంద్రుడుచూడు' అని తల్లి పిల్లవానితో చెప్పును. బాలుడు వినుచున్నాడు, "చంద్రుడేడి" అని తల్లి మరల అడుగుచున్నది. ఆమె పరీక్ష చేయుచున్నది. చంద్రుడెక్కడున్నాడో బాలుడు వ్రేలితో చెప్పుచున్నాడు. పిదప అతడు మాటాడసాగును. చ, చ, చ, చం, ద్రు అనుచు మఱి తిరిగి చంద్రుడు చంద్రుడు అని పలుకును. అనగా మొదట వస్తువును గ్రహించును, పిదప

పలుకును. ఈ జ్ఞానమంతయు భాష నేర్చుకొను జ్ఞానము. ఏమి అది విద్యాలయముల శిక్షణకంటె తక్కువైనదా! రెండు రెండున్నర సంవత్సరములలో శూన్యమునుండి జ్ఞానము పుట్టించబడును. మఱి ఇదంతయు తల్లులే చేయుదురు. శిక్షణ వేత్తలు తమ యనుభవమును బట్టి పరిశీలనము బట్టి "బాలుడు మొదటి ఒకటి రెండు సంవత్సరములలో పొందినంత జ్ఞానము భావి జీవితమంతటిలోను పొందలేరు" అని యందురు. కనుక "తల్లులెగనుక సంస్కారవతులైనచో ప్రపంచము రక్షింప బడును" అని ప్రపంచములోని జనులందఱు చెప్పుదురు. కావున అన్నిటికంటె శ్రేష్ఠమైనగురువు తల్లియె అని అంద ఱును ఒప్పుకొన్నదె. తల్లిప్రేమ అందఱకు లభించినదే.

కస్తూరిబాయి దర్శనము
౧౪-౮-౫౪

## ధర్మపరాయణురాలగు తల్లిగర్భమునుండియె నాగరికులు పుట్టుదురు

హిందూ దేశములో స్త్రీలుఎక్కువగా ధర్మరక్షణమును చేసిరి, పురుషులలో ఎంతమంది దుర్వ్యసనపరాయణులు కని పింతురో, అంతమంది దుర్వ్యసనపరాయణులు స్త్రీలలో కని పింపరు. స్త్రీలు ప్రపంచములో సదాచారమును సజీవముగ ఉంచిరి. కనుక వారిమీదనే బాలుర బాధ్యతయున్నది. పిల్లలను మంచి యలవాటులలో ఉంచుట, వారిని శుచిగా శుభ్రముగా ఉంచుటయు స్త్రీల చేతిలోనున్నది. స్త్రీలు తమ పిల్లలను సత్ప్రవర్తనగలవారిగా చేసినచో దేశమునకు

మంచి నాగరికులు లభింతురు. పిల్లలే గొప్ప సంపద. వీరిని మించిన ధనమేమున్నది? కౌసల్యా గర్భమునుండి భగవంతుడైన శ్రీరామచంద్రుడు బయలుదేఱగా దేవకి గర్భమునుండి శ్రీకృష్ణభగవానుడు బయలుదేఱెను. లోకములో ఎంతమంది సత్పురుషులు పుట్టిరో వారి తల్లులందఱు ధర్మపరాయణలే. ఏయింటిలోని స్త్రీలు భగవంతుని స్మరింతురో, సత్యమును పరిపాలింతురో, ప్రేమ భావముతో నుందురో ఆ యింటిలోనే మహాత్ములు పుట్టుదురు అన్నది ప్రపంచములో ప్రసిద్ధమైన విషయము. కనుక స్త్రీలశక్తిలో గొప్ప శక్తియున్నది.

"సర్వోదయ"

ఏప్రిల్ '౫౧

## ౫. బ్రహ్మచర్యము

బ్రహ్మచర్యము భారతీయ సంస్కృతికి ఒక ముఖ్యమైన విషయముగా అంగీకరింపబడుచున్నది. ప్రపంచములోని యితర సంఘములలో దీనిపైన పరిశీలనయు ప్రయోగములును జరిగినవి. కాని హిందూ దేశపు సాహిత్యములోను సంస్కృతములోను, బ్రహ్మచర్య విషయమై యున్నంత యాదరము, దానిపైన జరిగిన గంభీర పరిశీలనము ఇంక యెచ్చటను జరిగినట్లు చూడము.

### బ్రహ్మచర్యము యొక్క యర్థము

బ్రహ్మచర్య శబ్దము యొక్క యాశయ మేమనగా మనుష్యుడు బ్రహ్మాన్వేషణములో తన జీవిత క్రమమును

సరిగా ఉంచుట. బ్రహ్మచర్యములో మనయెదుట అభావ రూపమైన (Negative) విషయము ఉంచబడలేదు. భావ రూపమైన విషయమె (Positive) యుంచబడినది? దాని విషయములో ముఖ్యముగా భాజ్యాభాజ్య విషయక నియమమే కాకుండ ఒక విషయమును ప్రత్యక్షము చేసికొనుట కూడ ఉన్నది. దానినే బ్రహ్మచర్యమందురు. బ్రహ్మచర్యము యొక్క యర్థమేమనగా - అన్నిటికంటె గొప్పదైన ధ్యేయము అనగా పరమేశ్వరుని సాక్షాత్కరింప జేసికొనుట. దానికంటె తక్కువైన దేదియు చెప్పబడలేదు. ఇంత విశాలమైన వ్యాపకమైన ధ్యేయ మది.

## బ్రహ్మచర్య సాధన ఎందుకు ?

ఏదో యొక గొప్ప ధ్యేయము కొరకుకూడ బ్రహ్మచర్య సాధన చేయబడుచున్నది. భీష్ముడు తన తండ్రికొరకు బ్రహ్మచర్య ప్రతిజ్ఞ చేసి దానిని బాగుగా జీవితమంతయు పరిపాలించెను. పిదప వారు గంభీరమైన ఆధ్యాత్మిక సాధనలో ప్రవేశించిరి. వారు ఆత్మనిష్ఠగల గొప్ప పురుషులలో లెక్కింపబడిరి. వారి బ్రహ్మచర్యారంభము బ్రహ్మప్రాప్తికి కాలేదు. కాని వారి ధ్యేయము మాత్రము గొప్పదే. వారు మొదట తండ్రికై త్యాగముచేసిరి. కాని పిదప దాని యర్థమును వారు గంభీరముగా పరిశీలన చేసిరి. ఇదేవిధముగా గాంధి మహాత్ముడు సమాజసేవకై బ్రహ్మచర్యమును ఆరంభించెను. దక్షిణాఫ్రికాలో వారు పనిచేయుచున్నప్పుడు వారి మనస్సులో "సేవాకార్యము చేయుట చాల కష్టము" అని

తోచెను. సేవతోపాటు కుటుంబము వృద్ధిచెంది పిల్లలుగూడ పుట్టుచున్నచో ఈ సేవాకార్యము నడవదు. కనుక "సమాజ సేవకై బ్రహ్మచర్య పాలనము అవసరము" అని వారు నిశ్చయించుకొనిరి. కాని పిదప వారి భావములు ఈవిషయములో ఇంకను గంభీరమయ్యెను. ఇట్లు గాంధిజీ ఆరంభించిన బ్రహ్మచర్యము సమాజసేవ చేయవలయునను ఉద్దేశముతో ప్రారంభింపబడెనే గాని అంతిమలక్ష్యమును బ్రహ్మమును పొందవలెనను ఉద్దేశముతో మాత్రము గాదు. అయినను అదియొక విశాలధ్యేయమే. మరల వారి యాశయము వికసించుచు పోయెను. ఈ విధముగా ఏదో యొక విశాలమైన వ్యాపకమైన ధ్యేయముకొరకు ఆరంభించినను ముందుకు పెరుగుచు పోయెను.

ఈ ప్రకారముగా బ్రహ్మచర్యము ఇతర విషయముల కొరకుగూడ అగుచున్నది. విజ్ఞానముకొరకు (సైన్సుకొరకు) బ్రహ్మచర్యము అవలంబించినవారుగూడ ఉన్నారు. విజ్ఞాన (సైన్సు) పరిశోధన చేయునపుడు గృహస్థాశ్రమమునందు పడి యుండుట యుచితముకాదను నంతటి తదేకనిష్ఠ గలవారై వారున్నారు. వారు విజ్ఞానములో తన్మయులై యుండుట వలన వారికి బ్రహ్మచర్యము నచ్చుబాటు అగుచున్నది. తన్మయత్వములో ఒక గొప్ప శక్తి యున్నది! ఏదో యొక విషయములో తన్మయులగుడు. అప్పుడు అదేవిషయము రాత్రింబగళ్ళు తోచును. అంతట బ్రహ్మచర్యము నచ్చును. అయితే అయినది కాని యిది సంపూర్ణ బ్రహ్మచర్యము

గాదు. బ్రహ్మనిష్ఠ ఉత్పన్నమగు నంతవరకు దానిని పూర్ణ బ్రహ్మచర్యమని యనలేము.

## ఇంద్రియములన్నిటిని నిగ్రహించుట

బ్రహ్మచర్యములో చాల గొప్ప సాధన చేయవలసి యున్నది. కేవలము ఒక యింద్రియమును నిగ్రహించుటను మాత్రమె బ్రహ్మచర్యమని యన్నచో హానికలుగును. అన్ని యింద్రియములను వశములో నుంచుకొనుటయె దానికర్థము. అందుచే "1. ధ్యేయము ఉత్తమమైనదిగా నుండవలయును. అది వికాసము పొందుచు బ్రహ్మోపాసనవరకు చేరవలయును. 2. అన్ని యింద్రియములపైన మనస్సుపైన అధికారము చెలాయింపగలిగి యుండవలయును" అను రెండు విషయములును బ్రహ్మచర్యములో ఉండును. ఇంద్రియములను, మనస్సును అణచిపెట్టి యుంచుట యని దాని యర్థము కాదు. మనస్సును ఇంద్రియములను ఉచితమగు దిక్కునకు తీసికొని పోవలయునని. బ్రహ్మచర్యములో ఉన్న సంగతి "అణచిపెట్టి యుంచుట" అను నుద్దేశముతో పని జరిగినచో మనుష్యునికి వికాసము గలుగదు. అది నెగటివ్ (అభావాత్మకమైన) సంగతి. కనుక అన్ని ఇంద్రియములను తగినట్లు ఉపయోగించుట, ఇంద్రియములను తగినరీతిగా నియమించుట అనునవే సాధకులకు మిగుల లాభదాయకము లగును.

## ప్రతి యాశ్రమముతోను బ్రహ్మచర్యము

ఈ దృష్టితో భారతదేశమందలి ధర్మభావములతో క్రమశిక్షణయొక్క ప్రణాళిక యేర్పరచబడెను. అన్నిటికంటె

మొదట మనుష్యునిలో గురువునందు నిష్ఠ యుండవలయును. దానితోపాటు బ్రహ్మచర్యమును కలిపిరి. ఇదే మొదటి యాశ్రమము బ్రహ్మచర్యాశ్రమ మయ్యెను. పిదప రెండవది గృహస్థాశ్రమము. దానిలో భార్యాభర్త లిద్దరకు ఒకరిపై నొకరికి నిష్ఠ యేర్పడును. దానితోపాటు గూడా బ్రహ్మచర్యమును కలిపిరి. తరువాత వానప్రస్థాశ్రమము. దానిలో సమాజ నిష్ఠతోపాటు బ్రహ్మచర్యమును కలిపిరి. ఇంకను చివరిది సన్యాసాశ్రమము. దీనిలోకూడ బ్రహ్మచర్య నిష్ఠను కలిపిరి. ఇట్లు మొదటినుండి చివరవరకు ఆ భావము ఉంచబడెను. భావమువలననే పోషణ లభించును. భావము లేకుండ పని జరగదు. మనము కాలినడకన పోవుచున్నచో పరిశ్రమ అగుచునే యుండును. అయినను దానిని యొక యాశయముచే చేయుచున్నాము. అందుచే ఆ శ్రమ మనకు తెలియుటయు లేదు. కనుక అది శ్రమ కాక తపస్సు అయినది. అట్లుగానిచో అది తాపమైపోయెడిదే. అందుచే అది తపస్సు అనబడుచున్నది.

## జీవనములోని ప్రాథమిక నిష్ఠ

బ్రహ్మచర్యాశ్రమములో గురునిష్ఠను గురించినసంగతి యున్నది. అధ్యయనము చేయవలసి యున్నది. దానితోపాటు బ్రహ్మచర్యాశ్రమము వచ్చుచున్నది. ఈ విధముగా మనుష్యుని జీవనమునకు పునాది పడుచున్నది. బ్రహ్మచర్యము ప్రాథమికమైన నిష్ఠ. నేడు "ప్రాథమిక శిక్షణము"ను గురించిన సంగతి చెప్పబడుచున్నది. పరిశ్రమ మొదలైన

జీవనమంతటిలో పనికివచ్చు వస్తువులు దానికి పునాదియయి స్థిరపడవలెనని దాని యుద్దేశ్యము. కాని బ్రహ్మచర్యము ఈ యన్నిటికంటెను గొప్పగుణము గలది. మనుష్యునికి నిత్యము సాయపడుచు జీవితములోని అన్నివిధములైన కష్టములనుండి తప్పించుచు ఉండునట్టి గుణముగలది యది. కనుక ప్రాథమిక శిక్షణములో అన్నిటికంటె ముందుగా బ్రహ్మచర్యము యొక్క నిష్ఠయె కలుగునట్టి వ్యవస్థ ఏర్పాటు చేయబడుగాక.

అధ్యయనము ముగిసినపిదప గృహస్థాశ్రమము వచ్చుచున్నది. దానిలో భార్యాభర్తలు పరస్పర నిష్ఠతోను సంతాన కారణముతోను కలిసికొనియుండు సంగతి కలుగుచున్నది. నేటి ప్రపంచములో ఈసంగతి నడచుటలేదుకాని లోకులకీ సంగతి నచ్చినచో నడచును. ఈవిధముగా గృహస్థాశ్రమమునకు ఆధారముకూడా బ్రహ్మచర్యమే అగుచున్నది. సంతాన వాంఛతోపాటు సంతానసేవనుగూర్చిన విషయము వచ్చుచున్నది. మఱియు దానితోపాటు సంతానపూజ అన్నిటి ధర్మమగుచున్నది. పిదప అతిథి సేవకూడ వచ్చుచున్నది. ఈ సాధనములన్నియు బ్రహ్మచర్యమునకు ఆవశ్యకములె యగుచున్నవి. ఈ విధముగా బ్రహ్మచర్యాశ్రమమును, పిదప కొంతకాలము గృహస్థాశ్రమమును దానిలోగూడ బ్రహ్మచర్యము కొఱకు అవకాశములును, దానిపిదప వానప్రస్థము. ఇట్టి ప్రణాళిక ఏర్పఱచబడినది. కాని నేడు అట్టి ప్రణాళిక లేకపోవుట యెంతయు శోచనీయము.

హిందూ దేశములో ధర్మమును గుఱించిన యీముఖ్య ప్రణాళిక నేడు లేదు. ఇప్పుడైతే కేవలము కొంచెము భక్తి

మార్గముమాత్రమె యున్నది. అది యన్ని మతములలోను ఏర్పడుచున్నది. అది మంచిదే. దాని యాధారము మీదనే నేడు ముందుకు పోదము. కాని భక్తిమార్గము కనీసమైన కార్యక్రమము. ఆధ్యాత్మిక జీవితమునకు అది ఆధారము. ఆ పునాది మీదనే సమస్తమైన గృహమును నిలబెట్టవలసి యున్నది. నేడు హిందూమత సౌధము పడిపోయినది. హిందూమతమును తిరిగి స్థాపింపవలసి యున్నది. దానిలో బ్రహ్మచర్యము అనునది యొకగొప్ప భావన.

## ఇస్లాముయొక్క యాదర్శము

ఇస్లాముమతము "గృహస్థాశ్రమమె పూర్ణాదర్శ"మను భావమును పొందియున్నది. బ్రహ్మచర్యాశ్రమము మొదలైన మిగిలిన యాదర్శము లన్నియు అప్రధానమైనవి. "భగవానుడైన ఏసుక్రీస్తు ఆదరణీయుడు, బ్రహ్మచారియును కాని వారి జీవనము పూర్ణజీవన"మని వారొప్పుకొనరు. మహమ్మదువారి జీవితమె వారికి పూర్ణాదర్శము. వారు గృహస్థు. అట్లే బ్రహ్మచారిని విశేషజ్ఞుడుగా(ఎక్స్పర్టు) తలచిరి. విశేషజ్ఞుడు ఏకాంగిగా (తన పక్షము మాత్రము చూచుకొనువాడు) నుండును. కాని సమాజమునకు వాని యవసరముండును. ఈ విధముగానే మొదటినుండి చివరివఱకు బ్రహ్మచారి జీవనము గడపినవాని జీవితము ఆదర్శపూర్ణముగాదు. పురుషోత్తముడు పూర్ణమైన ఆదర్శము. అయితే అతడు గృహస్థుడే. స్త్రీ పురుషు లిద్దఱకు గృహస్థాశ్రమమే యాదర్శమైనది. ఈ దృష్టితో ముసల్మానుల చింతనము నడచుచున్నది.

## వైదికాదర్శము

వైదికధర్మములో ఇంకొక విషయ మున్నది. ఇందు బ్రహ్మచారియే ఆదర్శముగా అంగీకరింపబడెను. మధ్యగా వచ్చిన గృహస్థాశ్రమము వాసనలను ఒక హద్దులో ఉంచుకొనుటకే. ఈవిధముగా నిగ్రహములో ఒక ప్రణాళిక తయారు చేయబడినది. దానివలన మనుష్యుడు త్వరత్వరగా పై మెట్టును ఎక్కగలడు. కాని దానిలో సర్వోత్తమైన యాదర్శము బ్రహ్మచారిదే.

## స్త్రీ పురుషులతో భేదము

మధ్యగా స్త్రీ పురుషులలో భేదము అంగీకరింపబడెను. దానివలన హిందూమతమునకు దుస్థితి కలిగినది. బ్రహ్మచర్యాధికారము పురుషునికే కాని స్త్రీకి లేదు. కనుక స్త్రీ గృహస్థాశ్రమములోనే యుండవలయునని తలపబడెను. ఆమె కనుక గృహస్థాశ్రమమును స్వీకరింపక పోయినచో అధర్మమైపోవును. ఇట్టి యధర్మారోపణను సహించుచునే కొందఱు స్త్రీలు సంఘమున కెదురుగా నిలబడి బ్రహ్మచారిణులయిరి. దీనికి మీరాబాయి, మహారాష్ట్రములోని ముక్తాబాయియు ఉదాహరణము. కాని సమాజము వారిపై అధర్మారోపణము చేయక మానలేదు. వారు తమకు బ్రహ్మచర్యమె కావలయునని పట్టుదల చూపినను వారికి బ్రహ్మచర్యప్రహక్కు ఉన్నదని సంఘము ఒప్పుకొనలేదు.

## దోషపరిశీలనము అవసరము

ఈ విధముగా మధ్యకాలములో ఒక పెద్ద దోషము బయలుదేఱినది. ఇప్పుడీకాలములో దానిని పరిశీలించుట అవసరము. వారికి బ్రహ్మచర్యపు హక్కు ఇచ్చినను దానిని పరిపాలించువారు తక్కువేయుందురు. కాని తక్కువమంది యుండనిండు ఎక్కువమంది యుండనిండు, స్త్రీలకు బ్రహ్మచర్యాధికారము లేకపోవుటయన్నది తప్పే. దానివలన ఆధ్యాత్మికమైన అనర్థత కలుగుచున్నది. ఏదైన వ్యావహారికమైన యనర్థత ఉన్నచో దానిని సంస్కరించుకొనవచ్చును. కాని ఆధ్యాత్మికమైన అనర్థత ఉండుట శోచనీయము. హిందూదేశములో మధ్యకాలమున తేజోహాని కలుగుటకు స్త్రీలకు బ్రహ్మచర్యాధికారము లేకపోవుటయే కారణము.

## స్త్రీల విషయములో పొరపాటు

స్త్రీలకు కామేచ్ఛ యెక్కువ యుండునను విషయము చాల పొరపాటు. స్త్రీలు ప్రసవవేదనను అనుభవించి పిల్లలకై ఎక్కువ కష్టములు పడవలసి వచ్చుచున్నది. ఏ కామమువల్ల ఇంతగా కష్టము లనుభవింపవలసి వచ్చుచున్నదో దానికై వారి మనస్సులో ఇంతకోరిక యుండునను కొనుట సంభవముగా కనిపింపదు. ఒక దినమున గుడిచూచుటకు వెళ్ళితిని. అక్కడ దేవకీదేవి చిత్రమున్నది. ఆమె ప్రసవవేదనలు పడుచున్నట్లు ఆ చిత్రములో చూపబడెను. ఇంత కష్టము కలుగుచున్నపుడు భగవంతుడు జన్మించకనే యుండునుగా అని, ఆ కష్టము చూడగనే నాకు అనిపించి

నది. "నాశరీరము బలహీనమైనది. నేను స్త్రీనైతే ఇట్టి స్థితిలో నాకు పిల్లలు కలిగినచో నేనెట్లు నిలబడగలను" అని ఎన్నోసారులు నాకు తట్టినది. కాని స్త్రీలకు సంతానేచ్ఛ యుండునని యంగీకరింపబడుచున్నది. స్త్రీ సృష్టిలో మాత కావలయునని ప్రేరణయున్నది. కనుక స్త్రీకి తొలిసంతానపు వాంఛ యుండవచ్చును. అసలే సంతానము లేకుండ ఉండెడి యాదర్శము పురుషులకంటె స్త్రీలకు ఎక్కువ కష్టముగా తోచవచ్చును. కాని ఒక సంతానము కలిగిన మీదట స్త్రీకి వాంఛ యుండకపోవచ్చును. ఏలయన: ఆమెకు సంతానము కలుగునపుడు అమితమైన బాధపడవలసి వచ్చుచున్నదిగదా. ఇది నా సొంత వివరణము. ఇది యెంతవఱకు సరియైనదో నేనెఱుగను.

స్త్రీకి కామేచ్ఛ ఎక్కువగా నుండునని స్త్రీల విషయములో ఒక పొరపాటు అభిప్రాయము వ్యాపింపజేయబడెనని దీనిభావము. ఈ పొరపాటు కారణముగా స్త్రీలమీద ఒక యంకుశము ఉంచబడినది. దీనికి ఫలితముగా హిందూదేశములో ఎక్కడైన అత్యాచారములు జరిగినచో స్త్రీలుగూడ పురుషులను రక్షించుచుందురు. పురుషులనుగూర్చి స్త్రీల మనస్సులో అనాదరము ఉండుట దీని యాశయమని కొంచెము గంభీరముగా చూచినచో తెలియును. ఎవరైన ఒక స్త్రీ బీడి కాల్చినచో అది తప్పుగా తలచబడుచున్నది. పురుషుడు కాల్చినచో మాత్రము తప్పుగా తోచదు. స్త్రీలు బీడి, సిగరెట్టు కాల్చుచుండ చూడగా ఆ దృశ్యము భయంక

రముగా నాకు తోచును. కాని నాకెందుకిట్లు తోచవలెను ? స్త్రీ పురుషులు సమానమేగదా.

## స్త్రీ యొక్క యనర్హత పోవలయును

హిందూ దేశములో స్త్రీల విషయమున ఆధ్యాత్మికోన్నతియొక్క భావనయున్నది. స్త్రీల మనస్సులో గూడ అదే భావన యున్నది. కనుక ఎవడైన నొకడు వ్యభిచారి యని తెలినచో వానిని స్త్రీలు క్షమింతురు. "అరే వాడు పురుషుడేగదా." అని వారందురు. దీనిని స్త్రీల (సుపీరియారిటీ కాంప్లెక్సు) అహమ్మన్యత (తామె గొప్పవారమను భావము) అని చెప్పవచ్చును. కాని స్త్రీల విషయములో గల ఈ తప్పు గౌరవమును తొలగింప వలయును. దానిని తొలగించిన కాని సంఘోద్ధరణము కాదు. 'శంకరాచార్యుని వంటి ఒక స్త్రీ బయలుదేఱి ప్రాత శాస్త్రములలోని తప్పులు చూపి శాస్త్రములను చింపి పాఱవేయనంతవఱకు స్త్రీల యుద్ధరణ కాజాల'దని నేను చాలసార్లు చెప్పియున్నాను. మిగుల తేజస్వినియై వైరాగ్య స్వభావము, జ్ఞాననిష్ఠ కలిగిన స్త్రీ మాత్రమె శాస్త్రములలోని తప్పులనుజూపు పని చేయు గలదు. అప్పుడే వారిలోని అనర్హత పోవును. అప్పుడే స్త్రీలకు బ్రహ్మచర్యమును పరిపాలించు వాస్తవికమైన హక్కు ప్రాప్తించును. కాని నేడొక బ్రహ్మచారిణియయిన స్త్రీకి సమాజములో నింద గలుగుచున్నది.

## అమృతముపేర విషము

విషయ వాంఛలకు ప్రేరణ కలిగించు శృంగార సాహిత్యమువలన మనుష్యుడు ఎంతగా పతనము చెందునో అంతకంటెగూడ వాసనలనుండి తప్పించుకొనుటకై వ్రాయ బడిన సాహిత్యమును జదువుట వలన - ఇంకను ఎక్కువగా పతనము చెందగలడు. ఇంత పాడు సాహిత్యము అది.

## తల్లి యెదుట సురక్షితముగా నుండుట

బ్రహ్మచారి యెదుటకు ఎవరైన ఒక స్త్రీ వచ్చినచో అక్కడ తన్ను ఆమె యొక్క పవిత్రురాలుగాను సురక్షితు రాలుగాను ఉన్నట్లు భావింపవలసియున్నది. ఎప్పుడైన ఒక స్త్రీ నాయెదుట వచ్చినచో నా తల్లి వచ్చినట్లు తోచును. ఇందువలన నేను సురక్షితునిగానున్నట్లు తోచును. ఏలయన, తల్లి మన దగ్గర ఉన్నచో మనము తప్పు చేయము. ఇదే విధ ముగా బ్రహ్మచారి స్త్రీల సమీపమున ఉన్నపుడు తాను సురక్షితుడుగా ఉన్నట్లు అనుభవము పొందవలయును. ఇందు వలన బ్రహ్మచారి స్త్రీ సంపర్కమునకు దూరముగా నుండ వలెనను భావము తప్పు. అందువలన పనికిమాలిన కృత్రిమ మర్యాదలు మనమీద పడవేయ బడుచున్నవి.

ముసల్మానుల పర్దా విషయము తీసికొనుడు. దాని లోను ఇదే విషయము గలదు. హిందువులలో స్త్రీ అపాత్రు రాలుగా తలచబడెను. ఇదంతయు తప్పు. అవును, జైను లలో స్త్రీ పురుషులు ఇద్దఱు సమానులని యొప్పుకొనబడెను. క్రైస్తవులలోని కేథలిక్కులు స్త్రీ పురుషులను సమానులుగా

తలతురు. కాని ప్రొటెస్టెంటుల యాశయము ఇంచుమించు ముసల్మానుల యాశయము వంటిదే. "బ్రహ్మచర్యము అశక్యము, గృహస్థాశ్రమమె ఆదర్శము"అని వారు మన్నింతురు. కాని కేథలిక్కులలో సోదరీమణులు సోదరులు ఇద్దఱును బ్రహ్మచారులుగానె యుందురు. ఇందువలన "స్త్రీని ఏదృష్టితో చూడవలయును?" అను సామాజిక విషయమును సాధనలో చూడవలయును.

## బ్రహ్మచారి దృష్టి

"బ్రహ్మచారి అసలు స్త్రీని చూడనేరాదు" అన్న విషయము బ్రహ్మచారి దృష్టిగా ఉండరాదు. నాకు రామాయణములోని యొక కథ జ్ఞాపకము వచ్చుచున్నది. శ్రీరామచంద్రుడు లక్ష్మణునికి సీత నగలనుజూపి "నీవు వీనిని గుర్తుపట్టుచున్నావా?" అని యడిగెను. రావణుడు సీతను దొంగిలించుకొని లంకకు పోవు సమయములో దారిలో సీత తన నగలను ఒక్కొక్కటి చొప్పున తా నేమార్గముగుండ తీసికొని పోబడుచున్నదో తెలియుటకై విసరివైచెను.

లక్ష్మణు డిట్లు జవాబిచ్చెను :

"నాహం జానామి కేయూరే। నాహంజానామి కుండలే
నూపురేత్వభిజానామి, నిత్యం పాదాభివందనాత్"

శరీరమున పైభాగముననుండు భుజపురులు కుండలములను ఎఱుగను. కాని కాళ్ళ అందెలను ఎఱుగుదును. ఏలయన ప్రతిరోజు సీతాదేవికి నమస్కరించు సమయములో నేను వాటిని చూచియుంటిని" అని.

## లక్ష్మణుడు చరణాకృతిని పూజించు పూజారి

ఒకసారి సబర్మతి ఆశ్రమములో ఈశ్లోకముపైని చర్చ సాగెను. బాపుజీ క్రాంతికారుడుగదా ! "ఈ లక్ష్మణుని వాక్యము నాకు నచ్చుటలేదు" అని బాపుజీ అనిరి. పిదప "దీని పైని నీయభిప్రాయమేమి ? నీవు శాస్త్రములను బాగుగ ఎఱిగినవాడవుగదా" అని నన్నడిగిరి. అప్పుడు నేనిట్లంటిని. "మీరేదృష్టితో దీనినిజూచి యిష్టపడలేదు. ఆ దృష్టితో చూచినచో నాకును అది నచ్చుబాటుకానిదే. ఏలయన, లక్ష్మణుడు బ్రహ్మచారిగదా, అతడు సీత ముఖమును చూడ నేలేదు. అని చెప్పవలసి వచ్చుచున్నది." "బ్రహ్మచారి స్త్రీ ముఖమును చూడరా"దని నియమమున్నచో అది తప్పు. నే నీ మాటలకు ఇంకొక యర్థమును జూచితిని. ఇందులో "లక్ష్మణుడు సీత ముఖమువైపు చూడలేదు" అని మాత్రమెకాదు – దీనిలో రాముడు. లక్ష్మణుని అడుగు చున్నాడనగా రాముడుకూడ ఆ నగలను గుర్తించుట లేదన్నమాట. పతియె తన పత్ని యొక్క నగలను గుర్తింపలేదని భావము.

దీని భావమేమనగా సీతయు రాముడును అనాసక్తు లన్నమాట. ఇద్దఱును ఒకరు ఒకరి యాకృతి చూచుకొనుట లేదు. ఒకరి నొకరు బ్రహ్మరూపముగా చూచుకొనుచుండిరి. కాని లక్ష్మణుడు సీత పాదాబ్జములను పూజించుచున్నాడు. పాదాభివందనము చేయుచున్నాడు. కనుక అతడు ఉపాసనా రూపముగా చరణాకృతిని చూచు చున్నాడుగాన ఆ యుపాస నలో కాళ్ళనగలుగూడ వచ్చుచున్నవి. అతడు నగలతో

నున్న చరణాకృతిని ఒక దేవతామూర్తిగా భావించి యుపాసించుచున్నాడు...” అని. నేనాయర్థమును చెప్పినపుడు “నీవు అయితే శాస్త్రవచనములను బాగుగా సమర్థింప నెఱుగుదువే.” అని బాపు అనిరి. మరల వారు ఇట్లు అనిరి. “ఇదే సరియైనది. వీలున్నంతవఱకు ఇట్లే చేయవలెను. శాస్త్రవచనములకు మంచి యర్థమునే చెప్పవలయును” అని. కనుక “ఎదుటికి స్త్రీ వచ్చినది. ఆమెను చూడరాదు” అని బ్రహ్మచారి మనస్సులోనికి ఈ భావనయే కనుక వచ్చినచో అది వాని లోటుగానె భావింపబడును.

## అతి పరిచయము ఉండరాదు

పురుషునికి పురుషునికి మధ్యకూడ ఎక్కువగా శారీరక పరిచయము ఉండుట మంచిది కాదు. మానసిక పరిచయమె యుండవలెను. శారీరక పరిచయము కూడ కేవలము సేవకై ఎంతయుండుట యవసరమో అంతేమాత్రమె యుండవలెను. ఒక పురుషుడు ఇంకొక మిత్రుని మెడలో అనవసరముగా చేయి వేయుచుండుట మనము చూచుచున్నాము. ఇది నాకు నచ్చదు.

## ఇది వాత్సల్యముకాదు, భోగము

ఒకసారి ఒకడు నా మిత్రుని కథను వినిపించెను. నా మిత్రుడు ఒక అందమైన ఆవుదూడను చూచెను. వాడు ఉండలేక ప్రేమతో ఆ దూడను ఎత్తుకొనెనట. అతడు నా మిత్రుని యీ వాత్సల్యమును వర్ణించుట కొరకు చెప్పెను. కాని ఇందులో వాత్సల్యమేమున్నది? అందమైన దూడను

చూచెను. ఎత్తుకొనెను. అది మురికిగా నున్నచో వాత్సల్యము ఉండుట యవసరము. వాడు ఏ మఃటికి దూడనో చూచి దానిని చూచిచూడగనె ఎత్తుకొని ప్రేమతో శుభ్రపఱచినచో అపుడు మేము అతని ప్రేమను అర్థము చేసికొనగలము. కాని మీరు ఏ యందమైన వస్తువునైన చూచిన వెంటనే ఎత్తుకొన్నచో దానిపై మీరు మోహపడుచున్నారు. దానిలో సేవలేదు. ఎవడైన ఒక బాలుడు భయపడుచున్నచో వానిని ఎత్తుకొనవలెను. వానికి ధైర్యము చెప్పవలయును అని యొప్పుకొందును. కాని ఆ అందమైన యావు దూడను అనవసరముగా ఎత్తుకొన్నాడు. దానిలో ఏ భావమున్నది? మన యీ మిత్రుని మనస్సులో వాత్సల్యమున్నది. ప్రేమ యున్నమాట సరియె. కాని ఆ ప్రేమ తక్కువ రకపుది. కనుక సేవకొఱకే శరీరముతో సంబంధము పెట్టుకొనవలెను. శరీర పరిచయములోని మామూలు మర్యాద కేవలము స్త్రీ పురుషుల మధ్యనే కాకుండ పురుషునికి పురుషునికి మధ్యను, స్త్రీకి స్త్రీకి మధ్యను గూడ అవి యుండవలెను. స్త్రీ పురుషులలో భేదము చూపు పద్ధతియే తప్పు.

## లింగభేదము అనవసరము

స్త్రీ పురుషులనుగురించి ఏ లోకులలో ఎక్కువ ముక్తత్వము ఉన్నదో అక్కడే ఎక్కువ పవిత్రత యున్నట్లు మేము చూచితిమి. మలబారులో భాషలోగూడ లింగభేదము లేదు. హిందీలో "మై జాతాహూఁ, మై జాతీహూఁ" అని యిట్లు ప్రతి వాక్యములోను భేదము వచ్చుచున్నది. (తెలు

గులో నేను వెళ్లుచున్నాను. వెళ్ళుచుంటిని, వెళ్ళితిని మొద లగు కొన్నిటిలో లింగభేదము లేదు.) బెంగాలీలో కూడ లింగభేదము లేదు. ఇది చాల మంచి సంగతి. లింగభేదము లేకపోవుటవలన బెంగాలీ పుస్తకములను హిందీలోనికి అను వాదము చేయుటలోగూడ కష్టమగుచున్నది. ఏలయన-ఇందు (బెంగాలీలో) స్త్రీ పురుషుల ప్రేమలోని పవిత్రత అనువాదము లోనికి రాజాలదు. వాస్తవమునకు దాని కనువాదమే చేయ బడజాలదు. ఏలయన-ఇక్కడ నున్న భౌతికము గాని ప్రేమ అనువాదములోనికి తీసుకొని రాలేము. కాని బెంగాలీలో సంస్కృతము ననుకరించి విశేషణములలో లింగభేదము తీసి కొని రాబడెను. ఈ తప్పుపని మాత్రము చేయబడెను. క్రియా పదములలో లింగభేదము లేదు. ఇది మంచిసంగతి. వాస్తవమునకు ఈ భేదములకేమియు అవసరము లేదు. సంస్కృతములో క్రియాపదములందుగూడ ఈ భేదము లేదు. మఱి యింగ్లీషులో He (అతడు=పురుషుడు) అని, She (ఆమె=స్త్రీ) అని యున్నది. అదికూడ బెంగాలీలో లేదు. ఇది మంచిది. దీనివలన వాతావరణము పవిత్రమగును.

### హద్దు స్త్రీ పురుషులకేకాదు అందరకును

స్త్రీ పురుషుల భేదమును మనము ఆకారమువల్లనే గుర్తించుచున్నాము. లోపలి ఆత్మమాత్రము ఒకటే. ఇద్దఱి మధ్య కొన్ని హద్దు లుండవలయునని మనుష్యులు అంగీక రించిరి. కాని యిది సర్వోత్తమమైన సంగతి కాదు. జరుగ వలసినచో ఇద్దఱు తెరచిన హృదయములతో ఒకరి నొదుటి

కొఱకు వచ్చుటయే జరుగవలసిన పని. అట్లే శరీర సంప
ర్కము విషయములో సర్వమాన్యమైన హద్దు వుండవలెను.
పురుషునికి పురుషునికి మధ్యగూడ ఎక్కువ సంపర్కము
ఉండరాదు. యోగశాస్త్రములో ఇది శౌచము అనబడెను.
యోగశాస్త్రములో 1. యమము, అహింస, సత్యము మొద
లైనవియు, 2. శౌచము - స్వచ్ఛతను గురించిన భావన
అను రెండు విషయములు చెప్పబడెను. తన శరీరమును
గూర్చి ఏవగింపు కలుగవలెనని దాని యభిప్రాయము.
స్వశరీర జుగుప్స ఇటువంటి శరీరమును తీసికొని మనము ఇత
రుల దగ్గఱ కెట్లు వెళ్ళవలెను? అను తలపు గలుగును. ఇటు
వంటి యమంగళమైన శరీరముతో మనము ఇతరుల సంపర్క
ములోనికి ఎక్కువగా రాము. ఇట్లు తన శరీరమును గూర్చి
కలిగెడి అమంగళ భావనవల్ల అనవసరమైన సంపర్కము
కలుగకుండ ఇదియొక రక్షణగా అవును. కనుక స్త్రీ పురుషుల
మధ్య హద్దులను అంగీకరించుట కవసరము లేదని మేము
మాత్రము ఒప్పుకొనుచున్నాము. ఏ హద్దును మనము
మన్నింపవలెనో అది అందఱకు సమానముగా ఉండ
వలయును.

## స్త్రీని దేవినిగా మన్నించుట తప్పు

సంఘముతో సంబంధము కలిగిన యింకొక మూడవ
విషయమును చెప్పుదును. నేడు సమాజములో సంస్కారము
గల జనులలో మఱి యెక్కువగా కృత్రిమత్వము వచ్చినది.
ఇందువలన స్త్రీలయందు ఎక్కువ ఆదరము చూపుట

దాక్షిణ్యాభావమన్నది నడచుచున్నది. స్త్రీ దేవి యనబడు చున్నది. ఈ విధముగ ఒక వైపునుండి స్త్రీల విషయములో ఘృణయు, తిరస్కారమును, అపాత్రతయు ఇంకొక వైపు నుండి ఎక్కువ యాదరభావనయు చూపబడుచున్నది. పురుషుడు తన్ను స్త్రీకి దాసునిగా తలచుచున్నాడు. మధ్యకాలములో యూరోపు దేశపు సేనాపతులలో (షివల్‌రీ) నడచిన వీరపూజ దీనినుండియె బయలుదేఱినవి. దానికి ఫలితముగా నేటి సమాజములో (ఎటికెట్) శిష్టాచారమునకు సంబంధించిన నియమములు తయారైనవి. కాని దీనివలన విషయ వాంఛ పెరుగుచున్నదని మన మొప్పుకొనుచున్నాము. స్త్రీలను కొన్ని విషయములలో అపాత్రలనుగా దలచుట యెంత తప్పో వారిని యెక్కువ యాదర పాత్రలనుగా దలచుటయు అంత తప్పే. ఏదైన చేయవలసినచో "ఆత్మ విషయములో స్త్రీ పురుష భేదము లేదు. ఉన్నదన్నచో అది శారీరక మైనది" అను విషయము – అని తోచునట్లు చేయవలసి యున్నది. ఇట్టి భావన కలిగిన పిమ్మట వాసనలనుండి మరలుట సులువగును.

## సేవకుల కర్తవ్యము

సేవకులకు అయిదు యమములు చెప్పబడినవి. అహింస, అపరిగ్రహము, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము. ఇవి యమము లనబడును. ఈ యహింసాది వ్రతములను పరిపాలించుటకు మనము సంఘములో ఎట్టి జీవితమును గడపవలయునో పరిశీలింపవలసియున్నది. ఎవరికైతే ఈ వ్రతముల

శక్తిని గుఱించి జ్ఞానమున్నదో వారు "మనుష్యులలో నున్న వీర్యశక్తి సంతానమునకొఱకే" అని బ్రహ్మచర్యమును గురించి యిట్టి యుద్దేశము కలిగియుందురు అని నా మతము.ఇందువలన మనుష్యుల వాసనలు (వాంఛలు) ఎంతగా పెరిగిన అంతక్రిందికి వాసు పడిపోవుదురు. విగ్రహములను చెక్కువారిలోను నిర్మాణ కార్యక్రమము చేయువారిలోను సంతాన నిర్మాణమును గుఱించి వాంఛ తక్కువగా నుండునని తఱచు చెప్పుచుందురు. కనుక నిర్మాణ కార్యమొక పవిత్రకార్యము. ఆ నిర్మాణము ఉత్తమవస్తు నిర్మాణముగా నుండవలయును. ఇట్లు చేయువాడు నీచవస్తువులను పరిత్యజించివైచును. బుద్ధియందలి ప్రతిభ జ్యోతితో సమానముగా నుండును. కాని ఆజ్యోతి దేని యాధారముతో వెలుగుచున్నదో ఆ నూనెయె బ్రహ్మచర్యము. బ్రహ్మచర్యమువలన బుద్ధియొక్క ప్రతిభ మిక్కిలి తేజస్సుగలదగును. కనుక బుద్ధితో పనిచేయువారును ఉన్నతమైన భావన చేయువారును వీర్యశక్తిని సామాన్యమైన సంతాన నిర్మాణపు పనిలో ఉపయోగించుట తగదు.

ఉత్తమమైన నిర్మాణ కార్యము చేయుమనుగాక

బుద్ధుడు, శంకరాచార్యుడు, ఏసుక్రీస్తు వీరందఱు బ్రహ్మచారులె. వారికి వారి ఉన్నతబుద్ధికై చాల యున్నతమైన కార్యములు లభించెను. వారికి ఉత్తమమైన తరగతికి చెందిన నిర్మాణ కార్యమువలన సంతృప్తి కలిగెను. కాన నిర్మాణములో సర్వసాధారణమైనదిగా అంగీకరింపబడిన ప్రక్రియనుండి వారు తమంత తామె తప్పించుకొనిరి. కనుక

సేవకులముందు ఏదయిన ఉత్తమ నిర్మాణకార్యము ఉండ వలెను. సమాజమును మార్చవలెనని, క్రాంతికరమైన పని చేయవలెనని తలచువారికి సులువుగా బ్రహ్మచర్యము నచ్చ బాటు కావలయును. మనముందు ఇట్టి క్రాంతికరమైన పనియేమున్నది ? "మనము క్రొత్త మనుష్యులను తయారు చేయవలసి యున్నది. సంఘమంతయు మారవలయును. ఉత్తమ సాహిత్యమును నిర్మింపవలెను. వ్యక్తిలోను సమాజ ములోను వేలువేలు గుణములను ప్రకాశింప జేయవలెను." ఇంత మహాకార్యము చేయదలచిన వానికి స్థూలమైన నిర్మాణ కార్యములో రుచియుండదు.

మేటియా, మెదినీపురము
(బెంగాలు) ౨౦-౧-౫౫.

# ౫. గృహస్థాశ్రమము

గృహస్థాశ్రమముకూడ బ్రహ్మచర్యమును సాధించునదే

మనము సరియైనరీతిగా పరిశీలించినచో గృహస్థాశ్ర మముకూడ బ్రహ్మచర్యముకొఱకే. శాస్త్రకారులు చెప్పిన దాని ననుసరించి ప్రవర్తించనచో గృహస్థాశ్రమముకూడ బ్రహ్మచర్య సాధనకే ఒక విఘ్నముగా వానికి వచ్చును. జీవనము చాల విచిత్రమైనది. చేరినవారికి అదియొక తిన్ననిగీత. చేరని వారికి మాత్రము అదియొక వంకరగీత. వారు ఆ వంకర మార్గముగుండ వెళ్ళవలసి యుండును.

యువకులు, యువతులు ముఖ్యముగా బాలికలు బ్రహ్మ విద్యను దర్శించుటకై ముందుకు రావలెనని నాకోరిక. బ్రహ్మ విద్యలో స్త్రీ పురుష భేదము లేనే లేదు. ఆ విద్య స్త్రీ పురుష భేదమును నశింపజేయును. అయినను ఇప్పుడును నేనీ పనికై సోదరీమణులవైపు ఆశపెట్టుకొని కూర్చునియున్నాను. ఇంతకు పూర్వము సోదరులకై ప్రయత్నించి యుంటిని కనుక ఇప్పుడే మన సమాజోద్ధరణకై తమ జీవనమును బ్రహ్మమయముగా జేయు మహిళల యవసరమున్నది. ఈ పని మన ఈ యుగమున కవసరముగా నాకు తోచుచున్నది.

ఇటు ఒకవైపు ఈ విధముగా చెప్పుచున్నాను. అటు ఇంకొకవైపు వివాహమునకు ఆశీర్వాదము నిచ్చుచున్నాను. ఇది మీకు విచిత్రముగా తోచును. కాని నిజముగా ఇది విచిత్రము కానే కాదు. అనేక జన్మలనుండి మనము ప్రవాసులముగా నున్నాము. మన వికాసము జరుగుచున్నది. మనమందఱము ఒకే మార్గముగుండ నడచుచున్నాము. సర్వోదయము, భూదానము, గ్రామదానముల మార్గమునైతే స్వీకరించియే యున్నాము. కాని వానితోపాటు మనము ఆత్మను దర్శించు మార్గమునుకూడ స్వీకరించితిమి. దానిలో ఒక యడుగు ముందుకు వేయగా ఇంకొక యడుగు వెనుకకు పడుచున్నది. దారిలో పోవుచున్నపుడు ఇట్లు తోచుచున్నది. అందఱముకూడ కూడకలిసి పోవుచున్నాము. అయినను అక్కడక్కడ ఒకటో అరో అడుగు ముందు వెనుకల ఉండుచునే యున్నాము. ముందు వెనుకలు ఉన్నప్పటికిని అందఱు కలిసి యేయున్నాము.

ఒక ప్రశ్న!

నిన్న ఒక తెలివైన సోదరి ఒక చక్కని విలక్షణమైన ప్రశ్న యడిగినది. "కృష్ణుని సహవాసములోనున్న గోపిక లందఱు ముక్తినిపొందిరని భాగవతములో వినుచున్నము. అయితే మఱి గాంధిజీయొక్కయు మీ యొక్కయు సహవాసములో ఉన్న బాలికలకు సాంసారిక వాసన ఎందుకు కలుగుచున్నది?"

బాపుజీ మహాత్ముడు. నేను సామాన్యమైన సాధకుడను. అంతకంటె గొప్పగా కావలెనని నేను కోరను. కాని బాపూజీకి బ్రహ్మచర్యానుభవము వారి అనుభవము ప్రకారముగాను, నాకు నా యనుభవము ప్రకారముగాను అయినది. ఇది సరే. మా యిద్దఱకు బ్రహ్మచర్య విషయములో చాల యాదరమున్నది. వారును సత్యమునకు ప్రధాన స్థానమును ఇచ్చుచుండిరి. నేనును ఆ గుణమునకు ప్రధాన స్థానమును ఇచ్చుచున్నాను. మన జీవితములో సత్యనిష్ఠ యొక్క యంశము అవతరించి యుండునని మనము తెలియు చున్నామో దాని ప్రభావము మన దగ్గర ఉన్నవారిపై పడియుండవచ్చునని యంగీకరించుచున్నాను. కాని భగవంతుడైన శ్రీకృష్ణుడెక్కడ? మన మెక్కడ?

'కృష్ణస్తు భగవాన్ స్వయం' కృష్ణుడు స్వయముగా భగవంతుడే అని భాగవతములో గానము చేయబడినది. కాన పరమేశ్వరునితో ఎవరిని పోల్చుట యుచితము గాదు. ఇట్టి పోలికలు లోకులు తమ మనస్సులలో చేయుదురు కాని నేనట్లు

చేయను. బాపూజీని ఏసుక్రీస్తుతో పోల్చిరి. కాని నేను దానికి ఇష్టపడను. ఏసుక్రీస్తు తన పద్ధతిలో అద్వితీయుడె. కోట్ల కొలది భక్తులు వారి పేరువల్ల తరించిరి. ఇట్టి స్థానము భారత దేశములో శ్రీకృష్ణ భగవానున కున్నది. ఇక్కడ శ్రీరాముని పేరుకూడ మ్రోగుచున్నది. ఈ రోజులలో గౌతమ బుద్ధుని పేరుకూడ మ్రోగ మొదలుపెట్టినది. ఈమూడు పేరులు పరమేశ్వరునివే. సత్యము, ప్రేమ, కరుణల రూపములో వారిని మనము ప్రతి దినము స్మరించుచున్నాము. కనుక ఈ ముగ్గురిలోను ఒకరితో నొకరికి పోలిక లేదు. మనము ముగ్గురిని భగవద్రూపములో చూచితిమి. కృష్ణుడు పరమేశ్వరునితో ఏకరూపమై పోయెను. కృష్ణుని పేరువల్ల హిందూదేశములో లెక్కలేని జనులు ఉద్ధరింపబడిరి. నేనును ఉద్ధరింపబడగలను. శంకరుడు, రామానుజుడు, మధ్వాచార్యుడు, వల్లభాచార్యుడు, చైతన్యుడు, జ్ఞానదేవుడు, తుకారాము, నరసీమెహతా, మీరాబాయి ఇంక ఎన్ని పేర్లు చెప్పను? వీరందఱు శ్రీకృష్ణ నామములో లీనమైపోయిరి. కనుక పరమేశ్వరుని రూపముగా భావించిన వారితో ఏ మనుష్యుని గూడ పోల్చుట శోభాకరము గాదు.

ఈ విషయములో ఇస్లాము మతములోని భావములు చాల మంచివి. హిందువులలోను క్రైస్తవులలోను మహాపురుషుల పేర్లు భగవంతుని పేరుతో కలుపబడుచున్నవి. దానిలోను రుచియున్నది. 'యత్రయోగేశ్వరఃకృష్ణఃయత్రపార్థోధనుర్ధరః' 'యోగియగు కృష్ణు డెందుండు నెందుండు ధన్విపార్థుడు' అని గీతలో చెప్పబడెను. ధనుస్సును ధరించిన పార్థుని యవసర

మేమున్నదిశ్రీకృష్ణుడొక్కడే చాలును. అయినను శ్రీకృష్ణునితో పాటు అర్జునుని పేరును జోడింపబడెను. భక్తునికి ప్రాధాన్య మీయబడినది. "భక్తుడు, భగవంతుడు ఇద్దఱును ఉన్నచోట విజయము కలుగును" అని చెప్పబడినది. కాని "అల్లాతో పాటు ఎవరిపేరును జోడింపరాదు. అల్లాను తప్ప ఇంకెవరిని పూజింపరాదు" అని ఇస్లాములో స్పష్టముగా చెప్పబడినది. "లా ఇలాహ ఇతఇల్‌లాహ ముహమ్మద్ యూరసూల్ ఉల్లాహ్" మహమ్మదు కేవలము ప్రవక్త మాత్రమె. అతడు భగవంతుని సందేశమిచ్చు సేవకుడు. అతడు అలా స్థానమును తీసికొనలేడు.

హటుండి
౨౯-౨-౪౯

## వివాహ ప్రశ్న

వివాహ విషయములో తల్లిదండ్రులు సలహా ఇవ్వవచ్చును. సాయపడవచ్చును. కాని నిశ్చయము మాత్రము బాలికదే కావలయును. తల్లిదండ్రులసలహాసహజముగాపిల్లకు నచ్చినచో సమస్య లేనేలేదు. కాని పిల్లకు నచ్చకపోయినచో తల్లిదండ్రులు దుఃఖపడరాదు. ఎట్లయినను వారికి దుఃఖము కలిగినచో దానిలో పిల్లదగ్గర ఏదో దోషమున్నదని యొప్పుకొనుటకు నేను సిద్ధముగా లేను. తల్లిదండ్రుల సంతోషముకొఱకు హృదయ మొప్పుకొనకపోయినను దానిని ఒప్పుకొనరాదు. హృదయమునకు నచ్చనిదానిని అంగీకరించుట, యనగా – తన హృదయమును మోసగించుటయె.

మఱి హృదయమును మోసగించుట అధర్మము. దానివల్ల చివరకు తల్లిదండ్రులను మోసగించుటవంటి ఫలమే లభించును.

ఒకరిపై నీకు అనురాగ మున్నదనుకో. కాని అతడు నిన్ను కోరుటలేదని గట్టిగా తెలిసినప్పుడు వానిని పెండ్లి చేసికొను తలంపు విడిచిపెట్టి తీరవలెను. అందఱిపైన సద్భావన యుంచినట్లే అతనిమీదకూడ సద్భావన యుంచవలెను. కాని ఇట్లు తటస్థ భావమును ఉంచుట యశక్యమై తీవ్రమైన ప్రేమానుభవము కలుగుచున్నచో అప్పటికికూడ అతనివైపునుండి అనుకూలమైన జవాబు రానిచో శరీర సంబంధమైన వివాహ భావనను విడిచిపెట్టి ఆ వ్యక్తిని పరమాత్మకు చిహ్నముగా తలచి అతనిని మానసికముగా వరించి బ్రహ్మచర్య వ్రతముతో ఉండి జీవితమును గడుపవలెను. ఇది యెంతవరకు మీకు సరిపోవునో నాకు తెలియదు. మీరు మీ ఆత్మను పరీక్షించుకొని దాని విషయములో స్వయముగా నిశ్చయించుకొనవలెను. నా సమాధానము స్వయముగా నిర్ణయించుకొనుటలోనే సంపూర్ణమై యున్నది. ప్రతియొకడు తన స్థితిని జూచికొని దాని వినియోగమును తనపైన వేసికొనగలడు.

ఇంకను చాల సూచనలు చేయదలచుచున్నాను. తమ మానసిక స్థితియొక్క వాస్తవిక జ్ఞానము చాలసార్లు మనుష్యులకు కానేకాదు. వస్తువుల యథార్థదర్శనము చాలదగ్గర నుండి చూచినపుడుగాని చాలదూరమునుండి చూచినప్పుడు గాని కాదు. కొంచెము దూరమునుండి దానిని సరిగా దర్శింప

వచ్చును. దగ్గఱఉండి దీర్ఘముగా ఆలోచించి భావించినపుడు కూడ ధ్యానములోనికి రాని విషయము కొంతసేపటికి తనంత తానే ధ్యానములోనికి వచ్చును. కనుక మానసికమైన వ్యాకులత్వమును విడిచి పెట్టుటయే మంచిది.

"తల్లి సహజముగా ప్రాప్తించును. కాని తల్లిని ఏఱుకొనవలసిన పనియుండదు. అదే విధముగా ఈశ్వరుని యోజనలో భర్తకూడ సహజముగానె లభించును" అను శ్రద్ధ యుంచినచో వ్యాకులత్వము తగ్గిపోవును. దీనికి కారణమేమనగా– పరమేశ్వరుడు శారీరక వస్తువు కానేకాదు. అతడు మానసిక వస్తువు. సమస్త ప్రపంచమువైపు పరిపూర్ణ ప్రేమతో చూచుటను నేర్చుకొనుటకే ఈ లగ్నము (వివాహము) మొదలైన ప్రయోగములు.

హృదయమునకు విరుద్ధముగా ఏపనిని చేయకు. ధైర్యముతో పని చేయుము. ఈశ్వరునిపై నమ్మకముంచుము. ఎప్పుడెప్పుడు అడుగవలసి యుండునో సంతోషముతో అడుగుము.

మీతో వ్యక్తిగతమైన పరిచయము నాకు లేదు. దీనికి అవసరముకూడ లేదు. ఏలయన – ఈ శరీరమును మఱచి పోవలయునేగదా.

(ఒక బాలికకు వ్రాసిన జాబునుండి)

మరాఠీ హరిజన్

౨౦-౧౦-౪౬

## యథార్థమైన పతివ్రతా ధర్మము

ప్రశ్న :- మీరు సోదరీమణులు గాజులు, నగలు మొదలైనవి ధరింపరాదని చెప్పితిరి. దీనిలో మీరు పాతివ్రత్యము యొక్క చిహ్నముల పైని దెబ్బతీసితిరి.

వినోబా :- పాతివ్రత్య మనగా నేమిటో మీరు ఆలోచింపుడు. పాతివ్రత్యము ఒక స్త్రీలయందు మాత్రమే యుండ వలసిన వస్తువా యేమి? పురుషులు మాత్రము పత్నీవ్రతులుగా నుండనక్కఱలేదా? మీలో చాల మంది భర్తలగుదురు. మీ పత్నీవ్రతపు చిహ్నము లేవో చూపుడు. నాకేవియు కనుపట్టదు. పత్నీవ్రత మున కేచిహ్నమును అవసరము కానిచో పాతివ్రత్య మునకు ఆ చిహ్నముల యవసరమేల వచ్చినది? ఇందులోని ప్రశ్న పాతివ్రత్యమునకు సంబంధించి నది కాదు. స్త్రీ పురుషునికి దాసియా కాదా? అను నదే యిందుగల ప్రశ్న. స్త్రీని దాసిగా భావించుట తప్పు. దీనిని మేము విరోధింపగోరుచున్నాము. స్త్రీ ఒక స్వతంత్ర వస్తువు. ఒక జీవము. పురుషునిలో జీవాత్మ ఎంత బలముగలదో స్త్రీలోగల జీవా త్మయు అంతే బలముగలది. పత్నికి పరమేశ్వరు నితో భిన్నమైన సంబంధము గలదని తెలిసికొన వలెను. పత్నికి పరమేశ్వరునితో సంబంధము గలుగు టకు మధ్య పతియొక్క ఏజెన్సీ యవసరమని మీరు తలచుచున్నారా? పత్నికి పతియొక్క ఏజెన్సీ అవ సరమైనపుడు పతికి మాత్రము పత్నియొక్క యే

జెన్సీ పరమేశ్వరునితో సంబంధము కలుపుకొనుటకు అవసరముకాదా?

నేడు స్త్రీల ముక్కుకు చెవులకు చిల్లులు వేయబడుచున్నవి. ఆ చిల్లులలో నగలు ధరించబడుచున్నవి. ఇదియంతయు ఈశ్వరునిపై అవిశ్వాసము గలిగియున్న ప్రస్తావమె. ఈశ్వరుని కీ చిల్లులే యిష్టమైనచో చిల్లులువేసి సృజింపలేడా? ఈశ్వరుడు చివరకు ముత్యమునకుకూడ చిల్లి వేయలేదు. కాని మనము సముద్రమునుండి ముత్యములను వెడలదీసి వానిలో చిల్లులు పొడిచి, స్త్రీలకుకూడ చెవులకు ముక్కుకు చిల్లులుపొడిచి వానిలో ముత్యములు పడవేయుచున్నాము. వారి ముక్కు చెవులు మెడ చేతులు కాళ్ళు మొదలగువాని యన్నిటిలోను బంగారము ముత్యము నగలు పెట్టుటకు పూరీ కోలారుగనులలోని బంగారమునంతయు ప్రోగు చేయవలసి యున్నదా? స్త్రీల నెత్తిపైన ఇంతబరువు పాఱవైచి మనమే వారిని భీరువులని యనుచున్నాము. పైగా భీరువులని చెప్పుట వారికి గౌరవముగా తలచుచున్నాము. స్త్రీలు పురుషుల చేతులలో సురక్షితముగా నుండవలయునని మన తలపు. ఇది ధర్మ విమర్శ కాదు. ప్రతియొకనిలోను ఆత్మ యున్నదని ధర్మము చెప్పును. పరమేశ్వరుని వర్ణించుచు "నీవే స్త్రీవి, నీవే పురుషుడవు" అని యుపనిషత్తులలో చెప్పబడినది.

పురుషుడు పురుషులకును స్త్రీ స్త్రీలకును ప్రతినిధియని లోకులు చెప్పుదురు. ప్రకృతి పురుషులు అనగా మాయయు మహేశ్వరుడు అని రెండు తత్వములున్నవి. అందులో

"పురుషుడు పరమేశ్వరుని ప్రతినిధి. స్త్రీ ప్రకృతికి ప్రతినిధి. ప్రకృతి జడము. అనగా స్త్రీ జడమునకు ప్రతినిధి. పురుషుడు చేతనమునకు ప్రతినిధి" అని సాంఖ్యు లనిరి. ఈవిమర్శ అంతయు అన్నివిధముల తప్పు. పురుషునిలో ఎంత యాత్మతత్త్వము తయారుగ నున్నదో అంత యాత్మతత్త్వమె స్త్రీలలోను గలదు. పురుషునిలో ఎంత జడాంశమున్నదో అంత జడాంశమె స్త్రీలోనున్నది. కాని ఇది యొక చాల పెద్ద తప్పు హిందూదేశపు తత్త్వజ్ఞానములో అయినది. పార్వతీ పరమేశ్వరులు అని చెప్పుటలో పరమేశ్వరుడనగా పురుషుడనియు, పార్వతి యనగా స్త్రీ యనియు వారు తలచుచున్నారు. ఈ విధముగా తత్త్వ జ్ఞానములోనే తప్పు ఆలోచన వచ్చినది. పురుషుడు పరమేశ్వరుని ప్రతినిధి యయినచో స్త్రీయును పరమేశ్వరుని ప్రతినిధియె. పార్వతి యంశము పురుషునిలోను స్త్రీలోను గలదు. శరీరమె పార్వతి. ఆ శరీరము స్త్రీ పురుషు లిద్దఱిలోను గలదు. స్త్రీ పురుషు లిద్దఱిలోను జ్ఞానమున్నది. అదే పరమేశ్వరుడు. కాని మన దేశములో ఈ తప్పు కారణముగా స్త్రీ స్థానము తత్త్వజ్ఞానములో అప్రధానమైనదిగా తలచబడెను. మేము దానిపైని దెబ్బతీయ గోరుచున్నాము. దానిలో పాతివ్రత్యముపైని దెబ్బ తగులుచున్నట్లు మీరు భావించినచో మేము ఈ విషయములో వివశులమె.

పతి కనుక చెడ్డగానున్నను మంచిగానున్నను అందులో స్త్రీ లీనమై పోవుటయె ప్రాతివ్రత్యమనగా అని యర్థము అంగీకరింపబడినది. స్త్రీకి ఏ స్వతంత్రమైన యస్తిత్వము

లేదు. కాని పతివ్రత యనగా పతి యొక్క వ్రతములో సాయపడుటయె. పతి కల్లుత్రాగు వాడైనచో వానికి కల్లు త్రాగుటలో సాయము చేయరాదు. పైగా వాని చేయి పట్టుకొని కల్లు పాత్ర విసరివేయవలెను. "నీవు కల్లు త్రాగుట మానకున్నచో నేను నీకు అన్నము పెట్టను" అని వానితో చెప్పవలయును. అందుమీదట ఆతడు "నేను నిన్ను చావ గొట్టుదును" అని యన్నచో "కొట్టు. దానివలన నీ చేతులే నొప్పిపెట్టును. కాని నీకు అన్నము వండను" అని ఆమె యన్నచో ఇది పాతివ్రత్య ధర్మమగును. స్త్రీ పురుషుని తన యధీనములో నుంచుకొనవలెను. స్త్రీలు పురుషులతో పాటు సమానముగా నుండకుందురుగాక! పైగా వారిపైని అంకుశము వేసియుంచవలెను." ఇది స్త్రీ ధర్మమని నేనను కొనుచున్నాను. నేడు స్త్రీల స్థానము చాల యప్రధానము గనే యున్నది. స్త్రీలకు పతుల హక్కులు ఇవ్వవలెనని కొందరు చెప్పుచున్నారు. అది తప్పక యివ్వవలెను. కాని అది చాలదు. స్త్రీకి పరిపూర్ణమైన ఆధ్యాత్మికమైన హక్కు కలుగవలయును. స్త్రీలు వేదాధ్యయనమునకు, బ్రహ్మచర్యమునకు, సంన్యాసమునకును హక్కుదారులు గారని ఆధ్యాత్మికమైన యొక యనర్హత వారిపైని రుద్దబడినది. ఇది సహింపవలసిన విషయముగాదు. కనుక మేము దానిపైని దెబ్బతీయుచున్నాము. మిగిలిన స్త్రీలకు పెట్టు యాభరణము లన్నియు తీసికొనిపోయి కోలారు బంగారు గనులలో పాతి వేయుడు. ఈ బంగారము ప్రపంచమునకు మంచి చేయలేదు. యోగ్యతలో మట్టియు బంగారమును సమానమె అని చెప్పు

దురు. కాని పరిశీలించినచో వాని యోగ్యత సమానము కాదు. మట్టి యోగ్యత బంగారముకంటె చాల గొప్పదని తోచును.

మైసూరు
౧౮-౧౦-౫౭

## పతివ్రతయొక్క అర్థము

స్త్రీలు పతిదేవత ననుసరించి పోవలయునని చెప్పుచున్నారు. 'జ్ఞానేశ్వరి'లో "పతిచియామతా అనుసరోనీ పతివ్రతా" — "పతియొక్క యభిప్రాయము ననుసరించుటలో పతివ్రతయగు స్త్రీకి శుభముగలదు" అని యొక వాక్యము గలదు. నే నిది చదివినప్పుడు 'జ్ఞానేశ్వరుని కిది యేమి యిట్లు తోచినది' అని ఆలోచించుచునే యుండి పోయితిని. కాని పిదప రాజస్థానపు సంశోధింపబడిన జ్ఞానేశ్వరి యొక్క యావృత్తి నా దగ్గరకు వచ్చినది. దానిలో ప్రాంత పాఠభేదములు చెప్పబడెను. అందులో 'పతిచియా వ్రతా అను సరోనీ పతివ్రతా' పతియొక్క వ్రతమునకు పోషణ యిచ్చునది పతివ్రత' అని నేను చదివితిని. పతియొక్క యభిప్రాయము ననుసరించి నడచునది పతివ్రత అని జ్ఞానేశ్వరుడు లిఖించియుండడు. కాని సంఘమునకు జ్ఞానదేవుని యీ వివరణ బాగుగ నచ్చియుండక పోవచ్చును. కనుక సంఘము "వ్రతా"కు బదులుగా "మతా" అని దిద్దియుండ వచ్చును. దానినిబట్టి సాహిత్యములో ఎన్ని యత్యాచార

ములు జరుగునో తెలియుచున్నది. ఆ కథ యంతయు చాల హృదయ విదారకముగాను మనోరంజకముగాను ఉండును.

పండర పురము

౩౧-౫-౫౮

నూయి త్రవ్వుట వివాహములోని ఒక యంగము

గ్రామములో ఒకచోట వివాహ మహోత్సవమయ్యెను. ప్రతియేడు రమారమి ఇరవై ముప్పయి వివాహములు జరుగుచుండును. వినోబా గణితమును ప్రారంభించెను. ముప్పైఆఱుకోట్ల ప్రజలు, ఆయుర్దాయము నలభై, నలభై యయిదు వత్సరములు. నలభై ఏభై సంవత్సరములలో పదునెనిమిదికోట్ల వివాహములయి యుండవచ్చును. ప్రతియొక పెండ్లికి ఒక నూయి త్రొవ్వవలెను ఈ వరుస మానక జరిగినచో నలభై ఏభై వత్సరములలో పదునెనిమిదికోట్ల నూతులు త్రవ్వబడును. అనగా ఏభై సంవత్సరములలో అంగుళము అంగుళము నేల పల్లపునేలగా అయియుండును. (వారు పిదప ఇట్లు చెప్పిరి.) భగీరథుడు స్వర్గమునుండి గంగను తెచ్చెను. మీరు పాతాళము నుండి సరస్వతిని దీసికొని రండు. నూయి త్రవ్వుట పెండ్లిలోని భాగముగా తలపుడు. నూయి త్రవ్వుటకు తయారు కానంతవఱకు డబ్బు ప్రోగుపడనిచో పెండ్లి చేసికొనకుడు. (పిదప వారు వినోదముగా నిట్లనిరి.) మఱి నూయి సిద్ధమైన పిదప వరుడుగారు వ్యవసాయము చేయనిచో

వారి యదృష్టము బ్రద్దలగును? మఱి ఆ వరునికి నిరాశ కలిగినచో ఆ నూయియె మునిగి చనిపోవుటకు ఉపయోగపడును.

తురపల్లీ
౨౬—౪—౫౧

## ప్రతి శుభకార్యములోను స్త్రీ పురుషుల సహకారము అవసరము

ప్రతి శుభకార్యములోను స్త్రీ సహయోగము అవసరమని, అప్పుడే ఆ కార్యము పూర్తిచెందునని ప్రాచీనకాలము నుండి యొక యాచారము వచ్చుచున్నది. పత్ని లేనిదే యజ్ఞము చేయరాదని హిందూమతములో చెప్పబడినది. శ్రీరామచంద్రుడు యజ్ఞము చేయవలసివచ్చెను. ఆ సమయములో సీతాదేవి వనములో విడిచిపెట్టబడెను. పత్ని లేకుండ యజ్ఞము చేయ వీలులేదని విశ్వామిత్రుడనెను. చివరకు సీతయొక్క బంగారు బొమ్మ తయారు చేయబడెను. గృహస్థాశ్రమములో నున్న మనుష్యుడు పత్ని లేకుండ సార్వజనికమైన కార్యము చేయరాదని దీని భావము. ఆమె సహధర్మచారిణి యని చెప్పబడెను. సహధర్మము అనగా పురుషుడు చేయు ధర్మకార్యములో స్త్రీ తన సహయోగము ఇవ్వవలెననుటయే. కాని మధ్యగా వందలకొలది యేండ్లు మహమ్మదీయుల రాజ్యము నడచెను. ఇంగ్లీషువారి హయాములో పట్టణపు జనులవలె నౌకరి చేసి ధనము సంపాదింపవలెనని కోరిక గలవారు బూటు, పేంటు తొడుగుకొని యింగ్లీషు వారిని అనుకరింపసాగిరి. చివరకు అది వేసవిరోజులలోనైన

ఆ దుస్తులు మానలేనంతవరకు వచ్చినది. అదేవిధముగా "చిత్తమండి" అని ముసల్మానుల దగ్గఱకు వెళ్ళుటకు వారి దయ సంపాదించుకొనుటకు పట్టణపు జనులు వారి అలవాటులను స్వీకరించిరి. పరదాపద్ధతిని మనము ముసల్మానుల నుండియె స్వీకరించితిమి. స్త్రీలను పరదాలో ఉంచుట గొప్ప కులమువారి సంప్రదాయముగా తలపసాగిరి. దానిని మన ధర్మముగా గ్రహించితిమి. ధర్మము పేరుచెప్పి లోకులు స్త్రీలను ఇళ్ళల్లో బంధించి యుంచిరి.



## జ్ఞానము లేనిదే ముక్తి లేదు



సోదరీమణులు జ్ఞానవిషయములను వినరానివారే యైనచో వారికి భగవంతుడు చెవులు పెట్టకయే యుండును. కాని పురుషులకువలె స్త్రీలకును చెవులున్నవి. దానినిబట్టి స్త్రీలు కూడ జ్ఞాన విషయములను విను సావకాశము కలుగవలెనని తెలియుచున్నదిగదా? జ్ఞానము లేనిచో ముక్తి కలుగదు. "జ్ఞానం వినా ముక్తిర్న భవతి జన్మశతేన." "సర్వమతంబుల శతజన్మములను, జ్ఞానవిహీనులు గాంచరు ముక్తిన్." కనుక స్త్రీలకు జ్ఞానము పొందు సావకాశము కల్పింపవలెను. మంచిదే. వారు వంట వగైరా పనులు చేయుచున్నారు. కాని సార్వజనిక కార్యములలో ఏవిధముగానైనను వారి బుద్ధికి ఉపయోగము కలుగుటలేదు. సమాజము ముందుకు వెళ్ళవలెనన్నచో స్త్రీ పురుషుల యీ భేదము పోవలసి యుండును.

జము ఆవా (శాహాబాద్)

౨౬—౩—౩౪

## ధర్మసంకటము - దంపతులు

ప్రశ్న :- రాముడు సీతను పరిత్యజించి యామెకు అన్యాయము చేసెనే. ఇట్లు మీకు తోచుటలేదా ?

జవాబు :- ఇది వివాద విషయము. మనుష్యులకు ఒక్కొక్కప్పుడు ధర్మసంకటము వచ్చి పడుచుండును. అనగా రెండు ధర్మములు వచ్చును. ఇటువంటి సమయములో ఏ ధర్మమునకు ప్రాధాన్యము ఇవ్వవలెనో, ఏ ధర్మమునకు అప్రాధాన్యము ఇవ్వవలెనో యను ప్రశ్న యా మనుష్యుని ముందు వచ్చిపడును.

మహారాష్ట్ర దేశములో ప్రజా సోషలిష్టుల యందు ఇటువంటి సమస్యలె వచ్చినవి. 'కమ్యూనిస్టులకు దూరముగా నుండుము' అని యొక ధర్మము చెప్పును. 'వారితో కలిసి మెలిసి పని చేయుము' అని యింకొక ధర్మము చెప్పును. ఈ రెంటిలోను వారొక ధర్మము నెన్నుకొనిరి. అది తప్పో, రైటో భావికాలము నిర్ణయించును.

ఇట్లే రామునియందు కూడ రెండు ధర్మము లున్నవి. ఒకటి రాజధర్మము. రెండవది పతి ధర్మము. ఈ రెంటిలో ఏదో యొకదానిని స్వీకరించి రెండవదానిని విడువవలసి యుండును. రాజ్యమును వదలి పత్నిని స్వీకరింతుమా అందులో ఒక ఆపత్తి యున్నది. పోనీ భార్యను విడిచి రాజ్య

మును స్వీకరింతుమా అందులోను ఒక యాపత్తి యున్నది. అనగా రెండువైపుల ఆపత్తు లున్నవి. రాము డేమిచేసిన పాపము తప్పదు. 'రాముడు తప్పు చేయడు' అని సీతకు తనపైన విశ్వాస మున్నది గదా యని యతడు ఆలోచించెను. ఇక్కడ విశ్వాసమునకు విషయము సీతయె. ప్రజల విషయములో రామునికి ఇట్టి విశ్వాసము లేదు. కనుక రాముడు లక్ష్మణునితో "సీతను అడవిలో వదలిపెట్టుము. కాని ఆశ్రమము దగ్గఱగా వద లుము" అని చెప్పెను. "ప్రపంచ మంతయు నన్ను నిష్ఠురునిగా నిందించినను సీత మాత్రము నా మీద అట్టి యాక్షేపము చేయదు" అని రామునికి విశ్వాసమున్నది.

సరే యిప్పుడు మీ కిష్టమైనచో రాముని మీ యిష్టము వచ్చినట్లు అనుడు. కాని సీత యెప్పుడును అట్లు అనదు.

## స్వల్పారంభముతో మహాఫలము

కస్తూరిబాయి గాంధిజీకిపత్ని. గాంధిజీ చదువుకొన్నట్లు కస్తూరిబాయి చదువుకొనలేదు. కానిఆమెభాగ్యము గొప్పది. గాంధిజీ కస్తూరిబాయిల పేర్లు నేడు ఎట్లు గొప్పవైనవో అట్లే వసిష్ఠుడు అరుంధతుల పేర్లు అయినవి. నేడుకూడ వివాహ విధిలో వధూవరులను ఉత్తరముఖముగా నిలుచుండబెట్టి అరుంధతిని జూపుచుందురు. ఉత్తరదిక్కున వసిష్ఠ నక్షత్ర

మున్నది. దగ్గరగానె నాలుగు వ్రేళ్ళ దూరములో అరుంధతీ నక్షత్రమున్నది. ఈ రెండు నక్షత్రములను జూపి నమస్కారము చేయించు విధానము నేడుకూడ జరుగుచున్నది. వసిష్ఠుడెవరు? అరుంధతి యెవరు? వశిష్ఠుని పేరుతో అరుంధతి పేరుకూడ అమరమైపోయినది. శరీరముదగ్గర నీడయుండును. కాని మనుష్యుడు నీడవైపు దృష్టియుంచడు. అయినను నీడ మనుష్యుని వదలదు. అరుంధతి స్థితికూడ ఇట్టిదే. పతితో కూడ సుఖములోగాని, దుఃఖములోగాని ఉండుటయె యామె మతము. అతడు కష్టములో పడియున్నచో అతని వెనుక కష్టములో పడియుండవలెను. అతడు స్వర్గములోనికి వెళ్ళినచో ఆతనితోకూడ స్వర్గములోనికి వెళ్ళవలెను. ఎక్కడికైన ఆగకుండ పోవుటయె. (అ+రుంధతీ. రుంధతీ=ఆగుచున్నది. అరుంధతీ ఆగనిదై పోవునది. అని వ్యుత్పత్తి.) ఈ వ్రతమునుబట్టి ఆమెకు అరుంధతియని పేరు వచ్చినది. ఇట్లే రెండవపేరు సీతది. మనము 'రాజారామ్'తో పాటు 'సీతారామ్' అనికూడ చెప్పుచున్నాము. శ్రీరామచంద్రుడు వనవాసమునకు బయలుదేఱగా ఆమెకూడ అతనివెనుక వెళ్ళెను. శ్రీరాము డిట్లనెను. "తల్లిగారు నిన్ను వనములో వసింపు మనలేదు"అని. అపుడు సీత "మీరు ఎక్కడకైన సుఖము లనుభవించుటకై బయలు దేఱినచో బహుశా నేను రాకపోయెడిదాననే. కాని మీరు అడవికి పోవుచున్నారు. కాన మీరు లేకుండ నేను ఉండను"అని జవాబిచ్చెను.

## మంచి యిల్లని దేనిని అందుము

'అమ్మాయి మంచియింటిలోనికి వెళ్ళవలెను' అని తల్లిదండ్రులు కోరుచుందురు. మంచి యింటికి చిహ్నములేవి? ఏ యింటిలో నీరు తోడవలసిన పని లేదో! ఎక్కడ నీరుకూడ తోడనక్కఱలేదో అక్కడ ఆమెకు అన్నముగూడ అరగదు. అక్కడ డాక్టరుకు బిల్లులు చెల్లింపవలసియుండును.

'శంకరునే వరించెదను'అని పార్వతి యన్నది. 'శంకరుడు ఫకీరు. అక్కడికి వెళ్ళి ఏమి పొందుదువు? ఏదైనను మంచియిల్లు చూచుకో.' అని పెద్దపెద్ద ఋషులు, మహర్షులు చెప్పిరి. కాని ఆమె మాత్రము 'నేను అక్కడికే వెళ్ళవలసి యున్నది'అని చెప్పినది.

రామాయణములో ఒక కథ యున్నది. ఆ కథ మంచిది వినదగినది. రామునికి వనవాసము రాగా సీత "నేను వచ్చెదను" అన్నది. ఇటువంటి జీవనమునకు ఆమెకు అలవాటులేదు. కాని 'రాముడెక్కడో అక్కడే నేనును'అని నిశ్చయము చేసికొన్నది. కాని ఇది కౌసల్యవిని 'రాముడు వెళ్ళుచున్నాడు, సీతకూడ వెళ్ళుచున్నది. సీత ఎట్లు ఉండును? నేను ఆమెచే ఇక్కడ దీపమైనను వెలిగింపనీయలేదు.' అని యన్నది. అనగా అక్కడకూడ శ్రమకు గౌరవము ఒప్పుకొనబడలేదు. ఇందులో 'మామగారి యింటికి వధువు వెళ్ళగా అక్కడ ఆమెను పుత్రివలె మన్నించి'రన్నది మంచిదే. కాని పరిశ్రమను నీచముగా చూచిన సంగతి స్పష్టము.

జమాల్‌పురము

౨౨-౧౦-౫౩

## గృహస్థాశ్రమ మను బండికి రెండు చక్రములు

మన ప్రజలలో చాలభాగము కేవలము పురుషులే సాముదాయక భజన చేయుచు కనిపించుచున్నారు. కాని ఏమి స్త్రీలకు ఏ భగవంతుడు లేనేలేడా? గ్రామములోని స్త్రీలు ఒక చోట ప్రోగయి ప్రేమతో కొంత సేపు భజన చేయవలయును. గృహస్థాశ్రమమను బండికి స్త్రీ పురుషు లిద్దరు రెండు చక్రములు. పురుషులకు ధర్మమున్నట్లే స్త్రీలకు కూడ గలదు. పురుషులకు ఆత్మయున్నట్లు స్త్రీలకును గలదు. భగవంతునియందు స్త్రీ పురుషులు సమానమే.

సర్వోదయ
ఏప్రిల్, ౫౧

## వివాహమునకు ధనముతో ఏమిసంబంధము

ధర్మము లేకుండ సమాజము నిలువజాలదు. ఇంటిలో నుంచిన ధనమునకును సమాధానము లేదు. పోనీ యింటిలో నైనను ధనముంచరు. పైగా మెడలో వ్రేలాడదీసికొన గోరుదురు. దీనికి ఫలితముగా సోదరీమణులు పిరికిపందలగుచున్నారు. చూడుడు. నగలు సంకెళ్ళయిననుసరే అవి సంకెళ్ళని గుర్తింపరు. అవి మేలిమి బంగారము కనుక (రాత్రిళ్ళంతయు) మేలుకొని యుండవలెను. నిద్రపోరాదు. భార్యకు రెండుపీసెల బంగారపు సంకెళ్ళు వేసినను సంతోషముతో ఉబ్బిపోవును. అవి యినుపవైనచో అవి సంకెళ్ళుగా తలచును. ఈ నగలు ధరించుటవలన సోదరీమణులు పిరికివారగుచున్నారు. భూషణాలు సోదరీమణులను దాసీలను జేసివైచి

నవి. స్త్రీలు ఇంటినుండి వెలుపలికి వెళ్ళుచున్నపుడు వారు పాలకీలో బంధింపబడి పోవుచుండుట నేడు చూచుచున్నాను. ఏమి వారికి సూర్యకిరణమువల్ల ఏదైన హాని కలుగునా యని నేను అడుగుచున్నాను. "పాలకీలో బంధించి ఎందుకు పంపెదవు? ట్రంకుపెట్టెలో బంధించి పంపినచో ఇంకను సురక్షితముగా పంపగలవుగదా!" అని నా ప్రశ్న. ఇంత లోభమా? ఇంత యాసక్తియా? మఱియు పాలకీ లేనిచో పెండ్లి కాదని చెప్పుచున్నారు. మగపిల్లలు లేరా? లేక ఆడపిల్లలు లేరా? మగపిల్లలు ఆడపిల్లలను కోరుచున్నారు. ఆడపిల్లలు మగపిల్లలను కోరుచున్నారు? ఇందులో కష్టమేమున్నది. పెండ్లి తిలకము పెట్టవలసి వచ్చుచున్నది. డబ్బులేకుండ ఏపనియు జరగనేజరగదా? ఆడపిల్లకు మగపిల్లవాడు నచ్చుచున్నాడు. మగపిల్లవానికి ఆడపిల్ల నచ్చుచున్నదిగదా? ఇంత జరిగిన పిదప ఇంక కావలసిన దేమున్నది? పైగా "నాకు ఎం.ఏ. అను అక్షరాలున్నవి. అయిదు వేలతో పెండ్లికాదు" అని యనుచున్నాడు. మాకు ఒక సోదరుని దగ్గరనుండి యొకజాబు వచ్చినది. వాని పేరునకు పిదప పది పదిహేను అక్షరములు తగిలించబడి యున్నవి. సరే, యింకేమున్నది? ఇదిగో ఇంజనులే తగుల్కొన్నవి. ఇన్ని ఇంజనులు లేకుండ ఏపెట్టె కదలలేదో అది మట్టి బొమ్మయె యయిపోయినది. లండను వెళ్ళి డిగ్రీ తీసికొని వచ్చెను. మీ రేమనుకొనుచున్నారో? అయిదు వేలలో పెండ్లికాదు. ధర పెరుగును. వీడు అమ్మబడుచున్నాడు. ఇదేదైనను ధర్మకార్యమా? శాస్త్రములను ఆధారముగా తీసికొనుచున్నాము. వేదపరమేశ్వరుని మంత్రములను

కష్టపెట్టుచున్నాము. అయినను బజారులో లాగున బేరములు నడచుచున్నవి. ఎంత యధర్మము? ఇటువంటి యధర్మము చేయుచు పైగా మేము దుఃఖవంతులము, అని చెప్పుచున్నాము. ఎక్కడ అధర్మముండునో అక్కడ భగవంతుడు దుఃఖ మివ్వక మఱియేమి యిచ్చును?

పఖనావా (చంపరాన)
౧౬-౬-౪౫

## కుటుంబ నియంత్రణము

"కుటుంబ నియంత్రణపు యోజన విషయములో ప్రభుత్వము ఎంతయో పట్టుదల చూపుచున్నది. దీని విషయములో మీ అభిప్రాయమేమి?" అని నన్ను ప్రశ్నించుచున్నారు. ఈ జరుగుచున్నదేమిటో నేను తెలిసికొనలేక పోవుచున్నానని వాస్తవమునకు నేను అంగీకరింపవలెను. హిందూ దేశములో ప్రతి చతురపు మైలుకు మూడు వందల మంది జనులున్నచో జపానులో ఒక వేయిమందియున్నారు. ఇటువంటప్పుడు హిందూ దేశములో జనసంఖ్య ఎక్కువగా నున్నదని యెందుకు తలచుచున్నారు. ఏమి యిది పురుషార్థ విషయమా? నేడు హిందూ దేశములో ఎక్కువమంది జనులున్నారు. వారి పోషణకు ఏ యేర్పాటును చేయలేక పోవుచున్నామన్నదే యిప్పటి సమస్య. చివరికి ఇది సాంఘికమైన యాధ్యాత్మికమైన విషయము. కాని ఈ రోజులలో కృత్రిమ పద్ధతుల ద్వారా కుటుంబ నియంత్రణము చేయవలెననియు విషయవాసన పెరిగినచో ఏ నియమము నుంచనక్కర లేదనియు ఇప్పుడు జరగుచున్న విషయము.

## శిక్షణను నైతికత్వమును పెంచవలెను

నేడు ఇది యంతయు భూతదయపేర జరుగుచున్నది. పెద్ద పెద్ద పరోపకారపారీణులుకూడ దీనికి అనుకూలముగా నున్నారు. ఇటువంటి యుక్తి చేయబడనంతవఱకు సోదరుల చేతులనుండి సోదరీమణులకు ముక్తి లభింపదని వారు యోచించుచున్నారు. అనవసరముగా తమపై ఆక్రమణ కానివ్వకుండ జేయు యోగ్యత వారి కెందుకుండరాదు? అని మా యుద్దేశము. పతి వశములో పత్ని యెల్లప్పుడును ఉండవలెనని ఈ స్థిరపడిన భావము చాల తప్పు. ఈవిషయములో సోదరీమణులకు చక్కని శిక్షణ లభింపవలెను. వారి నైతిక స్థాయి పెరగవలయును. పొలములో ఒక మామూలు విత్తనము పాతిన పిదప దానికై లోకులు ఎంత జాగ్రత్త తీసికొందురు? ఒక కృషికుడు మృగశిర నక్షత్రము సమయములో పాతుటకు బదులు మేనెలలో పాతె ననుకొనుడు. అపుడు నేల కాలిపోవుచున్నపుడు దానిని మనమేమి యందుము? "నా ప్లానింగు నడచుచున్నది. విత్తనము మొలవవలెనని నేను కోరుటలేదు." అని యతడన్నచో దానిని మనము (నేషనల్ వేస్టేజ్) జాతీయమైన యపవ్యయము అందుము. ఇదేవిధముగా మనుష్యుడు బీజము వేసి "దానివలన ఏ ఫలమును నిర్మాణము కాకపోవలెను" అన్నచో దాని కర్థములేదు. వ్యర్థమగు పని యుండరాదని ఏ వైజ్ఞానికుడైనను చెప్పును. ఈ రోజున వైజ్ఞానికులు ఆలోచించుచున్నట్లే కనబడనంత దీనులుగా నున్నారు. మనుష్యుని జీవనములోనికి వైజ్ఞానిక దృష్టి వచ్చినచో "ఏ క్రియయును

నిష్ఫలము కారా”దని యతడు చెప్పెను. అయితే ఏ క్రియలో పురుష ప్రయత్నము ఉండునో దానిని అతడు పూర్తిగా నిష్ఫలము కానిచ్చునా? కనుక ఈ విషయ మంతయు నా బుద్ధిశక్తికి అందని విస్మయము.

పురుషార్థమును, సంయమవృద్ధియు - ఉపాయములు

హిందూ దేశములోని జనులలో ఈ కుటుంబ నియంత్రణ భావములు వ్యాపించకపోవుట సంతోషింపదగిన విషయము. ఏ దృష్టితో ఈ యాలోచనలు చేయుచున్నారో అదే దృష్టితో ఈ విషయములు చూడవలసియుండును. జీవనములో పురుషార్థము పెరిగినచో విషయ వాసనలు తగ్గుననునది ప్రపంచానుభవమై యున్నది. అందఱకు పురుషార్థము చేయుట కవసరము దొరికినచో స్వభావసిద్ధముగా విషయవాసనలపైని నియమము కలుగును. దానితోపాటే హిందూ దేశములో పురుషార్థము ఎంతగా పెరుగునో అంతగా పోషణపు ఏర్పాటులు గూడ పెరుగును. ఎక్కడ పోషణ చక్కగా దొరకదో అక్కడ భోగవాసన పెరుగును. జంతువులలోగూడ ఇట్లే కనబడుచున్నది. బలము గల జంతువులలో విషయవాసన తక్కువగాను, బలహీనమైన జంతువులలో ఎక్కువగాను కనిపించు చున్నది. బలహీనులకు కలిగిన సంతానముకూడ నిర్వీర్యముగాను పనికిమాలినదిగాను ఉన్నది. కనుక ఈ విషయము సామాజికమైనదని, ఆధ్యాత్మిక మైనదని నేను చెప్పుచున్నాను. దానితో పరిహాస మాడరాదు. సమయమున కనుకూలమైన వాతావరణమును

కల్పింపవలయును. సంఘములో పురుషార్థము పెరుగవలెను. సాహిత్యమును సంస్కరింపవలెను. చెడ్డ సాహిత్యమును చెడ్డ సినిమాలను ఆపవలెను.

పెదపాడు (కర్నూలు)

౧౩-౩-౫౬

స్త్రీలలో పురుషులకంటె ఎక్కువ నీతి గలదు

ప్రశ్న : నీతిని కల్పించినందువలన స్త్రీ మొదటినుండియు ఇంటి వెలుపల అడుగు పెట్టజాలదు. అప్పుడేమి చేయవలెను?

వినోబా : నీతి విషయములో స్త్రీలలో సుపీరియారిటీ కాంప్లెక్స (తాము గొప్పవారమనెడి భావము) ఉన్నది. వారిలో ఇది పురుషులే కల్పించిరని తోచుచున్నది. ఏతల్లికైన తన కుమారుడు పాడైనాడని కబురు వినుట వలన ఎంత దుఃఖము కలుగునో అంతకంటె నెక్కువగా కుమార్తె పాడైనదని కబురు వినుటవలన బాధ కలుగును. అనగా పురుషులనుగూర్చి స్త్రీల మనస్సులో హీనభావము కలుగుచున్నది. పురుషులు చెడ్డపని చేసినచో "వానికేమిలే, వాడు పురుషుడు గదా" అని తఱచు స్త్రీలు చెప్పివైతురు. స్త్రీలకు తాము ఎక్కువ నీతిగలవారము అను అభిమానము సరియైనదే. ఏదైన జంతువులను గూర్చి చెప్పినప్పుడు "అది జంతువేగదా" అని చెప్పినట్లు పురుషుల విషయములో స్త్రీలు చెప్పివైతురు. హిందూ

దేశములో శాసనమును అనుసరించి బీడికాల్చుట కధికారము కలిగినను ఎంతమంది సోదరీమణులు బీడీలు కాల్చుదురు? శాసనము ప్రకారము ఎంత యవకాశమున్నను స్త్రీలు పురుషులంతమంది వ్యసనము గలవారు కారు. కొన్ని జాతులలో పురుషులు మాంసమును తినెడి యాచారమున్నది. కాని స్త్రీలు మాత్రము తినరు. వండి పెట్టరుకూడ. వంటవండుటయె తెలియని పురుషులు ఇటువంటి స్థితిలో ఎక్కడకైన ఒక చోటికిపోయి స్వయముగా వండి మాంసము తినవలసి వచ్చుచున్నది. ఈ విధముగా స్త్రీలలో ఒక విధమైన - ధర్మమును రక్షించు స్థితియున్నది. పాశ్చాత్య శిక్షణ పద్ధతిలో కొన్ని గుణములున్నను దానిలో సమత్వముయొక్క మూఢత్వ కల్పన లున్నవి. నిజమునకు భారతీయ సంస్కృతిలో ఇటువంటి విషయములు లేవు. రాజాలవు గూడ. స్వరాజ్యము వచ్చిన యీ కాలములో మన మందరము ఒకె రోజుకంటె ఒకరోజు ఎక్కువగా శుద్ధులము అగుచు పోవలయును. స్త్రీలదగ్గఱ ఉన్న నైతికాధికారములకు సాక్ష్యమిచ్చి నందువలన వారికి వచ్చిపడు లాభ మేదియు లేదు.

## పురుషులకంటె స్త్రీలు శ్రేష్ఠులు

వర్ణవ్యవస్థలోగూడ - తెలియకుండనైన సరే, ఒక విధమైన విషమత్వము అంగీకరింపబడినది. పురాతన పద్ధతి

ప్రకారము అనులోమ వివాహములు జరుగవచ్చును. అనగా ఉన్నత వర్ణముల పురుషులు తమకంటె క్రింది వర్ణముల స్త్రీలతో వివాహము చేసికొనవచ్చును. ప్రతిలోమ వివాహములు మాత్రము జరుగరాదు. అనగా ఉన్నత వర్ణముల స్త్రీలు తమక్రింది వర్ణముల పురుషులతో వివాహము చేసికొనరాదు. ఇందులో స్త్రీల శ్రేష్ఠత్వము అంగీకరింపబడెను. బ్రాహ్మణులు అందరికంటె శ్రేష్ఠులు, క్షత్రియులు వారికంటె కొంచెము తక్కువ, వైశ్యులు వారికంటెను తక్కువ శూద్రులు వారికంటెను తక్కువ అని మన్నింపబడెను. కాని స్త్రీ మాత్రము పురుషునికంటెను శ్రేష్ఠురాలు. అనగా ఏ స్త్రీయైన బ్రాహ్మణియైనచో ఆమె అత్యంతము శ్రేష్ఠురాలగును. ఇట్టి స్థితిలో ఆమె క్షత్రియ పురుషునితో వివాహము చేసికొనరాదు. కాని ఏ క్షత్రియ స్త్రీయైనను ఆమె శ్రేష్ఠురాలగుటవలన బ్రాహ్మణ పురుషునితో వివాహము చేసికొనవచ్చును. ఈ మాన్యత్వములో స్త్రీల శ్రేష్ఠత్వము గ్రహింపబడినది. ఇందులో ఎక్కడను తప్పు కాలేదు. సంతానమును దాల్చి గర్భములో దాచు బాధ్యతగల వ్యక్తి బాధ్యతలేని వ్యక్తికంటె శ్రేష్ఠమైనదే. సంతాన వ్యవహారము గ్రహింపబడినప్పుడు ఆధ్యాత్మిక దృష్టితో స్త్రీ పురుషునికంటె శ్రేష్ఠురాలని యంగీకరించినచో పురుషుడు పోరాడవలసిన పనిలేదు. స్త్రీలు తాము శ్రేష్ఠురాండ్రని యభిమానము పెట్టుకొనరాదు. కాని పురుష జాతిని మర్యాదలో పెట్ట తెలిసికొనవలెను.

కొందరు సంఘ శాస్త్రవేత్తలకు కొన్ని స్థూలమైన భావము లున్నవి. వారికి ఆధ్యాత్మిక భావములతో, మూల

భూతములైన విలువతో ఏ సంబంధమును లేదు. ఎట్లన, హిందూ దేశములో స్త్రీలకంటె పురుషుల సంఖ్య ఎక్కువ కనుక సమాజ శాస్త్రవిదులు 'స్త్రీలు బ్రహ్మచారిణులుగా ఉండ మొదలు పెట్టినచో ఎక్కువమంది పురుషులు స్త్రీ విహీనులై ఉండిపోదురు. అప్పుడు సంఘములో చిక్కు కలుగును. కనుక స్త్రీలకు వివాహము చేసియే తీరవలెను. ఈవిధముగా వారు స్త్రీల బ్రహ్మచర్యమునకు వ్యతిరేకులుగాను పురుషుల బ్రహ్మచర్యమునకు అనుకూలురుగాను అయిరి. స్త్రీల సంఖ్య తక్కువగాన, పురుషులు బ్రహ్మచారులుగా నుండుట మంచిదే. పురుషులందఱు వివాహము చేసికొనదలచినచో వారిలో స్పర్ధ బయలుదేఱును. కనుక సంఘశాస్త్ర దృష్టితో చూచినచో కొందఱుపురుషులు బ్రహ్మచారులుగా నుండుట ఇష్టమె. హిందూ దేశములో బహు భార్యాత్వము వృత్తుల బట్టి వచ్చినది. హిందూమతము దానిని ఎన్నడును ఉత్తమముగా తలపలేదు.

తప్పటడుగు వేసినందువలన గలిగిన పరిణామము స్త్రీలె యెక్కువ యనుభవింపవలసి వచ్చుచున్నది. కాన స్త్రీలు పురుషులను తక్కువ వారినిగా తలచిరి. కనుక స్త్రీలు 'తాము ఎక్కువ జాగ్రత్తగా నుండవలె'నని నిశ్చయించుకొనిరి. ఇట్లు నిశ్చయించుకొనుట యుచితమె.

## అసత్యముతో సమానమైన పాపపుంజము మరొకటిలేదు

సురక్షిత గృహములలోని (శరణాలయములలోని) స్త్రీలకు పునర్వాసము ఎట్లు చేయబడవలెను? ఈ విషయములో నా

మతము క్రాంతికరమైనది. అన్ని ధర్మములలోను సత్యము శ్రేష్ఠ ధర్మమని, అసత్యము అన్నిటికంటె అధర్మమని నేను తలచుచున్నాను. కాని ఇటు అసత్యమునకు అప్రధానమైన మహత్త్వమిచ్చి వ్యభిచారము, హత్య మొదలైనవి గొప్పపాపములుగా అంగీకరింపబడసాగెను. దీనికి పరిణామముగా పాపములన్నిటిని దాచ యత్నము చేయబడుచున్నవి. ఇందువలన బాగుచేయ వీలు పడుటలేదు. మనము రోగములను దాచుటలేదు. ఏలయన- రోగములు పోవలయుననియు, లోకుల సాయము మనకు కావలయుననియు మనముకోరుచున్నాము. ఇట్లు ఒకవేళ మనము ఏ పొరపాటు పనియైన చేసినచో తల్లిదండ్రులకు మిత్రులకు చెప్పివైచి "నన్ను రక్షించి సరిదిద్దుడు" అని చెప్పవలెను. పొరపాటు చేసిన వ్యక్తియెడ ఏవగింపు గలుగుటచే నేడు ఇట్టి పొరపాటులను దాచు ప్రవృత్తి కలుగుచున్నది. సమాజములో నింద కలుగుచున్నదని కుష్ఠాది మహారోగము లున్నవారు తమ రోగములను దాచుకొందురు! కాని దీనినిబట్టి త్వరగా సంఘమునకు ఆ రోగము సంగతి తెలియకపోవుటయు, అది బాగుపడకపోవుటయు నగుచున్నవి. మొదటనే ఆ సంగతి చెప్పినచో రోగము బాగుపడవచ్చును. కనుక ఇట్లే నైతిక పాపములను గూడ దాచరాదు. దాచుటవల్ల అన్నిటికంటె గొప్ప పాపమైన అసత్యము బలహీనమై పోవుచున్నది.

ఇందువలన పాపములు ఏవగింపునకు విషయములుగా మన్నింపని సమాజమును మనము నిర్మింపవలయును. ఎవరైన

పొరపాటుచేసినచో వారిని సరిచేసి వారిపైని దయాభావన చూపినట్లు పాపము విషయములోగూడ జూపవలయును. సత్య మహిమము పెంచి అసత్యమును అన్నిటికంటె గొప్పపాపముగా తలపవలయును.

ఈ విధముగా చిన్నబాలురు తప్పుచేసినపుడు వారిని కొట్టరాదు. ఇరవైపండ్ల వయస్సు వచ్చువఱకు బాలురు చేయు నైతిక దోషములను ఆటలలోని తప్పులనుగా తలప వలెను. సమాజములో తప్పులను దాచ ప్రయత్నము చేసినచో చాటుగాచేయు పాపములు అధికములగును. ఇందు వలన సురక్షిత గృహములలో (శరణాలయములలో) ప్రవే శించు సోదరీమణులు దయకు పాత్రులేగాని ఏవగింపునకు పాత్రులుగారు. అని ధ్యానములో నుంచుకొనియె పనిచేయ వలెను.

క్రిందటి సంవత్సరములలో హిందూ మహమ్మదీయ కలహములందు ఒకరింకొకరి సోదరీమణులను ఎత్తుకొని పోయిరి. పిదప వారిని వదలించుటకు యత్నము ప్రారంభింప బడినప్పుడు మహమ్మదీయులు మాత్రము తమ అక్క-చెల్లెం డ్రను స్వీకరించిరి. కాని హిందువులు స్వీకరింపలేదు. వారిని స్వీకరింపమని కోరవలసివచ్చినది. దీనిలో హిందువుల దృష్టి సరియైనది కాదు. ఈ యక్క- చెల్లెండ్రు తమ యిచ్ఛతో లేచిపోయినవారు కారు. బలవంతముగా వారిని ఎత్తుకొని పోయిరి. ఇట్టి స్థితిలో వారికి పిల్లలు కలిగినను వారిని పతిత లనుగా దలపరాదు. ఇది యంతయు హిందువులకు నచ్చ చెప్పవలసి వచ్చెను. ఈ సంకుచిత దృష్టిదూరము కావల

యును. రోగుల ఆసుపత్రులను తెఱచినట్లే రెస్క్యూహోములను (అనాథ శరణాలయములను) దయకు పాత్రములుగా దలచి నడపవలయును.

## ౭. స్త్రీ విద్య

వైదికకాలములో స్త్రీలు చాల జ్ఞానముగలవారై యుండెడివారు. ఒక ప్రసంగము గలదు. యాజ్ఞవల్క్యుని సభలో చర్చ జరుగుచుండెను. గార్గి లేచి నిలుచున్నది. ఆమె యాజ్ఞవల్క్యునితో నిట్లన్నది. "కాశీ లేక విదేహ దేశపు క్షత్రియ వీరుడు బాణములు ప్రయోగించినట్లు నేను నీపయిని ప్రశ్నబాణములను ప్రయోగించుచున్నాను. నీ ఱొమ్మును ఎదుట పెట్టుము. నేను ప్రశ్నలతో కొట్టుదును" అని. తిరిగి ఆమె రెండు ప్రశ్నలు అడిగెను. యాజ్ఞవల్క్యుడు జవాబిచ్చెను. అప్పుడామె సాహసముతో పండితులనుగూర్చి యిట్లనెను: "ఓ పండితులారా! ఇప్పుడు యాజ్ఞవల్క్యునితో చర్చ చేయకుడు. ఇతనికి నమస్కరింపుడు. ఇంతకంటె కఠిన ప్రశ్న లుండవు." గార్గి వీరునివలె నిలుచుండి సాహసముతో చెప్పుచున్నది. "నాకంటె కఠినప్రశ్నను ఇంకెవరు అడుగుదురు" అని. అది వేదము ఉపనిషత్తుల కాలము కాదా. మఱి యిప్పుడో!

గార్గి కథ చదివినపిదప నా మనస్సులో కొన్ని భావములు బయలుదేఱెను. ఆ కాలములో గార్గి యడిగిన ప్రశ్నలు అన్నిటికంటె కఠినమైనవి. అయినను యాజ్ఞ

వల్క్యుడు వానికి జవాబివ్వగలిగెను. ఎవతెయొక్క ప్రశ్న లకు ఏ యాజ్ఞవల్క్యుడును జవాబివ్వలేక తన యపజయ మొప్పుకొనునో అట్టి ఏ గార్గియయు ఈ యుగములో పుట్టదా?

అఖండజ్ఞానమునందు లాలసయుంచుడని స్త్రీలకు ముఖ్యముగా నేను సందేశ మిచ్చుచున్నాను. జ్ఞానతృష్ణను ఎన్నటికి నష్టము గానీయకుడు. జ్ఞానోపాసన వలననే మీరు ప్రపంచమును జయింపగలరు.

సఫదర్ గంజ్ (బారాబంకి)
౮-౫-౫౨

## స్త్రీ విద్య - దాని స్వరూపము

ప్రశ్న :- మహిళలకు విద్య ఎట్లుండవలెను? బాలికలను ఆదర్శవతులైన తల్లులుగా జేయు విద్య నీయుదమా లేక వారిని నౌకరికొఱకు తయారుచేయుదమా?

వినోబా :- స్త్రీ పురుషులకు విద్యలో కొన్ని సమానాంశములుండును. కొన్ని విశేషాంశము లుండును. విద్యలో స్త్రీ పురుషులకు సమానాంశములు ఎక్కువ. విశేషాంశములు తక్కువ. మొదట మనము సమానాంశములను చూతము.

స్త్రీ పురుషులు ఇద్దఱు ఆత్మ సమానముగా, సంస్కారము గలదిగానుండును. ఈ విషయములో ఇద్దఱియందు ఏ భేదమును లేదు. ఇది మొదటి సమానత రెండవ సమానత వాసనలకు (వాంఛలకు) సంబంధించినది. ఆకలి, ఆశ మొదలైన వాసనలు

ఇద్దఱిలోను సమానమె. ఇద్దఱికి సృష్టితోడి సంబంధము అనగా విజ్ఞాన సంబంధము సమానమె. ఒకరికి సృష్టి యొక విధముగాను ఇంకొకరికి ఇంకొక విధము గాను కనిపింపదు. ఇది మూడవ సమానత.

## సహశిక్షణమును సమాన విద్యయును లభింపవలెను

స్త్రీ పురుషులకు శిక్షణలో అధికభాగము సమానమె యని దీనివలన స్పష్టమగుచున్నది. ఈ ణవికాసము యొక్క నియమములును ఇద్దఱికి సమానముగానే సరిపోవును. దానిని దృష్టిలో నుంచుకొని "స్త్రీ పురుషులకు శిక్షణము సమానముగానే యుండవలెను. ఒకరితోకూడ నొకరికి ఆ శిక్షణము కలిసియే లభింపవలెను" అని చెప్పుచున్నాను.

"ఏమి ? సహశిక్షణము (స్త్రీ పురుషులు కలిసి చదువుకొనుట, మంచిదేనా ?" అని లోకులు నన్ను అడుగుచున్నారు. అసలు ఈ ప్రశ్న ఎందుకు బయలుదేఱుచున్నదో నాకు అర్థమగుటలేదు. దీనికి సమాధానము స్వయముగా ఈశ్వరుడే యిచ్చెను. అతడు సహశిక్షణమును కోరనివాడే యైనచో కొన్ని యిళ్ళలో కేవలము కుమారులనే యిచ్చి కొన్ని యిళ్ళలో కేవలము కుమార్తెలనే యిచ్చియుండెడివాడు. కాని యతడు ప్రతి యింటిలోను ఇద్దఱిని ఇచ్చెనే. "ఈశ్వరేచ్ఛను బట్టి శిక్షణము ఒక చోటునే కావలయును" అని దీనినిబట్టి మన ధ్యానములోనికి రావచ్చును. శిక్షణము యొక్క యవసరములు కూడ ఇద్దఱికి సమానముగనే యివ్వవలయును. మఱి యవి వారి వారి యోగ్యతలనుబట్టి

పెరుగును. కృత్రిమోపాయముల వలన బాల బాలికలను వేఱుగా ఉంచుటవలన వారికా వికాసముగలుగదు. వికారమును పోషణ పొందును. లేక ఒక వైపుననే శిక్షణము లభించును.

## విశేషాంశములు కర్మయోగములో

శిక్షణ అంతటిలో సమానాంశములె ఎక్కువ. తేడా కేవలము కర్మయోగములోనె కలుగును. శారీరక భేదములనుబట్టి స్త్రీలకు కొన్ని, పురుషులకు కొన్ని తేడాలుఉండును. కాని నేడు ఉన్నట్లు ప్రతి పని స్త్రీలకు పురుషులకు వేఱుగా నిశ్చయింప బడవలెనని నే నొప్పుకొనుచున్నట్లు దీని యభిప్రాయముకాదు. ఉదాహరణకు - వంటపని తీసికొనుడు. మామూలుగా స్త్రీలే వంట చేయుచున్నారు' కాని అది కేవలము స్త్రీల పనిగానే ఒప్పుకొనవలెను అనరాదు. దీనిలో పురుషులు కూడ ప్రవీణులు కావలెను. వంట యొక యుత్పాదక కార్యము. దానిలో ఏదో యొక క్రొత్త యుత్పాదన చేయవలసి యుండదు. క్రొత్త యుత్పాదన కార్యము పరమేశ్వరుడే చేయును. మనుష్యుడు కేవలము వస్తువులకు రూపాంతరమును గలిగించును. ఎట్లన - గోధుమలనుండి రొట్టె, కఱ్ఱనుండి టేబిలు, దూదినుండి బట్టయు తయారు చేయును. కాని వంట చివరిపని. చివర చేయు పనిలో తప్పు చేసినచో అది నడవదు. మొదట చేయు పనిలో తప్పు జరిగినచో హాని స్వల్పమె. చివరిపనిలో కనుక తప్పు జరగినా చాల హాని కలుగును. బాగా సంస్కరింపబడి సంపూర్ణముగా నిర్దోషముగా ఉంచెడి ఉత్పాదన కార్యమైన వంట నుండి

బాలకులను ఎట్లు దూరముగా నుంచగలము? అట్లు చేసినచో వారికెంతో అన్యాయము చేసిన వారమగుదుము. ఈవిధముగా మనము బాల బాలికల పనులను విడదీసి వైచినచో సమాజము రెండుముక్కలై పోవును. మఱి దానికి ఒక యంగము బరువై పోవును. బాలురకు ఈ పనిలో ఏవగింపు గలుగరాదు. అయినను వంటపనియొక్క బాధ్యత ముఖ్యముగా స్త్రీలదై యుండవలెనని నేనొప్పుకొనుచున్నాను. కాని అది వారి పనియే యని యనుకొనరాదు. కర్మయోగములో స్త్రీ పురుషుల పనులకు ప్రాధాన్య మిచ్చుటలో తేడా యగును. కాని అక్కడకూడ రెండు ముక్కలు పడనీయరాదు. అట్లుకానిచో దానివల్ల ఆత్మయే ఖండితమై పోవును.

వంటయొక్క యుదాహరణ మొకటి యిచ్చితిని. ఇంటిలోని యన్ని పనులలోను పురుషులకు తప్పక భాగము ఉండవలెను. అట్లే వెలుపల చేయు పనులలో స్త్రీలు సహకారమీయవలెను. ఇద్దఱ పనులలో చాల తేడా యున్నది. ఎవరు దేనిపైని ఎక్కువ శ్రద్ధ పుచ్చుకొందురో చూడవలెను.

వ్యవసాయము, వంట్రడంగము, నేత, కుట్టుపని మొదలైన పనులు స్త్రీలు చక్కగా చేయగలరు. నేడు ఏవిధముగా మిషనులు గ్రామ పరిశ్రమలను ఆక్రమించినవో, పట్టణములు గ్రామముల పైన ఆక్రమణ జరుపుచున్నవో, అదే విధముగా పురుషులు ఒక విధముగా స్త్రీలపైని ఆక్రమణ జరుపుచున్నారు. మెల్ల మెల్లగా అన్ని పనులు పురుషుల చేతి

లోనికి వెళ్ళిపోయినవి. స్త్రీల దగ్గర నేడు వంటపని తక్క ఇంకే వృత్తియు మిగులలేదు. పురుషులు తెలిసియే స్త్రీల నుండి వృత్తులు లాగుకొనిరని నేను చెప్పను. స్త్రీలు కొన్ని కళాత్మక కార్యములు పురుషులకంటె ఎక్కువగా చేయ గలరు. చిత్రకళ, నూలువడకుట మొదలైన కళాత్మకమైన సామాజికమైన పనులు స్త్రీలు విశేషముగా చేయగలరు. పురుషులు వానిలో పడక పోయినచో స్త్రీలు తమ కాళ్ళ మీద తాము నిలబడగలరు.

రాష్ట్ర సంరక్షణము వఱకు గల పనులు స్త్రీలు చేయ గలరు. ఇంతవఱకు దానిలో హింసయె యాశ్రయింప బడు చున్నది. కనుక తక్కువ శక్తిగల వారగుటచే స్త్రీలను ఆ పనిలోనికి తీసుకొనుటలేదు. కాని క్రొత్త యహింసా మార్గము బయలుదేఱిన పిదప ఇంక ఆ మార్గముగూడ స్త్రీలకు తెలియబడినది. సమాజ రక్షణము మొదలగు పను లలో స్త్రీలు ఎక్కువ పాల్గొన వలసియే యున్నది. అప్పుడే ప్రపంచము హింసనుండి రక్షింపబడును. పురుషుల ద్వారా ఈ క్షేత్రము సరిదిద్దబడుట వలన ద్వేషము పెరిగినది. ఈ పనిలో స్త్రీపురుషులకు స్థానము సమానముగానే యుండ వలెను. ఒక మిక్కిలి విశేషమైన క్షేత్రము స్త్రీలకు పిల్లల శిక్షణలోనే యున్నది. ప్రాథమిక శిక్షణము స్త్రీలచేతిలోనే యుండవలయును.

సింహము పెద్దపులి మొదలైన ప్రాణులలో సంతా నమును రక్షించు భారము ఆడజంతువుమీదనే యుండును. అది తన ఆహారము కొఱకు జంతువును అదే సంపాదించు

కొనును. ప్రాణుల చెడ్డలను మనము అనుకరింపగూడదు. కాని మంచివానిని అనుకరింపవచ్చును. తన జీవికను సంపాదించు బాధ్యతనుండి స్త్రీ ముక్తురాలు కానవసరము లేదు. అవును. స్త్రీలకు వారి పనికై అవసరమైన కానుకలు లభింపవలయును. ఈ రోజులలో స్త్రీలకు తక్కువ కూలియిచ్చు రివాజు పూర్తిగా తలక్రిందైనది. ఇది వారికి అన్యాయమే.

స్త్రీలలో పురుషులకంటె ఏకాగ్రత అధికము. ఇది సహజముగా వారికి వచ్చిన వరము. ఏకాగ్రత లేకుండ బాలుర సంరక్షణ కానేకాదు. ఈ గుణమువలన స్త్రీల యవస్థ ధ్యానయోగమునకు భక్తియోగమునకు చాల యెక్కువ యనుకూలముగానుండును. కర్మయోగము, జ్ఞానయోగము పురుషులకు ఎక్కువ యనుకూలము. కర్మయోగములో కూడ ఎక్కువ ఏకాగ్రత చూపవలసిన పనులను స్త్రీలు నేర్పుతో చేయగలరు. అన్నిటికంటె చివరి ప్రక్రియలు – ఫినిషింగు – స్త్రీలు బాగుగా చేయగలరు. పిల్లల సంరక్షణము మొదలగు కొన్ని పనులు స్త్రీలకు సంబంధించిన విశేషకార్యములు కావచ్చును. అయినను ఈ విషయములో జ్ఞానము ఇద్దఱకును ఉండవలెను. కాని పోషణ జ్ఞానము స్త్రీకి ఎక్కువగా ఉండవలెను. మిగత శిక్షణ యంతయు సర్వసామాన్యముగనే జరుగవచ్చును.

కాశీ విద్యాపీఠము (కాశీ)

౨౭–౮–౫౨

తమ్మును తాము రక్షించుకొనుటకు స్వతంత్ర బుద్ధి

ప్రశ్న :- ఈ రోజులలో స్త్రీ పురుషులకు ఒకే శిక్షణను ఇచ్చుచున్నారు. స్త్రీలు తాము స్వతంత్రముగా తమ్ము రక్షించుకొనుటకు ఎక్కువగా ఎటువంటి శిక్షణమును స్త్రీలకు ఇవ్వవలెను.

వినోబా : తమ్ము తాము రక్షించుకొనుటకు సోదరీమణులకు స్వతంత్రబుద్ధి యుండవలెను. "మనకు పరమేశ్వరునితో తిన్నగా సంబంధమున్నది. మధ్యగా పురుషుల యవసరము లేదు" అని సోదరీమణులు తలపవలెను. "పురుషులద్వారా మనకు పరమేశ్వరునితో సంబంధ మున్నది" అని నేడు స్త్రీలు తలచుచున్నారు. దీనిని వదలిపెట్టవలెను. నేడు ఒకటే యింటిలో బాలురు బాలికలు ఉన్నారు. బాలుడు విశాల మైదానములో తిరుగుటకు పోవును. కాని బాలికకు శృంగారమైన బంగారు నగలు మొదలైనవి కట్టబెట్టి "నీవు ఆడపిల్లవు" అని చెప్పుదురు. ఇట్లు ఎందుకు చేయవలెను? పిల్లవాడెటువంటివాడో ఆడపిల్లయు అటువంటిదే. రాత్రి మనము మగపిల్లవానిని ఏదైన పనికి స్టేషనుకి పంపుదుము. కాని ఆడపిల్లను పంపలేము. పురుషులు స్త్రీలను పిఱికివారినిగా తయారు చేసిరి. వారిని ఒక బ్యాంకుగా తయారు చేసితిమి. పురుషుల వశములోనుండి వెలుపలకు ఒంటరిగా వెళ్ళలేనట్లు వారి ముక్కుకు చెవులకు మెడకు చేతులకు

కాళ్ళకు బంగారు సంకెళ్ళు తగిలించితిమి. ఈ నగలన్నియు మంగళ చిహ్నములని తలచి నిశ్చింతగా కూర్చున్నారు. కాని యిట్టి మంగళ చిహ్నములు పురుషులకు లేనప్పుడు స్త్రీల కెందుకుండవలెనో? పురుషులకు మంగళ చిహ్నముల యవసరము లేదా? వారు పిఱికివారు అగునట్లు స్త్రీలకు చిన్నప్పటినుండి అలంకారపు బొమ్మలు గా తయారు చేయుచున్నాము. స్త్రీలు వీనినన్నిటిని వర్జించి నిర్భయురాండ్రు కావలెను.

మహిళాసభ (బెంగుళూరు)
౧౬—౧౦—౫౭

స్త్రీలు స్కూళ్ళకు వెళ్ళవలయునా ?

ప్రశ్న : "ఆడపిల్లలు పాఠశాలలకు వెళ్ళవలసిన పని యేమున్నది ? వారి స్కూలు భర్తయిల్లే" అని మా అమ్మ అనుచుండెది.

వినోబా : పతియింటిలో గూడ స్త్రీకి పూర్తిగా శిక్షణయగునని నేను ఒప్పుకొనుచున్నాను. కాని పురుషులకు సేవ చేయుటయె స్త్రీల ధర్మమన్నచో అది పూర్తిగా తప్పు. ఆత్మలో స్త్రీ పురుషులకు భేదము లేదు.

మాతృభావన కూడ ఒక గొప్ప కర్తవ్య మనునది సరియైనదే. దాని యోగ్యతకూడ తక్కువని నేను తలపను. ఘన సీత, సతీ సావిత్రి మొదలగువారి యాదర్శములకు మూల

ములో బ్రహ్మచర్యాదర్శమున్నది. పురుషుడు ఈశ్వరుని పేరు చెప్పుకొనుచు ప్రపంచమంతయు తిరుగును. అదే విధముగా స్త్రీలలో కూడ ఏదో యాదర్శము ఉండవలెను. మీరాబాయి యొక్క యాదర్శమొకటి మన యెదుట నున్నది. కాని దానిని లోకులు హరిప్రేమలో పిచ్చిదయ్యెనని తలచిరి. ఇటువంటి అలౌకికమైన అద్వితీయమైన కథ స్త్రీకి స్వాతంత్ర్యము నిప్పించుటలో ఏమియు సాయపడ లేదు. మీరాబాయి యుదాహరణమును ఎవరును అనుసరింప లేదు. స్త్రీలకుకూడ బ్రహ్మచర్యము, సంన్యాసము, వేదాభ్యాసము, ఆత్మచింతన మొదలగువానికి స్వతంత్రముగా అధికారము ఉండవలెనని యంగీకరింతును. ఇది లేక మన ప్రగతి మార్గములో చాల యడ్డంకి కలిగినది. హిందూ దేశములో స్త్రీలకు వైధవ్యముకలిగిన పరిస్థితిలో బ్రహ్మచర్యమునకు అధికారము ఇవ్వబడెను. కాని అంతమాత్రము చాలదు. ఇది విధిలేక యివ్వబడినది.

స్త్రీ ల లో వాత్సల్యభావము స్వభావసిద్ధముగా నుండును. వారు తల్లులైనచో వారికి దోషమును ఆరోపింపను. పైగా అది గుణమనియే గానము చేయుదును. కాని యే స్త్రీయైనను బ్రహ్మచారిణిగా ఉండదలచినచో ఆమెను ఎందుకు అడ్డగింపవలెను ? ఆడపిల్లయైనంతమాత్రమున ప్రతి పిల్లను ఇతరుల యింటికి పంపితీరవలెననెడి పద్ధతి సరియైనది కాదు.

కాశీ విద్యాపీఠము (కాశీ)

౨౭—౮—౨౨

## భక్తియును, ఆత్మజ్ఞానమును అవసరములు

బీహారులో కొందఱు స్త్రీలు కేథలిక్కులైరి. ఇప్పుడు వారు స్త్రీల సేవ చేయుచున్నారు. ఇవుడు బ్రహ్మచారిణులుగా కూడ ఉండవచ్చును. ఇట్టి స్త్రీలు మనకు హిందూ మతములో ఎందుకు దొరకరు? ఆ సోదరీమణులు అట్లు చేయగలుగుటకు కేథలిక్కు సంప్రదాయములో ఏదైన ఇంద్రజాల మున్నదా? అట్టి పని మన సోదరీమణులు చేయగలరా? కేథలిక్కు మతము స్త్రీలకు ఇట్టి మార్గమును తెలిచియున్నదను కారణము స్పష్టము. జైన బౌద్ధ ధర్మములలో ఈ మార్గము తెలుపబడియున్నది. కాని హిందూ మతములో అట్లు తెలుపబడి యుండలేదు. హిందూ మతములో ప్రాచీన కాలము నుండియు యిట్లే యున్నది. ముసల్మానులలో కూడ ఇది ఏమాత్రము తెలుపబడి యుండలేదు. ఇప్పుడిచ్చు శిక్షణము అది సేవది. భక్తియు ఆత్మజ్ఞానమును లేకుండ ఇచ్చు సేవ. అది సాంసారిక సేవ యగును. అందులో ప్రపంచము కంటె పైకి లేచి సమాజమునకు ఒక యాకార మిచ్చుటకును సమాజములో క్రాంతి కలిగించుటకును ఏర్పాటు లేదు. కనుక సోదరీమణులకు భక్తినిగూర్చి ఆత్మజ్ఞానమును గూర్చి శిక్షణము లభింపవలయును.

పండరెపురము

౩౦-౫-౫౮

## ఆధ్యాత్మ శిక్షణము యొక్క రూపము

స్త్రీల శిక్షణమును గుఱించిన సమస్య వచ్చినపుడు దానిలో ఆధ్యాత్మజ్ఞానమె మొదట ఇవ్వబడవలెను. మన దగ్గఱనున్న స్త్రీలు ఆధ్యాత్మ పరాయణ లగుచున్నారు. మహాభారతములో 'సులభ జనకునకు జ్ఞానమిచ్చి నట్లు' న్నది. ఇట్టి కథ లింకను గలవు. ఇంత గౌరవము ఒక కాలములో హిందూదేశమున స్త్రీల కున్నది. అట్టిస్థితి నేడు లేదు. మొదటి యవసరము ఆధ్యాత్మిక జ్ఞానమునకు సంబంధించినది. "మనము దేహముకంటె భిన్నులము. అవినాశియైన యాత్మ స్వరూపులము. పరమేశ్వరుడు లోపల ప్రకాశించుచున్నాడు. ఈ జన్మములోనె అతని దర్శనము సులభము, జీవములన్నియు మన రూపములే." ఈ యాధ్యాత్మ విచారములో సోదరీమణులు ప్రవీణ లగుదురుగాక! శిక్షణకు ఆధారమంతయు ఆత్మజ్ఞానమగుగాక! స్త్రీ శిక్షణలో సత్యనిష్ఠయు జీవన తపస్యయు ముఖ్యముగా అవసరములు. దానివలన స్త్రీలకు నేటి సమాజమునకు వ్యతిరేకముగా విప్లవము చేయుటకు దగిన సాహసము కలుగవలెను. ఎవనిలోపల ఆధ్యాత్మ విద్యయున్నదో వానిని సమస్త ప్రపంచము అణచవలెనని కోరినను అణచజాలదు. ఆధ్యాత్మ విద్యవలన మనము బలవంతముగా విప్లవము చేయ గలమని నా విశ్వాసము. పుస్తకముల వలన తప్పక సాయము దొరకును. ఉత్తమ గ్రంథములు మన యెదుట పడియున్నవి. గీతయున్నది. ఉపనిషత్తులున్నవి. నేటి కాలపు గ్రంథములును ఉన్నవి. కాని నా యుద్దేశము మూలాశయములను గుఱించి

కాని కేవల పుస్తకములను గుఱించికాదు. అవి దొరకినచో తరువాతి సంగతి చక్కబడును...........

## ౮. స్త్రీల కర్తవ్యములు

స్త్రీలు సాంస్కృతిక క్షేత్రములన్నిటిని తమ చేతిలోనికి తీసికొనవలెను. ఇంతవఱకు ఈ క్షేత్రములు ఎక్కువ ప్రకటరూపముగా పురుషుల చేతులలోను అప్రకటముగా స్త్రీల చేతులలోను ఉన్నవి. ప్రపంచములో ప్రసిద్ధములై ప్రపంచ ప్రభావముపడిన మహా కావ్యములు. అవి వాల్మీకి రామాయణమనుడు, వ్యాసమహాభారతము కానిండు, హోమరు, దాంతే, మిల్టను మొదలైనవారి కావ్యములు అయినను అవియన్నియు పురుషులు వ్రాసినవే. వేదమంత్రములను రచించిన స్త్రీలు ఋషులుగాకూడ ఉన్నారు. మఱియు కర్ణాటక దేశములో అక్క మహాదేవి, రాజస్థానములోని మీరాబాయి మొదలైనవారు ఇద్దఱో నలుగురో ఉన్నారు. కాని మొత్తము సాహిత్యముమీద స్త్రీల ప్రభావము ఎక్కువగా లేదు. ఇపుడే యూరోపుదేశములో స్త్రీలు వ్రాయ మొదలు పెట్టిరి. ఇది వారి సామాజిక కార్యముగా అంగీకరింపబడు చున్నది.

### పిల్లలకు శిక్షణ ఈయవలెను

పిల్లలకు శిక్షణయిచ్చు పనికూడ నేడు పురుషుల చేతులలో నున్నది. నిజమునకు పిల్లలకు శిక్షణ ఇవ్వదగినంత బుద్ధి ఏమియు వారిలో కనిపింపదు. పెద్దవారైన పిదప వారికి శిక్షణ

పురుషులు ఇవ్వగలరు-అని యనుకొన్నను ప్రైమరీ స్కూలు పిల్లలతో ఎట్లు వ్యవహరింపవలెనో పురుషులకేమి తెలియును? ఆ క్షేత్రమంతయు స్త్రీల చేతిలోనికి రావలయును. సాహిత్యము, శిక్షణ, ధర్మపద్ధతి మొదలైన క్షేత్రములలో స్త్రీలకు స్థానము లభింపవలెను.

## ఆశ్రమములు స్థాపింపవలయును

స్త్రీలు తాము ఆశ్రమములను నిర్మించు విశేషమైన కార్యము చేయవలసియున్నది. గాంధిజీ ఆశ్రమములను తెఱచిరి. వానిలో స్త్రీ పురుషులిద్దఱు ఉన్నారు. కాని స్త్రీ పురుషులు ఇద్దఱును ఉండు నట్టి యే యాశ్రమమును ఏ స్త్రీయు తెఱవలేదు. పాండిచ్చేరులో మాతాజి ఉన్నారు. కాని ఆ ఆశ్రమముకూడ అరవిందులే తెఱచిరి. మాతాజి తెఱవలేదు. స్త్రీలలో భక్తురాండ్రు ఇదివఱకు ఉన్నారు, ఇప్పుడును ఉన్నారు. గాంధిజీ ఆశ్రమము దేశమును తయారుచేసెను. ఈ యాశ్రమముద్వారా హిందూదేశము మీద ఒక గొప్ప ప్రభావము పడెను. సబర్మతి ఆశ్రమములో రెండో నాలుగో నెలలు లేక ఒకటి రెండు సంవత్సరములు ఉండి అక్కడ స్ఫూర్తిని పొంది పనిచేయువారు హిందూ దేశములో మూల మూలలలో దొరకుచుందురు. మున్షీరాము(స్వామి శ్రద్ధానందు) యొక్క గురుకులము, రవీంద్రుని శాంతి నికేతనము, అరవిందాశ్రమము భారతదేశము మీద ఎటువంటి ప్రభావమును పడవేసెనో అటువంటి ప్రభావమును దేశముపైన పడవేయు స్త్రీలు ఎందుకు బయలుదేఱరు? స్త్రీ పురుషులలో ఉండు

భేదమువలన సమాజ కార్యములు సరిగా నడచినచో ఆభేదము కల్పనామాత్రమని అంగీకరింపబడును. కాని యిటు పురుషుల బుద్ధి మాత్రము దివాలా పొందినది. "మీరు తుపాకులు తీసికొని బయలుదేఱుడు" అని వారు స్త్రీలతో చెప్పసాగిరి. ఇందువలన ఇంతకు పూర్వము చేసిన సంకరము నడవదు. ఇప్పుడు స్త్రీలు హిందూదేశముపైని తమ ప్రభావమును పడవేయు భారము తమ మీాద వేసికొనవలెను. వారట్లు వేసికొన్నచో గొప్ప ప్రభావము దేశముపై పడగలదు.

స్త్రీ పురుషులకు శిక్షణము నిచ్చెడి సంస్థను దేనిని హిందూదేశములో స్త్రీలు ప్రారంభింపలేదు. స్త్రీల మీాద ఇంటి బాధ్యత పిల్లల బాధ్యతయుగలదు. అది గొప్పపనియె. మనము మన తల్లియెడల ఎంతో కృతజ్ఞులమై యుందుము. తల్లిని స్మరింపకుండ మనము ఒక దినము గూడ గడపము. ఆ యుపకారము అపారమైనది. అది నడచుచునే యుండును. స్త్రీల ఆ యధికారమును ఎవడును లాగుకొనలేడు. పురుషుడు ఆ యధికారము లాగుకొన గలిగినచో లాగుకొనియె యుండును. కాని పిల్లలు తల్లి గర్భమునుండి పుట్టునట్టి యేర్పాటు పరమేశ్వరుడు ఏర్పఱచెను. కనుక పురుషుల చేతిలోనికి అది రాజాలదు. పురుషులు స్త్రీలను ఈ పదవినుండి తొలగింపజాలరు. మిగిలిన పనులన్నిటి నుండి వారు తొలగింపబడుచున్నారు. స్త్రీలే కనుక ఆశ్రమమును స్థాపించినచో వారి కార్యముల గొప్ప ప్రభావమును, స్థిరమైన ప్రభావమును, సాంస్కృతిక ప్రభావమును సమాజముపైని పడియుండెడిదే.

## శాంతి సేనతో ముందుకు వచ్చెదరు గాక

ఇప్పుడు శాంతిసేన సంగతి ప్రస్తావింప బడుచున్నది. శాంతిసేనలో స్త్రీలు అగ్రేసరలు కావలయును. ఇప్పుడు హిందూదేశములో ఎక్కడనైనను కలహములు, కొట్లాటలు జరుగవచ్చును. గుండ్లు పడవచ్చును. మందుగుండు పూర్తిగా తయారుగా నున్నది. ఇంకకొంచెము నిప్పురవ్వ అంటించుటయె మిగిలియున్నది. నేడు దేశములో ఏ శబ్దమునకును ఏమాత్రము ముఖ్యమైన విలువ లేదు. నాయకులందఱు అసమర్థులైరి. ఒక నాయకుడు మాటాడిన దానిని ఇంకొక నాయకుడు ఖండించును. లోకప్రియుడగుట వేఱు. శబ్దశక్తి వేఱు. గాంధీజీ శబ్దములో కొంత శక్తి యున్నది. అదికూడ చివర చివర కొంత క్షీణము కాఁదొడగినది శబ్దశక్తి చాల గొప్ప శక్తిగల ఒక వస్తువు. అది నేడు దేశములో లేదు. పంజాబులో ఏమి జరుగుచున్నది. అది పూర్తిగా పనికిమాలిన ఒక విషయము. ఒక గురుముఖిలిపి నేర్చుకొనుటకై ఎన్ని జగడములగుచున్నవి. ఆ లిపిలోని యక్షరములు మూడవవంతు నాగరిలిపివే. ఇంకొక మూడవవంతు అక్షరములు కలిసిమెలిసి యుండును. ఆ కారణమువలన రాజనైతిక ద్వేషములు ప్రకటమగుచున్నవి. సత్యాగ్రహము జరుగుచున్నది. కొట్లాటలు జరుగుచున్నవి. గుండ్లు పడుచున్నవి. ఇప్పుడే తపాలాశాఖవారి హరతాలును గూర్చిన సంగతి నడచుచున్నది. అదే జరిగినచో భారతదేశ వ్యవహారములన్నియు ఒకసూటుగా స్తంభించి పోవును. గందరగోళము వ్యాపించును. ఏలయన - పత్రవ్యవహారము మీఁదనే

అంతయు ఆధారపడియున్నది. నేడుకూడ తగిన సమయములో జాబులు అందుటలేదు. తంతివార్తలుగూడ మకాము చేరిన పిదప అందుచున్నవి. ఒకప్పుడు అందుటకూడ లేదు. ఈ విధముగా వ్యవహారమంతయు సడలిపోయినది. తపాలా వ్యవహారము సడలిపోయినచో రాష్ట్ర వ్యవహారమును సడలిపోవును. తపాలశాఖ వారిలో అసంతృప్తి ప్రబలియున్నది. వారి జీతములు తక్కువ. వారి కోరిక న్యాయమైనదే. వారి జీతములు పెంచవలెను. కాని బాధ్యతలుకూడ పెరిగిపోవలెను. కాని నేడు బాధ్యతలు ఉన్నవని తలపేలేదు. "పని కనీసముగా చేయుము. జీతములు ఎంత ఎక్కువ తీసికొనవచ్చునో అంత ఎక్కువ కోరుకొనుము" అను పద్ధతి ప్రస్తుతము నడచుచున్నది. నిప్పు అంటించుటకు అందఱు సమర్థులె. కాని దానిని ఆర్పుటకు ఎవరును సమర్థులుకారు. ఇట్టి స్థితిలో "నిప్పు అంటుకొన్న"దని ఎక్కడనుండియైనను కబురు వినవచ్చును. కాని పిదప పరుగులెత్తినందువలన ఏమగును? ఏదికావలెనో అది యైనది. కనుక శాంతిసేనకు అవసరమున్నది.

## ఆశయమును తెలిసికొందముగాక

శిక్షణకార్యము, ఆశ్రమకార్యము, శాంతిసేన, గ్రామదాన ప్రచారముల కార్యము మొదలైనవన్నియు స్త్రీలు చేయవలెను. కొందఱు స్త్రీలు ఈ పనులలో నిమగ్నులై యుండుట సంతోషింపదగిన విషయము. కాని స్త్రీలు ఈ కార్యములలోని యాశయములను తెలిసికొనవలెను. స్త్రీలమీద

గృహరక్షణ బాధ్యత పడియున్నదే. అయినను దానితోపాటు సమాజమును రక్షించు బాధ్యతయును వారిపైనున్నది. ఇది తెలిసికొని సోదరీమణులు ఈ పనికై పూనవలెను. స్త్రీలు ఏవిషయములో ముందుకు వచ్చెదరో అంతగా వారి నైతిక జ్యోతి వెలుగును. దానికి ఫలితముగా సమాజములో శాంతి వెలయును. కనుక శాంతిసేనలో ముఖ్యముగా స్త్రీలకు ప్రవేశము ఉండవలయును. స్త్రీల శక్తిని మేల్కొలుప గలిగిన విశేషత గాంధిజీలో ఉన్నది. వారి కార్యము అహింసదిగాన వారు స్త్రీ శక్తిని మేలుకొలిపిరి. సమాజములో జరుగు పనికి ఆధారమంతయు హింసమీద ఉన్నంత వఱకు స్త్రీల స్థానము అప్రధానముగానే యుండును. ఒక ఝూన్సీరాణి బయలు దేఱినది. కాని అంతగా ఎక్కువమంది బయలుదేఱలేదు. హింసా శక్తివలన సమాజమునకు రక్షణ జరగవలసి యున్నచో ఆ కార్యములో పురుషులకు ప్రధాన స్థానమును స్త్రీలకు అప్రధాన స్థానమును ఉండును. అహింసలో స్త్రీలకు ఎక్కువ ప్రవేశముండును. గాంధిజీ సమాజ క్షేత్రమంతటి లోను అహింసను స్వీకరించుటవలన స్త్రీశక్తిని మేల్కొలుప గలిగిరి. వ్యక్తి క్షేత్రములో అహింస మొదటినుండియు ఉన్నది. గాంధిజీ దానిని సామాజిక క్షేత్రములోనికి తీసు కొనివచ్చెను. కనుక ఈ క్షేత్రములో స్త్రీలు పురుషులతో సమానముగా కొంత ఎక్కువపని చేయగలరు. ఇదే విధ ముగా గ్రామదానములో స్త్రీలు చాల పనిచేయగలరు. బీహారులో మేము దాని అనుభవముపొందితిమి. అక్కడి పర్దా వలన స్త్రీలు వెలుపలికి రాలేదు. పురుష కార్యకర్తలు

ఇంటిలోపలికి వెళ్ళలేక వెలుపలనే యుండిపోయిరి. కనుక వారి భావములన్నియు వెలుపలనే యున్నవి. స్త్రీలు లోపలికి వెళ్ళగలరు గనుక అక్కడ స్త్రీలే ఎక్కువపని చేసిరి. పిల్లలను గూర్చిన చింత ముఖ్యముగా స్త్రీలదేగాన స్త్రీల సంబంధము లేకుండ భూదాన గ్రామదాన కార్యములు జరగనేరవు. పురుషులు కొంచెముగానే దానము చేయుదురు. కాని విశేష దానములు జరగవలసి యున్నచో స్త్రీల సమ్మతి లేకుండ అవి జరుగనేరవు.

ఈవిధముగా స్త్రీలయందు చాల పెద్ద క్షేత్రము తెఱవబడి యున్నది. గ్రామదానము శాంతిసేన ఆశ్రమ శిక్షణములు ఇట్లు త్రివిధమైన కార్యములు వారు చేయవలసి యున్నది. ఇంతవఱకు వారు ఈ పనిలో అప్రధానముగా ఉండిరి. ఇప్పుడు వారు ముఖ్యముగా ఇందు పాల్గొన వలసి యున్నది.

మైసూరు
౨౬-౯-౫౭

## స్త్రీల వృత్తులు స్త్రీలదగ్గఱనే యుండుగాక

పట్టణపు జనులు పల్లెటూరి వృత్తులను స్వాధీనపఱచుకొన్నట్లు పురుషులు స్త్రీల వృత్తులను స్వాధీన పఱచుకొనిరి. మొదటిలో పురుషులు వ్యవసాయమును, స్త్రీలు నేత పని శ్రమను చేయుచుండిరి. వేదములలో నేత పనిని గూర్చి ఉల్లేఖింప బడినచోట నెల్ల (వయంతీ) నేత నేయు స్త్రీ శబ్దమే వచ్చెను. ఇంగ్లీషులోకూడ పురుషులకు హజ్బెండు

(Husband) అనగా రైతు పదమును, స్త్రీలకు వైఫ్ (Wife) అనగా నేత నేయు స్త్రీ పదమును వాడబడెను. కాని పిదప నేత పనిని పురుషులు ప్రారంభించిరి. స్త్రీలకు నూలు కండెలు పోయు పని అప్పగింపబడెను. అనగా ముఖ్యమైన పని పురుషుల చేతిలోను, అముఖ్యమైన పని స్త్రీల చేతిలోను పడి పోయెను. నూలు కండెలు పోయుటకు ఎక్కువమంది స్త్రీల యవసరముండును. కనుక సాలెవారిలో ఒకరికంటె ఎక్కువ మంది భార్యలను పెండ్లి చేసికొను ఆచారము బయలుదేఱి నది. ఈ విధముగా స్త్రీలకు అప్రధాన స్థానము దొరికినది. మొదట స్త్రీలే జట్టలు కుట్టుపనిని చేయుచుండిరి. కాని యిప్పుడు కుట్టుమిషనులు వచ్చిన పిదప ఆపనికూడ పురుషుల వైపే వెళ్ళిపోయినది. యంత్రము లనగా నాకు ఆక్షేపణ లేదుగాని స్త్రీలయొక్క ఆ పని స్త్రీల చేతిలో ఉండ వలెను. భోజనము తయారు చేయుపని స్త్రీల పనిగా అంగీకరింపబడినది. కాని హోటళ్ళు తెఱవబడిన పిదప ఆపనికూడ పురుషుల చేతిలోనే పడినది. స్త్రీలు చేయగల పని స్త్రీల చేతులలోనే యుండవలయును అని నా యుద్దేశము. దీనివలన వారికి స్వతంత్ర ప్రతిష్ఠ కలుగును. అట్లుకానిచో పనులన్నియు పురుషుల చేతులలో పడిపోవును. ఇంక స్త్రీలు ఎల్లప్పుడును పరాధీనలై పురుషులయధీనములో నుండవలసివచ్చును. స్త్రీలు పరాధీనలై యుండుటయె మీ కిష్టమైనచో నేను పురుషులతో ఇట్లు చెప్పుదును. "పిల్ల లందఱు పెద్దవారు అగునంతవఱకు మేము బ్రతికి యుందు మని మీరు హామీ యీయుడు. ఇంక మీ రెప్పుడు చని

పోయినను సరే మఱి జవాబుదారీ యంతయు స్త్రీల పైన పడును" అని. ఇట్టి పరిస్థితిలో పల్లెటూరివారికి కొన్ని వృత్తులను వదలిపెట్టవలసినట్లె స్త్రీలకును కొన్ని వృత్తులను వదలి పెట్టవలెను.

## ప్రాథమిక పాఠశాలలను స్త్రీలే నడుపుదురుగాక

నా యుద్దేశము ప్రకారము ప్రాథమిక పాఠశాలలు స్త్రీల చేతులలోనే యుండవలెను. వానిలో బాల బాలిక లిద్దఱు ఒకరితో నొకరు కలిసి చదువుదురు. ప్రాథమిక శిక్షణము స్త్రీల చేతిలో ఉన్నచో పిల్లల వికాసము సరిగా జరుగును. వారు సరియైన మార్గములో పడుదురు. సమాజమును ఒక హద్దులో నుంచగల శక్తి స్త్రీలకు వచ్చును. నేడు స్త్రీలలో అంత యోగ్యతగాని శిక్షణగాని లేనిచో మీరు పంచవర్ష ప్రణాళికలో దానికి వ్యవస్థ చేయుదురుగాక.

సేనలను తొలగింపవలసిన కోరిక స్త్రీలు చేయవలెను. దేశ సంరక్షణము సైన్యశక్తిచే నగునంతవఱకు అహింసాశక్తి, వలన కానంతవఱకు పురుషుల తరగతి ఉన్నతముగానే యుండును. పురుషుడు అసభ్యుడై యుండును. స్త్రీల శరీర నిర్మాణమునుబట్టి స్త్రీలు గర్భము ధరించవలసి యున్నది. కనుక స్వభావసిద్ధముగా వారికి హింస కఠినమైనది. కనుక రక్షణసాధనములు హింసాయుతమైనవైనచో జీవనము పురుష ప్రధానముగానే యుండును. కనుక సమాజముయొక్క సంరక్షణము అహింసా పద్ధతివలననే చేయుటకు శక్తి యుండ

వలెను అని నా కోరిక. ఇందుకై స్త్రీలు శిక్షితురాండ్రుగా నగుట సహజమైన పని.

హిరాపురము (బొంబాయి రాష్ట్రము)
౮—౭—౫౮

## సర్వోదయ నిర్మాణము - స్త్రీలు

"సర్వోదయ సమాజ నిర్మాణములో స్త్రీలు ఏమి సాయము చేయగలరు?" అని నన్ను అడుగుచుందురు. సర్వోదయసమాజ నిర్మాణములో సోదరీమణులు అంతయు చేయగలరు. వారి సాయము చాల యవసరము అని నేను చెప్పుచున్నాను. ఇప్పటి యీ సమాజ నిర్మాణము సర్వనాశనము యొక్క నిర్మాణము. అది పురుషులు తమ బుద్ధితో తయారు చేసిరి. ఈ పాతిక సంవత్సరములలో రెండు ప్రపంచ మహా యుద్ధములు జరిగినవి. కనుక ఇప్పుడు స్త్రీలు ముందుకు వచ్చి తమ యధికారమును చెలాయింపవలెను. దేశ సంరక్షణము దేశనియంత్రణము ఇటువంటి రెండు అధికారములు వారే, తీసుకొనవలయును. పురుషులు చేసిన నిర్మాణమునకు ఆధారము భయముగాని, అభయము కాదు. ఇందువల్ల రెండు మహా యుద్ధములు జరిగినవి. ఇంక మూడవదాని భయము వ్యాపించి యున్నది.

నేడు పురుషుల బుద్ధి సర్వనాశనమునకు తగిన ప్రణాళికను తయారు చేసినది. స్త్రీలు దాని మధ్యలో పడి సమాజ సంరక్షణము నియంత్రణముల యధికారములు తమ చేతిలోనికి తీసికొనవలెను. అప్పుడే సర్వోదయము సిద్ధించును.

ఈ సర్వోదయములో స్త్రీలు చేయబోవు దానము పురుషుల దానముకంటె అధికమైనదే యగును. పురుషులు నేటివఱకు చేసిన నిర్మాణమంతయు భయము మీద ఆధారపడి చేసినదే. కాని అభయము మీద ఆధారపడి కాదు. సమాజ వ్యవస్థ కోసము పురుషులు ఒక హద్దును ఏర్పఱచి దానిని వారే భగ్నపఱచిరి. ప్రపంచమంతటికి నిప్పుముట్టించుట వారెఱుగుదురు. ఈ స్థితిని బాగు చేయుటకు స్త్రీలు ముందుకు రావలయును.

## స్త్రీలే సర్వోదయమును తీసికొని రాగలరు

'ప్రార్థన యితరులకు కాకుండ తన చిత్తశుద్ధికే చేయవలయును' అని భక్తిమార్గముయొక్క యాజ్ఞ. 'కాని నేనీ మర్యాదను భంగపఱచి ప్రభువుతో "ఓ ప్రభూ? ఐసన్‌హోవరుకు, కృశ్చేవువంటివారికి నీవు సద్బుద్ధి నిమ్ము. నాకు సద్బుద్ధి యివ్వకపోయినను ప్రపంచమునకు ఏమియు పోదు. కాని వారిలో ప్రపంచమునంతటికి నిప్పు ముట్టించు శక్తి యున్నది. కనుక వానికి తప్పక సద్బుద్ధి యిమ్ము."అని ఇట్లు ప్రార్థన చేయుచున్నాను. రోజుకు రోజు క్రొత్త క్రొత్త సత్తా నిర్మాణము అగుచున్నది. క్రొత్త క్రొత్త సమస్యలు బయలు దేఱుచున్నవి. భయనిర్మాణము అగుచున్నది. సమస్యలు తీఱుట కుపాయము దొరకుటలేదు. ఇట్టి స్థితిలో సర్వోదయము తీసికొనిరావలసి యున్నచో స్త్రీలే దానిని తీసికొని రావలయును.

సంస్కృతభాషలో ధృతి, మేధ, క్షమ, కీర్తి, వాణి, భక్తి, ముక్తి, బుద్ధి ఇవన్నియు స్త్రీ లింగములే. బోధశబ్దము పుంలింగమె అయినను అది బుద్ధిలోనుండి వచ్చినదే. బుద్ధి తల్లి. బోధ దానికి పుత్రుడు. కనుక స్త్రీల వలననే సర్వోదయ నిర్మాణము అగునని ఆశించుచున్నాము. ఏలయన – మాతృశక్తియె రక్షించు దేవత. పురుషుడు హింసశక్తిని ఆహ్వానించునపుడు స్త్రీ దానికి రూపమిచ్చును. "ఉత్తరమాం అంబామా, పూరబమాం కాళీమా" కాళీ దుర్గల రూపములో సంహారశక్తి కల్పింపబడినది. కనుక ఇపుడు సమాజ సూత్రమును స్త్రీలు తమ చేతిలోనికి తీసికొనవలయును.

స్త్రీలు వ్యర్థమైన సమత్వ విషయములో చిక్కుకొన్నచో భయంకరమగును. "స్త్రీలు పురుషులతో సమానముగా ఉన్నారు" అను దానికంటె మిక్కిలి యవమానకరమింకొకటి యేమున్నది? నేడు పాశ్చాత్య దేశములలో స్త్రీల సేనలుకూడ ఉన్నవి. స్త్రీలు చేతిలో తుపాకి పట్టుకొని కవాతుకూడ చేయుచున్నారు. కాని ఇట్టి భ్రమలో పడకూడదు. "ఒక వేయి తండ్రుల కంటె ఒక మాత గౌరవమునుబట్టి ఎక్కువ" అను మనువుమాటను జ్ఞాపకముంచుకొనవలెను. ఇప్పుడు పురుషులు స్త్రీలను అత్యాచారములకు సాధనముగా తయారు చేసిరి. మాతృత్వము యొక్క మాఱురూపము వ్యభిచారములో ఉన్నది. హింసకు వ్యభిచారమును ఎదుర్కొనుటకు స్త్రీలు ముందుకు రావలయును. మాతృత్వము బ్రహ్మచర్యములో ఉన్నది. కనుక బ్రహ్మచర్యముయొక్క శక్తి వికాసమును స్త్రీలు చేయవలయును.

అప్పుడే మాతృత్వము యొక్క పవిత్రత సిద్ధించును. సమాజముయొక్క రక్షణము అగును. వారు ముందుకు వచ్చినచో సర్వోదయ మగును.

## రాజనీతి - స్త్రీలు

స్త్రీలు రాజనీతిలో పాల్గొనవలెనా కూడదా? అనికూడ అడుగు చున్నారు. స్త్రీలు రాజనీతి నుండి యుదాసీనముగా ఉండరాదు. రాజనీతిని ఖండించుటకు వారు రాజనీతిని చేతిలోనికి తీసికొనవలయును. మనము లోకనీతిని స్థాపింపవలసి యున్నది. కనుక మన సమాజములోని స్త్రీలు ముందుకు రావలయును. మనము పార్టీ లేని సమాజమును తయారు చేయవలెను. కొందఱు పురుషులు కాంగ్రెసులోను కొందఱు పి. ఎస్. పి. లోను కొందఱు కమ్యూనిస్టులలోను ప్రవేశించిన ప్రవేశింపనిండు. స్త్రీలు మాత్రము "మనము పక్షముక్తలమై యుందుముగాక! మనకు ఏ పార్టీతోను పనిలేదు." అని నిశ్చయించుకొనవలెను. ఓటునిచ్చు నధికార మున్నది. అది మంచిదే. వారు మంచి మనుష్యునికి నిశ్శబ్దముగా ఓటునిచ్చి దానిని సార్థకపఱుపవచ్చును. ఇది గుప్తగాయత్రి మంత్రజపము వంటిది. కనుక మన ఓటు ఎవరికివ్వవలెనో ఎవరితోను చెప్పవలసిన పనిలేదు. స్త్రీలు ఏ పార్టీలోను ప్రవేశింపరాదు. ఒక ప్రక్కన ముప్పైమంది యున్నారు. ఇంకొకప్రక్క డెబ్బైమంది యున్నారు. అను కల్పన మాతృత్వమునకు విరుద్ధము. మాతృశక్తిలో ఇటువంటి విభాగములు రావు. తల్లి అందఱ హితమును చూచునదిగదా.

ఒక కాలములో మెజార్టీ మీద మైనార్టీ రాజ్యము చేసినది. ఇప్పుడు మైనార్టీ మీద మెజార్టీ రాజ్యము చేయుచున్నది. ఇది కేవలము దెబ్బకు దెబ్బ తీయుటయె. వాస్తవమునకు స్త్రీలు అందఱ హితమునే చూడవలయును.

## స్త్రీ స్త్రీగా ఎన్నికలలో పోటీ చేయవలెను

ఈవిధముగా చూచినచో హిందూ దేశము రాజ్యాంగ విధానము ననుసరించి మహిళ రాష్ట్రపతిగాకూడ కాగలదు. ప్రధానమంత్రియును కాగలదు. స్త్రీలకు ఈ స్థానములన్నియు తెఱవబడియె యున్నవి. కాని వారు ఏ స్థానములోనికి పోయి పురుషులను అనుకరింపరాదు. పురుషులు పార్టీలను పెట్టుదురు. ఒకరిని ఒకరు ద్వేషింతురు. స్త్రీలు పార్టీలు పెట్టరాదు. స్త్రీలు ఎన్నికలలో నిలవ దలచినచో ఏ పార్టీ తరఫునను నిల్చుండరాదు. పైగా, "మేము స్త్రీలము. అందరకు సేవ చేయుదుము. అను దృష్టితో మీరు మమ్ము ఎన్నుకొన దలచినచో ఎన్నుకొనుడు. మేము అక్కడకు వెళ్ళి పార్టీ భావన లేకుండ సేవచేయుదుము. ఏ మనుష్యుని వైపును వారు ఈ పార్టీవారు, ఈజాతివారు అనుదృష్టితో చూడము. మేము అందఱకు సమానముగా సేవచేయుదుము." అని ప్రజలతో చెప్పివేయవలెను.

బెంగుళూరు

౧౬-౧౨-౫౩

రాజనీతిని సూక్ష్మముగా అధ్యయనము చేయవలెను

"స్త్రీలు రాజనీతిని జాగ్రత్తగా చదివి పురుషులను రాజనీతినుండి విడుదలచేయించు వ్రతమును ధరింపవలె"నని స్త్రీలకు సలహా యిచ్చుచున్నాను. రాజనీతిలో ఏమేమి జరుగుచున్నదో ఇది సరిగా నిరీక్షించుచుండవలెను. ఎన్నిక పురుషుల చేతిలో ఉండరాదు. అది స్త్రీల చేతిలో వుండవలెను. పురుషుల పిలక స్త్రీల చేతిలోనికి రావలయును. కాని యిపుడు పురుషులు పిలక యుంచెడి స్థితి పోయినది లెండు. స్త్రీల జుట్టు పొడుగయి యున్నది, కనుక వారి జడయె పురుషుల చేతిలో పడు భయమేర్పడినది. కాని పురుషులపైని స్త్రీల యంకుశము ఉండవలెను. "జాగ్రత్త! వైరము ద్వేషము వ్యాపింపజేసినచో వీలుపడదు" అని స్త్రీలు చెప్పివేయవలెను. వారు స్వయముగా పక్షములకు అతీతముగా ఉండి పురుషులను పక్షాతీతులను జేయ ప్రయత్నింపవలెను. నాయీ సలహాను స్త్రీలు పాటించినచో హిందూదేశములోని కలుషిత వాతావరణము నిర్మలమైపోవును. ఏ పక్షములోనైనను ఉండుట స్త్రీకి శోభావహముగాదు. స్త్రీ మాతృమూర్తి గనుక ఆమె పక్షాతీతురాలుగా నుండుటమే శోభాకరము. ఇద్దఱు సోదరులు పోరాడుచున్నచో తల్లి యెవరి పక్షమును వహింపదు. ఇద్దఱును సర్దుబాటు చేయును.

స్త్రీలు జ్ఞానసాధన చేయుదురుగాక

స్త్రీలు బాగుగా జ్ఞానాభ్యాసము చేయుట రెండవ విషయము. కస్తూరిబాయి స్మారక నిధినిగూర్చి నన్ను అడు

గగా "ఇది క్షీణకార్యము" అని నేనంటిని. ఇది ప్రవహించెడి నదికాదు. ఈ నీరు ఎండిపోవును. శిక్షణములోని కొలదిపాటి పెట్టుబడిని తీసికొని సేవికలు గ్రామములో పని మొదలు పెట్టుదురు. వారికి పెండ్లి యయినచో వారు ఆపని వదలిపెట్టి పోవుదురు. లేదా ఆపని చేయుచు ఉందురు. ఆస్వల్ప పెట్టుబడి మీద ఆ పని తేజస్సుగలది కాజాలదు. మఱి పురుష ప్రధానమైన సమాజములో స్వతంత్రముగా ఉండి పనిచేయు శక్తి ఆమెలో రాదు. కనుక స్త్రీలు జ్ఞానములో కొంచెముకూడ వెనుక పడియుండరాదు. సరస్వతివలె స్త్రీలు జ్ఞానములో అగ్రేసరురాండ్రు కావలెను. పురుషులకు జ్ఞానమున్నచో నడచును. కాని స్త్రీలు చేయవలసిన పనులు చాల ఉన్నవి. సంస్కృతిని రక్షింపవలెను. ప్రకృతిని మించి పైకి లేవవలెను. కనుక వారికి పూర్తి జ్ఞానము ఉండవలెను. పురుషుడు కూడ ప్రకృతినుండి పైకి లేచునట్లు కూడ చేయవలెను. కనుక స్త్రీలకు పూర్తి జ్ఞానము కావలయును. దానితో పాటు భక్తి కూడ ఉండవలెను. స్త్రీలకు భక్తి జ్ఞానములు రెండును ఉండవలెను. వారి జ్ఞానము గంభీరము కావలయును. వారు జ్ఞానసాధన చేయవలెను. ఈ జ్ఞానముతో పాటు భక్తిని జోడించినచో సమాజమునకు వారు మార్గదర్శనము చేయగలరు. అపుడు సమాజమునకు వికాసము కలుగును.

## గవర్నమెంటు నౌకరి - స్త్రీలు

ఒక ప్రశ్న :- స్త్రీలు గవర్నమెంటు నౌకరిలో పడవలెనా? కూడదా? సమాజపు ఆర్థిక నిర్మాణములో స్త్రీలు ఏమి చేయవలెను?

ఇది మిక్కిలి దుఃఖకరమైన కథ. ఏ విధముగా యంత్రములు గ్రామ పరిశ్రమలను, పరదేశీయులు పట్టణ పరిశ్రమలను, పట్టణములు గ్రామ పరిశ్రమలను నశింపజేయ ప్రయత్నము చేసెనో అదే విధముగా పురుషులు కూడ స్త్రీల పరిశ్రమలను నశింపజేయుటకు కట్టుబాటుతో ప్రయత్నము చేసిరి. "స్త్రీలు నేత పని చేయుచుండిరి" అని వేదములో వర్ణింపబడెను. నేతకు పుంలింగ ప్రయోగము సంస్కృతములో లేదు. "వస్త్రాణి పుత్రాయ మాతరో నయంతి" - "నయంతీ" అనగా నేత నేయు స్త్రీ. "తన పుత్రునికై తల్లులు వస్త్రములు నేయుచున్నారు" అని దానియర్థము. కాని పురుషులు స్త్రీలచేతి నుండి నేత పనిని లాగుకొనిరి. ఇప్పుడు స్త్రీలు కండెలుపోయు పని చేయుచున్నారు. కండెలు సరిగా పోయనిచో పురుషులు కోపపడుదురు. ఒక నేతగానికి ఒక స్త్రీ సరిపోదు. కనుక అతడు ఇద్దరిద్దరు, ముగ్గురు ముగ్గురు స్త్రీలను పెండ్లాడును. అస్సాములో నేడు కూడ స్త్రీలు నేయుచుందురు. కాని మెల్ల మెల్లగా ఆ వృత్తి వారినుండి లాగుకొనబడు చున్నది.

ఆశ్రమములో సరంజామ కార్యములో పెట్టెరాట్నములు తయారు చేయుచుండిరి. అప్పుడు ఆ పెట్టెరాట్నములకు పాలీషు చేయుటకు స్త్రీలను నియోగించిరి. వడ్రంగులందరు పురుషులే. "ఈపనియంతయు పురుషులకే ఎందుకు అట్టిపెట్టితిరి? స్త్రీలకు అట్టిపెట్టి యుంచవలెనే. వారిలో

సౌందర్య భావన కళలు ఉన్నవిగదా." అని యడిగితిని. కాని దానివలన స్త్రీలు స్వావలంబినులు అగుదురు. కనుక పురుషులమీద ఆధారపడియున్న పనులే వారికి ఇవ్వబడు చున్నవి. స్త్రీలకోసమై యుంచబడిన పనులు స్త్రీల నుండి-వారు పురుషావలంబినులగుటకు – లాగుకొనబడెను.

స్త్రీల చేతులకు కాళ్ళకు సంకెళ్ళు

పురుషులు ఇంకొకపని చేసిరి. వారు స్త్రీల కాళ్ళకు చేతులకు సంకెళ్ళు తగిలించిరి. వారి ముక్కులకు చెవులకు చిల్లులు వేసిరి. పరమేశ్వరునికి ఇది యిష్టమైనచో వారి చెవులకు ముక్కులకు చిల్లులు వేసి స్త్రీని పంపగల తెలివియె లేదా? కాని యీ పురుషులె ఈ పని చేసిరి. వారు వారి చేతులకు కాళ్ళకు సంకెళ్ళు వేసిరి. ఆ సంకెళ్ళు బంగారమువి కనుక సంకెళ్ళు అనబడుటలేదు. ఇనుపవి యైనచో వానిని సంకెళ్ళు అని యందురు. దాని ఫలితముగా స్త్రీలు ఒంటరిగా వెలుపలికి రాలేకపోయిరి. సాహసముతో పని చేయలేక పోవుచుండిరి. పురుషులు స్త్రీలను ఇట్లు తయారు చేసిరి.

మదాలస * నాదగ్గఱ చదువుచుండెను. ఆ సమయములో ఆశ్రమమునకు ఆమె యింటికి మధ్య జనశూన్యమైన యడవి యున్నది. ఉదయమే లేచి స్నానముచేసి ఆమె వచ్చుచుండెడిది. ఆ సమయములో నాల్గవడిలో ఆశ్రమముండెను. ఆమె అయిదుగంటలకు లాంతరు తీసుకొని వచ్చుచుండెడిది. ఆమె యొంటరిపిల్ల. ఆ దారియుం చాల శూన్య

* శ్రీమతి మదాలస అగ్రవాల్.

మైనది. అందువల్ల ఆమె తల్లికి భయముగా నుండెడిది. స్త్రీలు నిర్భయులై ఎక్కడికేని వెళ్ళగలరా? అను కల్పన కూడ మనము చేయలేము. స్త్రీల శరీరముపైని నగలు ఉంచుచుందుము గనుక రాత్రి చాల పెందలకడనే ఒంటరిగా వారిని ఎక్కడికైన పంపుట హానికరమని తలచుచుందుము. ఆ నగలు బహుమూల్యములై యుండును గనుక స్త్రీలును భయపడుచుందురు. పురుషులు వారిని తమ బ్యాంకులుగా తయారుచేసిరి. కవులుకూడ దానిని గౌరవించుచున్నారు. 'స్త్రీ భీరువు' అని వారు గౌరవముతో వ్రాయుచున్నారు. భీరువు, పిఱికిది అను విశేషణములు స్త్రీలకు గౌరవాస్పదములు కావు. ఇందులో స్త్రీలకు అవమానము తోచియుండ వలసినది.

## గ్రామములోని శక్తురాండ్రైన మహిళలు

సంస్కృతములో స్త్రీల గొప్ప మహిమ గానము చేయబడినది. ఆమెను "మహిళ" అందురు. మహిళ అనగా గొప్పది, సామర్థ్యముగలది, శక్తిస్వరూపిణి. మఱి పురుషుడనగా దేవభక్తి పరాఙ్ముఖుడు. ఇట్టి స్త్రీ పురుషునికంటె అధికమైన బుద్ధి సూక్ష్మత గలది. ఆమె ఆకలి కలవారికి భోజనము పెట్టును. దప్పిక గొన్నవానికి నీళ్ళు ఇచ్చును. రోగికి సేవ చేయును. కనుక నిశ్చయముగా స్త్రీ శ్రేష్ఠురాలు. స్త్రీ దగ్గర సూక్ష్మశక్తి గలదు. ఆమె గొప్ప శక్తిగలది కావచ్చును. ఇంత గొప్ప శక్తి ఆమెదగ్గఱ ఉన్నదని వేదములో ఉన్నది. కనుక పురుషులను సంతోషపెట్టు ప్రయత్నము స్త్రీలు

చేయరాదు. పురుషులు స్త్రీల వృత్తిని లాగుకొనిరి. మజల వారికి సౌకర్యమిచ్చిరి. అనగా వారు స్త్రీని తన చేతిలోని ఆటబొమ్మగా తయారుచేసిరి. అందులోను ఎంతగా చదువుకొన్న అంత పరాధీనురాలయి యుండును. భర్త తప్పుచేయగా దవడమీద ఒక చెంపకాయ కొట్టిన స్త్రీలను నేను గ్రామములో చూచితిని. ఇటువంటి స్త్రీల యెదుట పురుషుడేమియు చెప్పలేడు. పల్లెటూరి స్త్రీలు శిక్షితురాండ్రుగారు. అయినను వారు పనిచేయగలరు - శ్రమపడగలరు. శ్రమ కూలి చేసి తమ పతిమీద అధికారము చెలాయించు సాధ్వులగు స్త్రీలను చాలమందిని నేను పల్లెటూరిలో చూచితిని. శిక్షితురాలగు స్త్రీ భోగలాలసయై యుండును. ఆమె వంటచేయుటకు పిల్లల సంరక్షణమును చూచుటకు నౌకరులను పెట్టును. వాగను సహింపలేనంత పనికిమాలినవిగా ఆమె కాళ్ళు తయారయిపోవును.

## తల్లిచేతి అన్నము

శ్రీకృష్ణ భగవానుడు గురువు దగ్గఱకు వెళ్ళినపుడు 'సమస్త ప్రపంచమును ఉద్ధరించిన వాని కేమి చదువు చెప్పుదును' అని గురువు ఆశ్చర్యపడెను. ఆఱు నెలలు చదువుచెప్పు నాటకము నడచెను. అంత నేర్చుకొన్నందుకు గురువు వానిని గౌరవించెను. వీడ్కోలు సమయములో శ్రీకృష్ణుడు గురువును సేవించెను. అపుడు గురువు ఇట్లనెను. 'నీవు వరమును కోరుకో' అని. అపుడు కృష్ణుడు ఈ వరమును కోరుకొనెను. 'మాతృహస్తేన భోజనం.' 'నా జీవితమంతటిలోను తల్లి చేతి అన్నము

దొరకుగాక' అని. కృష్ణునికి జీవితమంతయు తల్లి చేతి యన్నము దొరకెనని చెప్పెదరు.

తన చేతితో అన్నమువండి పిల్లవానికి పెట్టుటకంటె మించిన వశీకరణశక్తి ఇంకేమియున్నది? గాంధీజీకూడ ఆశ్రమములో మా అందరికి వడ్డించెను. ఇంతకంటె మించిన సేవ యేమైనా ఉన్నదా? మాతృ వాత్సల్యమునకు ఎక్కువ విలువ యున్నది. కనుక నేను వంటకు ఎక్కువ విలువ యిచ్చెదను. దానిని ఫైన్ఆర్టుగా చెప్పెదను. సంగీతము, చిత్రకళ, నృత్యమువంటి లలిత కళయే పాక కళయును. ఈకళయె తల్లియొక్క గొప్పశక్తి. కాని యిపుడుహోటళ్ళు తెలుపబడుచున్నవి. మెల్ల మెల్లగా ఈకళయు వారిచేతినుండి జాఱిపోవుచున్నది. స్త్రీలకు టప్ టప్ ధ్వనిచేయు టైపిస్టుపనిని, యాంత్రికమైన పనిని ఇచ్చుచున్నారు. స్త్రీల వ్రేళ్ళు త్వరగా మెదలును. అందుచే వారిని ఆఫీసులలో కూర్చుండబెట్టు చున్నాము అనుచున్నారు. ఈ పని స్త్రీలు చేయదగినది కాదని నేను చెప్పను. వారి స్త్రీ శక్తి వికాసము పొంది శాంతికి రక్ష యిచ్చెడి పని యివ్వవలయునని నేను చెప్పునది. పవిత్రమైన శాంతినిచ్చు పనియందు పట్టుదల స్త్రీలకుండ వలెను. బాల బాలికలకు సహశిక్షణము తల్లుల చేతిలో ఉండవలయును. ప్రాథమిక శిక్షణము స్త్రీల చేతిలో ఉన్నచో బాల్యమునుండి బాలకులపైన మంచి సంస్కారముపడి సమాజము ఉద్ధరింపబడును.

## స్త్రీలు శాంతికార్యమును వహింతురుగాక!

"మేము సమాజములో అశాంతిని బయలుదేర నీయము. మా చేతులతో అశాంతిని వృద్ధికానివ్వము" అని ప్రతి యింటిలోని స్త్రీలు ప్రతిజ్ఞ చేయవలెనని నాకోరిక. ఇటువంటి ప్రతిజ్ఞచేసి దానికి చిహ్నముగా వారు తమయిళ్ళలో సర్వోదయ పాత్రను స్థాపింతురుగాక. "సమాజమును మేము శాంతిమార్గముగుండ తీసి కొని పోదుము" అని స్త్రీలు ఈ ప్రతిజ్ఞను పూన వలెను. దేశవ్యాపకమైన శాంతిసేన కార్యమును చేయుటకు స్త్రీలు ముందుకు రావలయును. అందువలన వారు రాజనీతి నుండి విడుదల పొంది పక్షాతీతలై వైరము లేకుండ నిర్భయలై యుండవలయును. ఇందుకై స్త్రీలు గంభీరముగా అధ్యయనము చేయవలయును. సర్వోదయ విచారము సర్వాంగీణమైన విచారముగా చేయవలెను. స్త్రీలకు ముఖ్యముగా చేయు నాప్రార్థన యిది. సర్వోదయ సమాజమును స్థాపించుటలో వారి చేతులు ఎక్కువ పనిచేయవలసియున్నవి.

సోఖడా (బరోడా)

౨౮—౧౦—౫౮

## స్త్రీలు - సేవాకార్యము

స్త్రీలు సాహిత్యము ద్వారాకూడ నిర్మాణ కార్యక్రమములో ప్రత్యక్షముగా తప్పక పాల్గొనవచ్చును. "వారు వాల్మీకిగాను అయిరి. రాముని సేనలోను జేరిరి" అని దాని యర్థము. పట్టణములలో ఎంతయోమంది స్త్రీలు దుఃఖము

గలవారై రోగిణులై వృత్తులులేక పడియున్నారు. వారం దఱ దగ్గరకు వెళ్ళవలెను. వారి సేవ చేయవలెను. ఎప్పుడైన ఎవరి యింటనైన వంటకు ఇబ్బంది కలిగినచో మా అమ్మ స్వయముగా అక్కడ వ్రాలి వంటచేసిపెట్టి వచ్చుచుండుట నాకు జ్ఞాపకమున్నది. తన యింటిలో వంట మొదటిలోనే ఆమె చేసియుంచుకొనెడిది. "ఈస్వార్థమెందుకు? మొదట మన యింట వండుచున్నావు. పిదప వారికా?" అని నేను అడిగితిని. "ఇది స్వార్థము కాదు, పరమార్థమె. మొదట వారికి వంట చేసివచ్చి పిదప నీకు చేసినచో తినునప్పుడు నీకు భోజనము వెచ్చగా నుండును. కాని వారికో మొదట చేసినచో వారి భోజనసమయములో ప్రొద్దుటి వంట చల్లబడిపోవును గదా?" అని తల్లియనెను. స్త్రీలు ఇంకొక పని చేసిపెట్ట వచ్చును. వారు ఒక హరిజనబాలుని తమ దగ్గఱ ఉంచుకొని తమ పుత్రునివలె వానిని పెద్దవానిని జేసినచో ఒక హరిజన పాఠశాల నడపుటకంటె అది ఒక ఎక్కువ గొప్ప పని, క్రాంతికరమైన కార్యమునుఅగును. మఱియు రాట్నము, తిరుగలిద్వారా వారు ఇంటిలో గ్రామ పరిశ్రమలయొక్క, పరిశ్రమ నిష్ఠయొక్క వాతావరణమును కలిగించిన వారగుదురు. దానితో వారి ప్రతిభకు కూడ వికాసము పూర్తిగా కలిగించు సావకాశమును దొరకును.

## పరిశ్రమ దృష్టి

అన్నము వండు పని తల్లి చేయును. ఆ తల్లిని మనము గౌరవింతుము. కాని మాతయొక్క మాతృత్వము ఆ వంట

లోనే యుండును. చక్కని వంట చేయుట, పిల్లలకు ప్రేమతో పెట్టుట ఇందులో ఎంత జ్ఞానము, ప్రేమభావన నిండి యున్నవి! వంటపని తల్లుల చేతినుండి తీసివేసినచో వారి ప్రేమభావనయె నశించిపోవును. ప్రేమభావమును ప్రకటించుకొను సావకాశమును ఏమాత్రము పోగొట్టుకొనుటకు తల్లి సిద్ధముగా నుండదు. దాని యాధారముపైన ఆమె బ్రతికి యుండును. ఏదోయొక వంక పెట్టి సోదరీమణులపైన వంటిపని బరువు వారి నెత్తిపైని రుద్దుచున్నానని ఎవరును తలపకుందురుగాక! నేను వారి బరువును తేలిక చేయగోరుచున్నాను. కనుక మేము ఆశ్రమములో వంటపని ముఖ్యముగా పురుషులచేతనే చేయించుచున్నాము. వంటపనిని తల్లి వదలివేసినచో ఆమె జ్ఞానసాధన, ప్రేమసాధన నశించిపోవునని నా యుద్దేశము. అట్లే మనము పరిశ్రమను అసహ్యించుకొన్నచో జ్ఞానసాధనను పోగొట్టుకొందుము.

## చేతితో విసరుటలోని మహాత్త్వము

ఒక గ్రామములోని సంగతి. అక్కడ ఒక ముసల్మాను ఉండెను. వాని భార్య జబ్బుపడెను. ఆ మనిషికి నాపై నమ్మకమున్నది. అతడు నన్ను పిలిపించి ఏమి చికిత్స చేయవలెనో దీనిని గూర్చి నా సలహా కోరెను. ఆ సోదరికి తిన్న తిండి అరగకపోవుట తక్క ఇంకేమియు జబ్బులేదని తెలిసికొన్నాను. "ఇంటికి ఏ పిండి వచ్చుచున్నది" అని యడిగితిని. 'మిల్లుపిండి' అని జవాబు వచ్చెను. "మీరు ఒక తిరగలి యుంచుడు. బాగుగా పొందలకడనే లేచి కొంచెము విస

రుడు. ఆ పిండితో రొట్టె చేసికొని తినుడు. రోగమంతయు ఎక్కడి దక్కడే ఎగిరిపోవును. నేటినుండి రెట్టింపు ఆకలి వేయును" అని సలహా యిచ్చితిని. ఆ సోదరి మెల్లమెల్లగా తిరగలిమీద పిండి విసర మొదలుపెట్టెను. పదునైదు ఇరవై దినములు గడచిన పిదప ఆ సోదరిని చూచుటకు వెళ్ళి "ఏమి ఇప్పుడు ఆరోగ్యమెట్లున్నది?" అని యడిగితిని. "బాగున్నది. చేతితో విసరిన పిండితో చేసిన రొట్టె తిన్న ప్పటి నుండి ఆకలి పెరిగినది" అని యన్నది. రొట్టెకూడ చాల పెద్దది తయారు అగుచున్నది. విసరిన పరిశ్రమ అగు చున్నది. ఆరోగ్యమును బాగుపడినది. స్త్రీలకు శక్తియు కలుగుచున్నది.

కాని విసరు పని కేవలము స్త్రీలే ఎందుకు చేయ వలయును? పురుషులుకూడ విసరవలెను. జైలులోపురుషులు విసరుదురను సంగతి అందఱకు తెలిసినదే. మేము మా పరంధాము ఆశ్రమములో ప్రతిరోజు విసరుదుము. పురుషులు స్త్రీలు విసరుదురు. చేతియొక్క వెచ్చని పిండిలో ఎట్టిశక్తి యున్నదో అది మిల్లుపిండిలో లేదు. సోమరితనమును అవతల పెట్టి పరమేశ్వర నామమును స్మరించుచు స్మరించుచు తిర గలి త్రిప్పుడు. "లోకులు గుళ్ళలో రాయిపెట్టి దానిని పూజిం తురు. కాని "ఘర్‌కీ చాకీ కోయీ నపూజే జాకా పీసా జాయ్" ఏ తిరగలిమీద మనము పిండివిసరి రొట్టె తిను చున్నామో ఆ తిరగలిని ఎందుకు పూజింపరు?" అని కబీరు వ్రాసెను. అదికూడ పరమేశ్వరుడే. తిరగలి పూజ మారేడు

దళములు, పూవులు వేసిన కాదు. దానిని ప్రతిరోజు శుభ్రము చేసి పిండి విసరుటయె తిరగలి పూజ.

# ౯. స్త్రీలనుండి నేటి యుగము ఆశించవలసిన కోరిక

ఇది పాటియాలా పట్టణము. ఇక్కడ చదువుకొన్న సోదరీమణు లున్నారు. వారు సర్వోదయ పాత్రపని పూనుదు రని ఆశించుచున్నాను. లోకసేవక సంఘము స్థాపింపమని గాంధిజీ కోరెను. అట్టి లోకసేవక సంఘమును మీరు స్థాపింపవలెనని నేను కోరుచున్నాను.

సోదరీమణులు లోకసేవక సంఘమును స్థాపింతురు గాక

ఈ రోజులలో ఒక నూత్నకళ వచ్చినది. పురుషు లందఱు పార్టీలలో చిక్కుకొని పోయిరి. కుస్తీవంటి పోటీవచ్చి నచో బాగుండి యుండును. అసలు చేయవలసిన పని సోదరు లిద్దఱు కలిసి ఒక యింటిలో ఉండి ప్రేమతో తినుచు త్రాగుచు ఉండుటయె. ఇద్దఱి రాజనైతిక భావములు వేఱు వేఱు గనుక ఇద్దఱు ప్రజలలోనికి వెళ్ళి తమ తమ యాశయ ములు తెలిపి ఓటు అడుగవలెను. ఎన్నికలలో ఒకరు ఓడిపోయి రెండవవారు గెలిచినచో అప్పుడుకూడ ఇద్దఱు ప్రేమతో ఒకరితో ఒకరు కలిసి యుండవలెను. అప్పుడే ఇది హిందూ దేశపు సంగతికి సరిపడి యుండును. లేనిచో పడమటినుండి వచ్చిన యీ ఎన్నికలు కారణముగా ప్రతి గ్రామములోను

నిప్పు రగుల్కొనును. కనుక ఇప్పుడు సోదరీమణులు లోక సేవక సంఘమును స్థాపించుటకు ముందుకు వచ్చి పురుషులతో ఇట్లు చెప్పవలెను. "మా పోట్లాటలు మీరే యెరుగుదురు. మేము వానిలో పడము. మీరు పిల్లలు. మేము తల్లులము. మేము ఏ పార్టీలోను ఉండము. మేము హృదయాలను కలుపు పనిచేయుదుము" అని. ఉన్న పురుషులందఱు వేఱు వేఱు పార్టీలలో విడిపోయి యుండనీయుడు. స్త్రీలందఱు మొత్తమునకు మొత్తముగా మా దగ్గఱకు రండు. మఱి చూతము. హిందూ దేశముయొక్క పటము ఎట్లు తయారగునో.

## సోదరీమణులపైన బాపూజీకిగల యచంచలమైన శ్రద్ధ

ఈవిధముగా మీకు లోకసేవక సంఘమును స్థాపించు ప్రేరణ కలుగుగాక. ఈ పని మీరు తప్పక చేయుదురని ఆశించుచున్నాను. సోదరీమణులపైని బాపూజీకి మిగుల శ్రద్ధయున్నది. మీరు ముందుకు రావలెనని బాపూజీ మిగుల ప్రయత్నించెను. ఇటువంటి ప్రయత్నము దయానందుడుకూడ చేసెను. స్త్రీలు వేదాధ్యయనము చేయవలయునని చెప్పి వారికై ప్రయత్నము చేసెనుకూడ. ఈ కాలములో గాంధీజీ వలన వేలకొలది స్త్రీలు ముందుకువచ్చి చాల పెద్ద పెద్ద పనులు చేసిరి. గాంధీజీతోడ చాలమంది సోదరీమణులు పని చేసిరి. వారి హృదయము గాంధిజీ యెదుట తెఱచుకొనెడిది. మీరీ పని పూనినచో వారి యాత్మకు శాంతి దొరకును.

గాంధిజీ కాలములో మద్యపానము మాన్పించుటకు కల్లుదుకాణముల దగ్గర పికెటింగు చేయుటకు ఎవరిని పంప వలెనను ప్రశ్న యుదయించెను. 'సోదరీమణులను పంపుడు' అని గాంధీజీ సూచించిరి. ఈ విలక్షణమైన జవాబును విని లోకులు చాల ఆశ్చర్యపడిరి. దుర్మార్గాల కేంద్రములకు సోదరీమణులను ఎట్లు పంపుదుము? అని లోకులు అన సాగిరి. "చీకటిలోనికి వెళ్ళినప్పుడే పనిజరుగును. సోదరీమణులు అక్కడికి వెళ్ళినచో వారు సిగ్గుపడుదురు. మనకంటె సజ్జను లెవరు? సోదరీమణులె" అని బాపూజీ అనిరి. సోదరీ మణులు వెళ్ళిన చోటల్లా మంచి పని జరుగుట లోకులు చూచిరి. ఇది గాంధీజీకి తోచెను. కలహములు, పోట్లాటలు ఆపు పనిని సోదరీమణులు బాగుగా చేయగలరు. జగడములు జరుగుచోట శాంతిమూర్తులు నిలబడినచో జగడములు ఒక్క మూటుగా మటుమాయమైపోవును. కనుక శాంతి సేనయొక్క కార్యక్రమము సోదరీమణులు బాగుగా చేయగలరని నాకు పూర్తిగా విశ్వాసమున్నది.

## సర్వోదయ పాత్ర - సోదరీమణులు

నేడు మీరు సర్వోదయ పాత్ర పని చేయగలరు. రోజు రోజు మీ పిల్లల చేతినుండి ఒక గుప్పెడు బియ్యము సర్వోదయ పాత్రలో వేయించవలెను. అది శాంతికి ఓటు అగును. ఇట్లు సర్వోదయపాత్ర ప్రతి యింటను ఉంచినచో ఒక శక్తి నిర్మాణమగును. మీమీ సత్సంగములలోను, గోష్ఠులలోను ఈ సంగతులు మీరు సోదరీమణులకు తెలు

పుడు. ఇంటింట సర్వోదయపాత్ర శాంతికై యుంచవలెనని సోదరీమణులకు బోధింపుడు. పక్షాతీతలై లోకసేవక సంఘమును స్థాపించి యందఱ సేవ సమానముగా చేయవలసి యున్నది. ఏవైపున ఏ భేదమును మనము ఉంచము. మాన వులముగా మానవసేవ చేయుదము. మంచిని గూర్చి నినాద ములు లేవదీయుదము. చెడ్డలున్నచోటెల్ల వానికి విరుద్ధ ముగా నినాదములు లేవతీయుదము అని నిశ్చయమును మీరు చేయగలరు. మీరు పంజాబును రక్షించు శక్తిని పుట్టింపగలరు.

పాటియాలా

౨౫—౪—౫౯

## శాంతిసేనా కార్యమును సరిదిద్దువము

భూదాన యజ్ఞారోహణ కార్యములో వారు తీసి కొన్న పాత్ర అద్భుతముగా తోచుచున్నది. దీనికై తమ చదువు, నౌకరి, ఇల్లు, వాకిలి మొదలగునవన్నియు వదలి పెట్టి సోదరీమణులు పనిలో పాల్గొనిరి. వారు కొంచెము మందే. కాని వారు చాల పనిచేసిరి. ఇతర ప్రాంతములలో గూడ సోదరీమణులు మంచిపని చేసిరి. ఈ సమయములో హిందూదేశములో ఏవిధముగా సార్వజనీన చింతనము జరుగు చున్నదో ఆ పద్ధతి మాఱినగాని హిందూదేశమునకు తన నిజస్వరూపము దర్శనముగాదు. రాజనైతిక జీవనములో తప్పక ఒక స్థానమున్నది. అది మంచి స్థానమె అయినను ఏవిధముగా నేడు రాజనీతినే తమ సర్వస్వముగా తలచి హిందూదేశపు

పత్రికలు, శిక్షితులైన జనులు ఆలోచించుచున్నారో దాని వలన హిందూ దేశము ఉద్ధరింపబడదు. పైగా ఈ రోజులలో లోకసామ్రాజ్యము యొక్క యర్థము అన్యోన్య మత్సరమై పోయినది. కనుక రాజనీతికి ఒక మహత్త్వము ఉన్నది. అయినను దానికంటె అధిక మహత్త్వము గల సంగతుల తాకిడి ఈ దేశమునకు అవసరమై యున్నది.

## స్త్రీలు విప్లవము చేయుదురుగాక

భూదానముయొక్క చరిత్రను చూచినచో ఏ విధముగా కోరాపుట్టి యడవులలో స్త్రీలు ఒంటరిగా తిరిగి అద్భుతముగా ప్రజలను ఎట్లు మేల్కొలిపిరో తెలియును. కాని యీ యన్నిటిని గురించి ఈ దేశములో అందఱకు తెలియనేలేదు. ఈ ఆరోహణ కార్యములో స్త్రీలు ఏ పని చేసిరో దానికి ఒక స్వతంత్ర చరిత్ర యుండును. మీరా బాయి గీత యొకటి యున్నది.

"మాతు ఛాండి, పితా ఛాండి, ఛాండి సగా సోఈ
అసువన్ జల సీంచ-సీంచ, ప్రేమ బేల్ బోఈ"

"తల్లిని వదలి, తండ్రిని వదలి, సహోదరులను వదలి అశ్రుజలమును తడిపి తడిపి ప్రేమలతను పాతుము."

సరిగా ఇదేవిధముగా కొందఱు సోదరీమణులు తమ సర్వస్వమును వదలి దీనిలో పని చేసిరి. సోదరీమణులు ఆధ్యాత్మిక అధికారములను గురించి వారు విప్లవము నెఱపి పురుషుల యొక్క ఈ ప్రపంచములో నిలబడవలెను. ఇది లేకుండ స్థిరపడిపోయిన తప్పు విలువలు మాఱిపోవు.

## పురుషులమీద అంకుశము ఉంచవలెను

స్త్రీల కార్యక్షేత్రము ఇల్లేయని యంగీకరించిన కాల మొకటి యున్నది. నేను కూడ ఆ యిల్లు వారి చేతిలోనె యుండును. కాని నేడు ప్రపంచము పూర్తిగా వివశమై దుఃఖభాజనమై యుండునట్లు పురుషులు ఈ పాతికేండ్లలోపల బందోబస్తు చేసిరి. ఈ యేర్పాటులో రెండు ప్రపంచ మహా యుద్ధములు జరిగినవి. ఇంక మూడవ యుద్ధము ఎప్పుడగునో చెప్పలేము. స్త్రీ పురుషులు సమానులు అను పేరుతో ఈ జనులు స్త్రీల చేతులకుకూడ తుపాకులివ్వగోరుచున్నారు. స్త్రీల సైన్యములు నిలబెట్ట వాంఛించుచున్నారు. ఇంతే కాకుండ పురుషులను ఇటువంటి పనులనుండి మరలించి తమ మాతృత్వశక్తిని జీవనములో తీసికొని రాగలిగిన అంకుశము వారి చేతికి వచ్చినది. ఇంతేకాకుండ సేనలో భర్తీ చేయుటకు వారికి స్థానములు కేటాయింపబడుచున్నవి. వారి సాయము కోరబడుచున్నది. ప్రపంచములో ఇదంతయు నిర్భయత్వము గలిగింపవలెనను దృష్టితో నడచుచున్నది. మన చేతిలోనికి బహుశా తుపాకి వచ్చినచో మనము నిర్భయులము కాగల మని స్త్రీలుకూడ తలచుచున్నారు. కాని నిర్భయత్వమునకు తుపాకికి ఏమియు సంబంధములేదు. తుపాకి బలము వలన నిర్భయత్వమె సిద్ధించి యుండినచో నేడు అమెరికా, రష్యా దేశములలోని ప్రజలు నిర్భయులై యుండెడివారే. వారి దగ్గఱ అన్ని శస్త్రములున్నవి. కాని వారి హృదయము దడ దడ కొట్టుకొనుచున్నది. వారిలోని భయజ్వరము వేడి నార్మలులో నుండదని నాయుద్దేశము. ఇద్దఱు ఒకరి కొకరు

భయపడుచున్నారు. ఇదియంతయు పురుషుల ఏర్పాటులో అయినది. కనుక ఇప్పుడు స్త్రీలు సామాజిక క్షేత్రములోనికి వచ్చి పురుషులపైని అంకుశము ఉంచుపని చేయవలెను. భారతదేశపు స్త్రీలనుండి నేను కోరునది యిదే.

## కరుణారాజ్యమును స్థాపింతుము గాక

భారతదేశపు స్త్రీలు తమ యాత్మశక్తిని వికసింపజేసి ముందుకు రావలెనని కోరుచున్నాను. దీనిపైని స్త్రీల చేతిలోని సమాజము యొక్క యంకుశము పోవలసియున్నది. ఇందుకై స్త్రీలు తయారుకావలసియున్నది. స్త్రీలు శాంతిసేన కార్యము నడుపుకొన్నచో ప్రపంచము మారిపోవును. నేడు దేశము ముందు, ప్రపంచము ముందు ఉన్న సమస్యలన్నిటి నుండి ముక్తి లభించును. పురుషులవల్ల ఇదంతయు కాదు. ఇప్పుడు వారి మెదడుకు స్థిమితము లేదు. వారికి కొంచెమైనను తోచుట లేదు. తోచినదెల్ల "సేనను పెంచుడు" అని మాత్రమె. ఈవిధముగా ఈ విజ్ఞానయుగములో పురుషుల బుద్ధి స్తంభించి పోయినప్పుడు స్త్రీలు పనిలో జొరబడినచో తమ దైవీ గుణములతో, సంయమశీలముతో, తమ మాతృశక్తితో ఎదుటికి వచ్చి ప్రత్యక్షమైనచో కరుణా రాజ్యమును స్థాపింపగలరు.

## స్త్రీలో భక్తి, ముక్తి, శాంతి అన్నియుగలవు

శాంతిసేన కార్యము కూడ స్త్రీలు వహింపవలెనని నేను కోరుచున్నాను. శాంతి శబ్దము స్వయముగా స్త్రీలింగమె. భక్తి, ముక్తి, శాంతి మొదలైనవన్నియు స్త్రీలింగములె. భగవంతుడు గీతలో "కీర్తిః శ్రీర్వాక్చ

నారీణాం, స్మృతిర్మేధా ధృతిఃక్షమా.” స్త్రీలలోకూడ కీర్తి లక్ష్మి, వాణి, స్మృతి, బుద్ధి, ధృతి, క్షమ ఉన్నవని చెప్పెను. ఇవన్నియు ప్రోగుచేసి భగవంతుడు తన విభూతులను ప్రకాశింపజేసి “స్త్రీలలోని యివన్నియు నేనే” అనెను. దీనిలో జ్ఞానమేదియు స్కూళ్ళలో కాలేజీలలో చదువుస్త్రీలకు లేదని నాకు విచారమగుచున్నది. కాని స్త్రీలు ఈ సంగతులను తెలిసికొనవలెనని నా కోరిక.

శాంతి సైనికుడు పక్షాతీతుడు కావలెను. కాని నేడు మనలోని చాలమంది పురుషులు రాజకీయ పక్షములలో పడియున్నారు. ‘మీరు మీ స్త్రీలను పక్షములనుండి విడుదల కానిండు. మీరు పక్షములో పడి మునిగి తేలుచు ఉన్నచో ఉండుడు–’ అని వారితో చెప్పుచుందును. స్త్రీలు శాంతిసేనలోకి రావలయును. మఱి పురుషులు పక్షములలో భాగింపబడుటకు ఇది యనుమతి యగును.

పండరి పురము
3౧–౫–౫౮

## స్త్రీలు పురుషుల మర్యాద కాపాడవలెను

ఎడమవైపు స్త్రీలు, కుడివైపు పురుషులు నిలబడునట్లు మన సమాజ నిర్మాణము మొదటినుండి యిట్లే యున్నది. నేడు మన సమాజస్థితి తారుమారైనది. స్త్రీలు వెనుకబడిరి. పురుషులు ముందుకు పోయిరి. నిజమడిగినచో ఇప్పుడు సమాజమును తమ చేతులలోనికి తీసుకొనవలెను. వారు

వామపక్షమునందుండి సమాజమును ముందుకు తీసికొని పోవలెను.

## క్రాంతిని సాకారము చేయుటము

చివరకు సమాజక్రాంతిని ఎవరు సాకారముగా చేయుదురు అను ప్రశ్న నా యెదుటికి వచ్చినప్పుడెల్ల 'పురుషుల కంటె రెండు అడుగులు ముందుకువైచి స్త్రీలే యీపని చేయవలె'నని నాకుతోచెను. స్త్రీలకు ఈపనెట్లు అప్పగింతునని ఆలోచించుచుంటిని. ఇందుకై నేను అహింసకయుక్తిని అన్వేషించుచుంటిని. సమాజముపైని ఏమాత్రము ఆక్రమణము లేకుండ అహింసవలననే యీపని యంతయు నగునని యిదే యాలోచించుచుంటిని. అహింసను వికసింప జేయవలెననిన స్త్రీలకే యవకాశము యివ్వవలెనని తోచుచున్నది. చివరికు లోక సమ్మతి సూచించెడి "సర్వోదయ పాత్ర" నాకు తట్టెను. స్త్రీశక్తిని దానిలో ప్రవేశపెట్టవచ్చునని ధ్యానములోనికి వచ్చెను. పురుషుల మెదడులో రాజనీతిరాళ్ళు నిండిపోయి యున్నవి. వానిని తీసివేసినగాని వారివల్ల ఏ పని జరుగదు. ఇందువలన స్త్రీలే ఈ పనిలో ముందుకు రావలయును. వారి మెదడులో రాజనీతి లేకపోవుట వలన ఆ సమాజములో ఎప్పుడును కలతలురావు. వారిలో ధర్మబుద్ధి తయారయి యున్నది. లోకమాన్య తిలకు ఇదే చెప్పుచుండిరి. "హిందూ దేశములో ఎవరైన ధర్మమును తయారుచేసినచో వారు స్త్రీలే"యని. ఈ రెండు సంగతులు స్త్రీలలో ఉండుటవలన వారే ఈపనికి యోగ్యులు. కనుక ఈ పనిలో వారి శక్తి దానము లభించినచో చాల గొప్ప క్రాంతి కాగలదు.

## ప్రేరణ అవసరము

మానవశరీరములో తమోగుణము ఉండుటవలన మాటి మాటికి ప్రేరణ అవసరమగుచుండును. నేడు తమోగుణముచే రాళ్ళయిపోయిన అహల్యలు సమాజములో ఎంతోమంది పడి యున్నారు. వారికి ఒకసారి ప్రేరణ ఇచ్చినచో వారు వెంటనే లేచి పనిలోనికివచ్చి కలియుదురు. గడియారమునకు గూడ ఇరవైనాలుగు గంటలలోను ఒకసారి కీ ఇవ్వవలసియుండును. కనుక మధ్యమధ్య వారికి ప్రేరణ యివ్వవలసి యుండును. ఇంక స్త్రీల చేతిలో సమాజము సురక్షితమై యుండును. ఒక సారి చేతబట్టిన మంచి పనిని వారెన్నడును జాఱిపోనివ్వరు. పురుషులు తప్పక జాఱనిత్తురు. స్త్రీలలో ధర్మబుద్ధి మేల్కొని యుండుట వలననే వారి చేతిలో ఈపని యప్పగించుటలో హాని యేమియు లేదు.

## ఇది సౌమ్యతమమైన సత్యాగ్రహము

సర్వోదయ పాత్రద్వారా మీరు ముందుకు వచ్చుటకు మంచి యవకాశము దొరకినది. మీరొకసారి పని ప్రారంభించినచో ఇంక వాస్తవికమైన కష్టము ఏర్పడును. "ఈ బియ్యము తీసికొనుడు" అని మీరనగా అపుడు సేవకులను నిలబెట్టవలసి యుండును. దానిని వారు అనుభవింతురు. మీ బియ్యము రాసులగును. అప్పుడు లోకుల పరీక్షయగును. కాని స్త్రీలుకూడ సేవకులయి ముందుకు ఎందుకురారు? వాన ప్రస్థలై స్త్రీలు ముందుకు వచ్చినచో మన మంచిసేన తయా రగును. అపుడు నేను "పురుషులారా! మీరు మీ రాజనీతిని

చలాయించుడు. మీ స్త్రీలను నాకప్పగించుడు. నేను చూచెదను. అప్పుడు మీ వంట నా చేతిలోనికి వచ్చును" అని నేను అందును.

ఒక మజాగల సంగతి వినుడు. పురుషులకు మాంసము వండిపెట్టని హరిజన స్త్రీలు కొందఱు వార్ధా వైపు ఉన్నారు. మాంసము తినవలెనని కోరికయున్నచో పురుషులు ఇంటినుండి వెలుపలికిపోయి ఏదోయొక చెట్టుక్రిందనే మాంసము వండుకొని తినవలసి వచ్చుచున్నది. ఆ స్త్రీల సత్యాగ్రహము ఎంతగొప్పది. "పురుషులు మాంసము తిన్నరోజున మీరు అసలు వంటయె వండకుడు. పోనీ ఒకపూట మాత్రమె వండుడు" అని నేను మొదటినుండి చెప్పుచునే యున్నాను. కాని యిప్పుడు అంతకంటె సౌమ్యతమమైన సత్యాగ్రహమును సూచించుచున్నాను. "ఏ రోజున మీకు మాంసము తినవలెనని తోచునో లేక తిందురో ఆ రోజున మేము ఉపవాసము చేయుదుము" అని మీరు పురుషులతో చెప్పుడు. స్త్రీలు కనుక ఈ యడుగు వేసినచో వారు జయింపగలరు. ఇది దానికంటె సౌమ్యమయిన సత్యాగ్రహ మగును.

సారాంశ మేమనగా— స్త్రీ శక్తి రాష్ట్రకార్యములో నిమగ్నమైనచో నిశ్చయముగా రాష్ట్రము ప్రగతిని పొందును. నేడు పురుషులకు కొంచెమైన తోచుటయె లేదు. వారి బుద్ధికి భ్రాంతి ఏర్పడినది. ఎట్లనన్న అట్లె అనుచు, నేడు వారు ఏటం బాంబునుండి హైడ్రోజను బాంబు వఱకు చేరిరి. వారి బుద్ధి యిప్పుడు ముందుకు సాగదు. పురుషుల లజ్జకు వస్త్రాపహ

ణము ప్రారంభమైనది. వారి మర్యాదను కాపాడుటకు స్త్రీ శక్తి ముందుకు రావలయును.

రాజూరీ (బొంబాయి రాష్ట్రము)
౬-౭-౫౮

## సోదరీమణుల కాహ్వానము

సోదరీమణులకు శాంతి సేనలో ఉపయోగముండును. సైనికదళము ఏర్పాటు చేయవలసినచో సోదరీమణులకు ఉపయోగ మేమగును? వారి హృదయములో దయాభావము ఉండును. కనుక నిర్దయగా హత్య చేయుటలో మన కేమి పనియని వారు ఆలోచించెదరు. కాని శాంతి సేనలో సోదరులకంటె సోదరీమణుల యుపయోగము ఎక్కువ కావచ్చును. కనుక పంజాబులో సర్వోదయ మండలముయొక్క యధీనములో ఒక "మహిళా శాంతిసేనా మండలము" స్థాపింపబడినది. తమ పూర్తి కాలము వినియోగింపలేక శాంతి సైనికు రాండ్రు కాలేనివారు శాంతి సహాయకురాండ్రు కావచ్చును. ఎక్కడనైన అశాంతి సంఘటన వచ్చినచో మధ్యగావచ్చి దానిని ఆప ప్రయత్నము చేయవచ్చును. కనుక శాంతిసేన యొక్క పనికై మేము సోదరీమణులను ముఖ్యముగా ఆహ్వానించు చున్నాము. వారణాసిలో కూర్చుండి శాంతిసేన కార్యాలయమునుకూడ ఒక సోదరి–నిర్మల – నడుపుచున్నది. ఈ విధముగా సోదరీమణులు ముందుకు వచ్చినచో శాంతి సేనాకార్యము త్వరగా నెఱవేఱును.

బాపు తమ విల్లులో వారు లోకసేవక సంఘమును రూపొందించమని కాంగ్రెసువారికి ఆదేశమిచ్చిరి. కాని కాంగ్రెసువారు లోకసేవక సంఘమును రూపొందించలేదు. దీనికి కారణము వారి మెదడులో రాజకీయాలు నిండిపోవుటయె. రాజకీయాలు పూర్వకాలపు విషయాలని, వాటి రోజులు మారిపోయినవని బాపూజీ గ్రహించిరి. కనుక అటు పందొమ్మిది వందల నలభైయేడు ఆగష్టు పదిహేను తేదీని ఢిల్లీలో ఉత్సవములు జరుగుచున్న సమయములో బాపు పల్లె పల్లె తిరుగుచునే యుండిరి. ఈ అణుయుగములో రాజకీయాల రోజులు ఇప్పుడు పోయినవని బాపుజీ తెలిసికొని యుండిరి. వారేగనుక ఈనాడు ఉన్నచో నాకంటె బాగుగా ఈపనియే చేసియుందురు. ఇపుడుగూడ వారు ఏ మూలలనుండియో "మా అబ్బాయి నాపనియే చేయుచున్నాడు" అని యాశీర్వాదము ఇచ్చుచుందురు. మహిళలనుండి వారు ఎంత ఆశ పెట్టుకొని యుండిరో! శ్రీకృష్ణ భగవానుని పిదప మహిళలలో ఇంతశక్తిని గలిగించి వారినుండి ఇంత ఆశపెట్టుకొన్న వారు బాపుజీ యొక్కరే తేలిరి. వారి ఆ యాశయొక్క సోకుడు సోదరీమణులకు గలిగినచో వారు పూర్తిగా పనిచేయగలరు.

"ఆ వీరవనిత బాగుగా యుద్ధము చేసినది. ఆమె ఝాన్సీరాణి" అని చెప్పబడిన యొక కాలమున్నది. రణరంగములో ఒక తెయో అరో సోదరి యుద్ధములో ఆహుతి కాగలదు. కాని శాంతిసేనలో ప్రతియొక సోదరి పనిచేయగలదు. ఇందులో చేయవలసినది యేమున్నది? కేవలము

శాంతితో ఉండుటయేగదా! కోపపడవలసి యున్నచో అందు లోకూడ కొంత చేయవలసి వచ్చును. కళ్ళు చించుకొనవలసి వచ్చును. కాని ఇందులో ఇదేదియు చేయవలసినది లేదు. శాంతితో నిలబడుటయె. కనుక సోదరీమణులు లోకసేవక సంఘమును స్థాపించి పురుషులతో "మీరు, పిల్లలు రాజకీయ పక్షములు పెట్టి పోరాడుచున్నారు. కాని తల్లులమై మేము పోరాడము. మేము శాంతి సేవా కార్యమును చేయుదుము" అని చెప్పవలెనని నేను కోరుచున్నాను. ఇది స్త్రీలకు నా పిలుపు.

## సోదరీమణులు బ్రహ్మవిద్యను పొందుదురు గాక

భూగోళము, రాజనీతి, గణితము మొదలగు విద్యలలో పురుషులు పారంగతులు అయిన కానిండు. కాని మీరు సోదరీ మణులందరు బ్రహ్మవిద్య పొందెదరుగాక. నేను కస్తూరి బాయిని, ఈమె సోదరీమణుల ధ్యానమును ఈవైపు మర లించితిని. "మీరు వారికి శిక్షణ ఇచ్చుచున్నారు కాని బ్రహ్మ విద్య లేనిదే మీ శిక్షణమువలన ఉపయోగ మేమియు లేదని ఆ సోదరీమణులతో చెప్పితిని. ఇరవై ఇరవై రెండు ఏండ్లు గల యువతియొక్క ప్రతికూల పరిస్థితులలో గ్రామముల లోనికి వెళ్ళినపుడు ఆమెకు ఆధ్యాత్మికశక్తి లేనిచో ఆమె ఎట్లు నిలువగలదు?

ఇప్పుడే నేను చిత్తోడునుండి వచ్చుచున్నాను. నాకు అక్కడ మీరా దర్శనము కలిగినది. ఆమెలో ఎంత త్యాగము ఎంత సాహసము ఉన్నవి!

తన కాలములోని హద్దులన్నియు త్రోసివైచి ఆమె యివతలకు వచ్చినది. ఆమె చూపిన వీరత్వము భారత చరిత్రలో అద్భుతమైనది. ఈరోజులలో అక్కడ పరదా యున్నది. అక్కడకూడ ఆ రోజులలో మీరా పరదా త్రోసివైచి నాట్యము చేసినది.

"పగఘుంఘురు బాంధమీరానాచీరే"

'కాళ్ళకు గజ్జెలు కట్టి మీరా నాట్యము చేసెరా'

లోకులు ఆమె పిచ్చిదనిరి. అయినను ఆమె ఎవరిని లెక్క చేయలేదు. ఆఖరుకు ఈ సాహసము ఆమెకు ఎక్కడ నుండి వచ్చినదో. మీరాకు పెండ్లిమాటలు జరుగగా "నేను గోపాలుని చరణముల దాసిని" అని యామె అన్నది. పిదప మీరాకు పెండ్లియయినది. ఆమె తన పతిజీవితములో మార్పు తెచ్చినది. అతడు ఆమె భర్తగాగాక భక్తుడుగా అయిపోయెను.

మీరా వంటి స్థితియె రామకృష్ణ పరమహంసకును కలిగెను. మొదట రామకృష్ణుడు పిచ్చివాడుగా తలపబడెను. అతడు తన పత్నిని దేవిగా తలచి పూజచేసెను. విగ్రహము ఎదుట కూర్చుండి గంధము, పూవులు, హారతి అర్పించి పూజ చేసినట్లే అతడును చేయగా అప్పుడు పత్ని జీవిత పరివర్తనము జరిగెను.

రామకృష్ణునిలోను మీరాలోనుగల శక్తి బ్రహ్మవిద్యాశక్తియని చెప్పగోరుచున్నాను. స్త్రీలకు ఈ బ్రహ్మవిద్య అవసరము ఎంతైనను గలదు. హృదయములో కోరిక

యున్నచో, దానికై ఆతురత యున్నచో బ్రహ్మవిద్య కోరిన మాత్రముననె సిద్ధించును. అందఱ హృదయముల లోను దీనిని పొందుటకై ఆకాంక్ష యుండవలెనని కోరుచున్నాను.

అజ్మీరు

౨౮-౨-౪౯

# ౧౦. బ్రహ్మవిద్యా మందిరము యొక్క కల్పన

పది పన్నెండు రోజులనుండి బ్రహ్మవిద్యా మందిరమును గుఱించి చర్చను నేను లేవదీసితిని. ఈ యాలోచన రెండు నాలుగు సంవత్సరములనుండి నా మనస్సులో మెదలుచున్నది. ఈ యాందోళన ఎనిమిదేండ్లనుండి నడచుచున్నది. ఈ మధ్యగా మానసిక సంశోధనము చేసికొనుటకు చాల యవకాశము చిక్కినది. శంకరుడు, రామానుజుడు వంటివారు ఒక సంప్రదాయమును ప్రవేశపెట్టి వెళ్ళిరి. దాని అధ్యయనము, అనుసరణ వేలకొలదేండ్లు గడచిన పిమ్మట కూడ హిందూదేశములో విడువక జరుగుచున్నది. హిందూదేశములోని సత్పురుషు లందఱిమీద దాని ప్రభావము పడినది. ఆ కోటికి చెందిన విభూతులే ఈకాలములోని రామకృష్ణ పరమహంసయు గాంధిజీయును. తమ వైపునుండి భారతదేశములో అద్వితీయులైన వారి పేర్లు ఇంక ఈపట్టికలో నుండుట ఈ కాలముయొక్క మహా భాగ్యము. పరతంత్ర దశలో భారతమాత అయిదు పదిమందిని మొదటి తరగతి

రత్నములను కన్నది. వారంటిలోను బహుశా ఈ రెండు పేర్లు గలవు. ఇంకను రెండుమూడు పేర్లు ఉన్నవి. వారిపేర్లు వేల కొలది సంవత్సరముల వఱకు నిలిచియుండును.

నా మనస్సులో పేర్ల మహత్త్వము లేదు. ఎలయన - ప్రపంచమునకు తెలిసిన పేర్లు గలవారే ప్రపంచములో అందఱి కంటె శ్రేష్ఠులైన పురుషులని నేను ఒప్పను. పైగా ఎవరిపేర్లు ప్రపంచ మెఱుగదో వారే గొప్పవారు. ఇందువలన నాకు పేర్లను గుఱించి మహత్త్వము లేదు. అయినను శంకరరామానుజ సంప్రదాయముల వంటి జ్ఞాన సంప్రదాయమునకు అధికారి గాంధిజీయొకరు. వారితో వ్యక్తిగతమైన పరిచయము నాకున్నది. శ్రీరామకృష్ణుడు, అరవిందు, స్వామి దయానంద, తిలకు, టాగూరు వీరందఱి రచనలు చదివి తెలుసుకొను సావకాశము నాకు దొరకినది. మఱి నేను నా పూర్వ సంప్రదాయమునకు ఉత్తమ ఫలితముగా ఒక పరిపూర్ణ జీవదర్శనమును గాంధిజీ యాశయములలో కనుగొంటిని.

## జీవనపు విలువ ఆశయములకంటె గొప్పది

జీవనమున కున్నంత విలువ ఆశయముల కుండదు. గాంధిజీ జీవనము వారి మాటలద్వారా వ్యక్తమైన శబ్దముల కంటె గొప్పది. మాటలకంటె జీవనమున అధికమైన యుదాహరణములు మనకు అరుదుగా దొరకును. మాటలు సూక్ష్మముగాన తఱచు మాటయే శ్రేష్ఠముగా నుండును. మాటలు నడత సమానముగా నున్న యుదాహరణములు చాల తక్కువగా మనకు లభించును. భావప్రకటన బలహీనముగా నున్న

సత్పురుషులు చాలమంది యుందురు. గాంధిజీ బాగుగా చదువుకొన్నవారు. వారి భావప్రకటన మంచిది. కాని దాని కంటె వారి జీవనము గొప్పది.

ఇంత సాంగోపాంగములతో కూడి విలువమైన యాశయములు దొరకినచో వాటిజ్ఞాన సంప్రదాయము నడవలెనని నాకు తఱచు తోచుచుండును. నేడు నన్ను ఏదైన త్రిప్పుచున్న దన్నచో అదియె భూదానము, గ్రామదానములు ఒక నిమిత్తము మాత్రమే. ఒక బాహ్యమైన యాధారము. బాహ్యాధారము లేకుండ గూడ మహావీరుడు జినునివలె భావప్రచారము చేయవచ్చును. బాహ్యాధారమున్నచో భావప్రచారము గౌతమబుద్ధుని భావప్రచారమువలె కొంత సులువుగా వచ్చును. నా సొంత మనఃప్రవృత్తి మహావీరునిది వలెను, నా నడత పద్ధతి గౌతమబుద్ధుని వలెను అయినది. అది యొక బాహ్యసాధనము దొరకినది. దానిని ముఖ్యముగా భావప్రచార సాధనగానే నే నంగీకరించితిని.

## జ్ఞానబీజము గంభీరముగా నెట్లగును ?

ఈ జ్ఞానబీజము గంభీరము కావలెనన్నచో ఎట్లు పోవలయునో ఆలోచించుచున్నాను. శంకర రామానుజుల దగ్గఱనున్న వస్తువులలో ఒక వస్తువు గాంధిజీ దగ్గఱ లోటుగా నుండిపోయెను. వారిద్దఱుగూడ మతవాదులు (Mystic). అనుభవముగల భక్తులు. ఇద్దఱు జ్ఞానులె. ఇంతే కాకుండ వారు సంఘ సంస్కర్తలు. కర్మయోగులు. భారత దేశమంతయు తిరిగిరి. శంకరాచార్యుని ఆయుష్కాలము

స్వల్పమె. కాని వారు పూర్తిగా తిరుగుటలోనే గడపిరి. రామానుజులు కూడ పూర్తిగా తిరిగిరి. కాని చివరకు ఒక చోట స్థిరపడిరి. మఱియు జీవనములోని ప్రతి సమస్యను చేతిలోనికి తీసుకొనవలసిన అవసరము ఈ కాలములో కలిగి నట్లు - ఆ కాలములో కలుగలేదు. దాస్యము కారణముగా స్వరాజ్య కార్యము గాంధిజీతో మిళితమై పోయెను. దీనికి పరిణామ స్వరూపముగా కర్మయోగమునకు మూలము వారిలో ఎక్కువ ఉండెను. ఇందువలన కలిగిన లాభము ఆ యిద్దఱకు దొరకలేదు. ఈ లాభము కలిగినట్లే ఒక లోటు కూడ ఉండిపోయెను. అన్ని ధర్మములకు సారమైన అహింసా సత్యములను మనము పైకి లేవదీసితిమి. కాని వానికి మూలమైన బ్రహ్మవిద్య స్పృశింప బడకుండనే యుండి పోయినది. దానిని లేవదీయలేదు.

## బ్రహ్మవిద్యకు పునాది

చిన్నప్పటినుండి నా ప్రవృత్తి బ్రహ్మవిద్య వైపుగా ఉండెను. దానిలోటు నాకు అనుభవములోనికి వచ్చు చుండెను. బాపు నిర్గమించిన పిదప అది నాకు మిక్కిలి అనుభవము గాదొడగెను. ఈ పునాది మీదకు చేరనిచో పైపైనున్న వస్తువులు నిలువవని యిప్పుడు నామనస్సులో నిశ్చయముగలిగెను. కనీసము హిందూదేశములోనైతే దానితో కూడ ఒకదానిని కూడ ఉంచరాదు. ఒకదానితో నిలవనే నిలవవు. ఏలయన - హిందూదేశము తత్త్వజ్ఞానము గల భూమి. ఏసుక్రీస్తు "Love thy neighbour as thyse f"

"నిన్నువలె నీ యిరుగు పొరుగు వానిని ప్రేమింపుము" అని యింతమాత్రమె చెప్పి శాంతుడయ్యెను. ఆ తత్త్వజ్ఞానమును వారు విస్తరింపలేదు. వారు కేవలము 'Love thy neighbour' "నీ యిరుగు పొరుగు వానిని ప్రేమింపుము" అని గాని 'Love thyself' నిన్ను ప్రేమించుకొనుము" అని గాని యింతమాత్రము చెప్పినచో సరిపోయెడిది. కాని వారు "నిన్ను నీ వలెనే నీ ఇరుగు పొరుగు వానిని ప్రేమింపుము" అనికూడ చెప్పెను. ఇరుగు పొరుగు వానిని ప్రేమించుట ఒక వ్యావహారిక ధర్మము. అది మానవుని వికాసమునకు అవసరము. ఆనందానుభవమునకును అది ఆవశ్యకమె. కాని నిన్ను ప్రేమించుకొనునట్లు నీ యిరుగు పొరుగు వానిని ప్రేమింపుము అని చెప్పెను. బ్రహ్మవిద్యవఱకు మన బుద్ధి పోనంతవఱకు ఇది యసంభవమే.

తల్లి బహుశ పిల్లవానిని తనకంటె ఎక్కువగా ప్రేమించుచున్నది. కనీసము ఎక్కువగా గాకపోయినను తన యంతయైన ప్రేమించుచునే యున్నది. అయినను ఆమెకు బ్రహ్మవిద్యయొక్క యవసరము లేదు. ఏలయన-శరీరముతో శరీరము కలసియున్నది. కాని ఆత్మయొకటి యను విషయము తెలిసినగాని అంతవరకు చేరినగాని ఏసుక్రీస్తుయొక్క ఆ మాట సంభవముగాదు. "పక్కయింటివానిమీద ప్రేమ యుంచుము" అని యింతమాత్రము హిందూదేశములో ఎవడైన చెప్పగా ఎందుకు ప్రేమ యుంచవలెను? అని ప్రశ్న కలుగును. ప్రేమ యుంచవలెను అన్నచో ఈ సంగతి బుద్ధికి వచ్చుచున్నది. కాని ఎంతవరకు ప్రేమింప

[12]

వలెను? ఎందుకు ప్రేమయుంచవలెను? దీనికి కారణమేమి? అను ప్రశ్నలు బయలుదేరును. ఏలయనగా ఈ భూమి బ్రహ్మవిద్యగల భూమి. దానికి జవాబును గీత యిచ్చును. ఉపనిషత్తులు యిచ్చును.

నేడే నా దగ్గరకు ఒక పుస్తకము వచ్చినది. రాధాకృష్ణన్‌గారు ఇది ప్రేమ కానుకగా పంపిరి. పుస్తకము మొదట గాంధిజీని గుఱించి యొక వాక్యమున్నది. ఆ పుస్తకమును గాంధిజీకే వారు సమర్పించిరి. సెర్మన్ ఆన్ ది మౌంటు, 'కొండమీద ఏసుచేసిన యుపదేశము' అను వాక్యముగూడ నాకు ధైర్యమివ్వక పోయినచో గీత యిచ్చును. దీనికి కారణము మఱి వేఱేమియు కాదు. రెండును నేర్పిన జీవనధర్మము ఒకటే. కాని దానికి ఆధారమైన బ్రహ్మవిద్య గీతలో దొరకును.

అఖండ భావ ప్రవాహము ప్రవహించు గాక

కనుక ఈ సంగతి లోటు దీనిలో ఉండిపోయినదని నాకు తట్టినది. దానిని పూర్తి చేయకుండ మన యీ భావము అఖండ ప్రవాహముగా ప్రవహింపదు. ఇది యుత్తమ భావము గనుక ప్రపంచములోని సజ్జనులందఱకు ప్రేరణ యిచ్చునన్నది వేఱుసంగతి. కాని ప్రవహింపవలసిన యీ ప్రవాహము ప్రవహింపదు. దీని నిర్ణయము నా మనస్సులో గలినది. మఱి నాలో ఆశక్తి యున్నదో లేదో విచారింపకుండ నేను బ్రహ్మ విద్యా మందిరమును ప్రారంభించుటకు నిశ్చయించితిని. శక్తికంటె భక్తి శ్రేష్ఠమైనది. నాలో అంత

శక్తి ఉండకపోవచ్చును. కాని ఆ భావమును గురించిన భక్తి నాలో తప్పకుండ ఉన్నది. ఆ భక్తిమీద నమ్మకముతో ఇప్పుడు బ్రహ్మవిద్యామందిర స్థాపన జరుగుచున్నది. స్థానమును గుఱించి నాకు పట్టుదలలేదు. చోటు అవసరమైనచో మార్చవచ్చును. లేక మార్చక పోవచ్చును. ఇప్పుడు మాత్రము అది పరంధాములో పవనారులో ఉండును.

## మందిరము నడపించుపని స్త్రీల చేతిలో

ఈ యాశ్రమ స్థాపనలో వ్యవస్థయంతయు సోదరీమణుల చేతిలో ఉండవలయుననికూడ నాకు తోచినది. ఈ దాహముకూడ నామనస్సులో నున్నది. స్త్రీల సాధన ఎప్పుడును గుప్తముగానే యుండును. దాని ప్రభావము ఎవరో యొక వ్యక్తిమీద పడనేపడును. కాని ఆ సాధన ప్రకటమగుట చాల యవసరము. అది లేకుండ విశ్వశాంతి ఒంటిగా పురుషులు చేయజాలరు. బ్రహ్మవిద్యలో స్త్రీ పురుష భేదము ఉండదు. కావున దానిలో ఇద్దఱును ఉందురు.

ఇది యీ కాలపు వాంఛ. బుద్ధుడు అయితే స్త్రీకి మొదట స్థానమివ్వలేదు. ఇచ్చినను "నేను ఒక యపాయమును తెచ్చిపెట్టుకొనుచున్నాను" అని చెప్పి మఱి యిచ్చెను. కాని అది పూర్వకాలము. పురుషునితోపాటు స్త్రీకి స్థానమివ్వక పోయినచో అపాయమగునని నా నమ్మకము. దానిలో బ్రహ్మవిద్య అసంపూర్ణముగా నుండును. ఆ బ్రహ్మ ముక్కముక్కలుగా నగును. నేను స్త్రీలచేతికి మందిరము నడపు పని యిచ్చి ఆ బ్రహ్మమును తలక్రిందులుగా ముక్కలు చేయుటకు

పోవుటలేదు. కాలావసరమును బట్టి మందిరసంచాలనము స్త్రీల చేతిలో నున్నచో అది సురక్షితముగానే యుండును.

సహజముగానే యీ యాలోచనను మా అమ్మాయి రాజమ్మ దగ్గఱ వ్యక్తపఱచితిని. ఆ అమ్మాయి భావుకురాలు. ఆమెకు యీ యాశయము నచ్చినది. నచ్చకపోయినను నా కల్పనలో ఆశ్రమస్థాపన అయిపోయినదిగదా యని తలచితిని. "నాకీ సంగతి నచ్చినచో భూదాన యజ్ఞములో అయిదాఱు సంవత్సరములనుండి పనిచేయుచున్న సోదరీమణులను అడుగు" అని యంటిని. ఆమె వ్యక్తిగతసంపర్కమును కొంత యుత్తర ప్రత్యుత్తర వ్యవహారమును నడపెను. దానికి ఫలితముగా ఇక్కడికి అయిదాఱుగురు సోదరీమణులు వచ్చిరి.

## సహకారమునకు ప్రార్థన

ఈ పనిలో ఇవ్వగలిగినంత సహకారమును ఇవ్వవలెనని మిత్రులకు ప్రార్థన చేయుచున్నాను. అన్నిటికంటె పెద్దదైన సాయము బ్రహ్మపరిశీలనకు పునాదియయిన నా యాలోచన గూర్చి సంశోధన కావలసి యున్నది. సంశోధన అయినను కాకపోయినను మన జీవితము ఆ దిక్కుగా మరలుటకు ప్రయత్నము చేయవలెనని తెలిసికొందుముగాక! దేని వల్ల దీని బాహ్యాభారము ఎవరికైన దెలియునంతగా అవసరమైన సాయమును మన మిత్రులు చేయుదురుగాక।

కాశీలో మకాము, సీకర్

౧౩—౬—౫౯

# పరిశిష్టము

## నవయుగ నారీమణి

(ఆచార్య దాదా ధర్మాధికారి)

నేను పురుషుడనైనందువల్ల స్త్రీలసమస్యలను ప్రత్యక్షముగా అనుభవించుట నాకు సంభవముగాదు. ఈ విషయము మీద నే నెంతగా పరిశీలించినను నా జ్ఞానము పరోక్షముగానే యుండును. ఆత్మవిశ్వాసము యొక్క ఆధారము లేకపోవుట వలన అది అనుమాన ప్రమాణముమీదనే ఆధారపడి యుండును. కనుక సాధారణముగా నేను బాలుర యెదుట ఆత్మవిశ్వాసముతో మాటాడినట్లు బాలికల యెదుట మాటాడలేను. బాలికల సభలో మాటాడునప్పుడు నాకు కొంచెము సంకోచమే గలుగును. అయినను బాల బాలికల యొక్క స్త్రీ పురుషుల యొక్క భూమిక సమానముగానే యుండవలెనను ఈ సిద్ధాంతము మీద నేను కొన్ని భావములను వ్యక్తము చేయగలను. స్త్రీలు పురుషులతో సమానము గనె కాకుండ వారికంటె శ్రేష్ఠమైన భూమికను పొందుట కేమి చేయువలసి యుండునో కూడ చెప్పగలను.

బహుశా నేను పురుషుడనుగా ఈ సంగతి చాల బాగుగా చెప్పగలను. ఏ లోటువలన స్త్రీ నేటిదాక పురుషులతో సమాన స్థానమును పొందలేకపోయెనో ఆ లోటును గుఱించిన జ్ఞానము స్త్రీలకంటె పురుషులకు ఎక్కువగా నుండుట సంభవము.

నేడు మీలో కొందఱకు ప్రమాణ పత్రములు వచ్చినవి. వారిని స్నాతకురాండ్రు అందురు. పూర్వకాలములో 'స్నాతక' పదము కేవలము బాలురకే యుండెడిది. ఏలయన- బ్రహ్మచర్యము కేవలము బాలురకే విధింపబడినది. పండ్రెండు సంవత్సరములు గురుగృహమున ఉండి అనేక విద్యలను కళలను అధ్యయనము చేసి బ్రహ్మచారి విద్యా వినయ సంపన్నుడై అవభృథస్నానము చేసి తిరుగ గృహస్థాశ్రమములో ప్రవేశించును. అవభృథ స్నానము చేసినవాడే స్నాతకుడు అనగా గృహస్థాశ్రమమునకు తగిన వ్యక్తిగా పరిగణింపబడుచుండెను. కాని ఆ రోజులలో బాలికలకు ఉపనయనముగాని నేడువలె వారి కేశిక్షణముగాని ఇవ్వబడుచుండుట లేదు. వారికి బ్రహ్మచర్యము లేక స్నాతక శబ్దము ఉపయోగింపబడక పోవుట కిదే కారణము. బాలికకు యుక్తవయస్సు రాగానే 'స్నాతకురాలు'గా తలపబడు చుండెడిది. ఆమె గృహస్థాశ్రమములో ప్రవేశించుటకు మాత్రు పదమును పొందుటకు యోగ్యురాలని తలంపబడుచుండెడిది. పతిగృహ ప్రవేశమే గురుగృహ ప్రవేశముగాను, ఋతుస్నానమే ఆమెకు స్నాతకవ్రతముగాను తలపబడుచుండెను.

ప్రాచీనకాలములో స్త్రీలకు ఉపనయనము లేక వ్రతబంధము లేకపోవుటవలన వారికి వేదాధ్యయనమునకును వైదిక కర్మకును అధికారమే లేదు. వారికి మనువు మంత్రయుక్త విధానమును నిషేధించెను. పండితులు(పురోహితులు) స్త్రీలచే అభిషేకము చేయవలసి వచ్చినపుడు వారిచే రుద్రపాఠము చేయింపక మహిమ్నస్తోత్రపాఠమే చేయించు

చుండుటను మనము నేడును జూచుచున్నాము. అనగా నేడు కూడ మన ధర్మవిధానములో స్త్రీలకు వేదాధ్యయనాధికారము ప్రాప్తము కాలేదు. నేడుకూడ వారికి వేదాధ్యయన సంస్కారము చేయబడక పోవుట కిదే కారణము. వారికి గురు గృహ నివాసమును లేదు. అవభృథ స్నానమును లేదు.

నేడు మనము వేలు వేలు విద్యాలయములలోను విద్యాపీఠములలోను స్త్రీ శిక్షణ విషయములో ఏ యుపక్రమమును చేయుచున్నామో అది ఒక యుగప్రవర్తక కార్యము. ప్రాచీన వాఙ్మయములో దీనికి విశేషమైన సంకేతమేదియు లేదు. శిక్షణ కార్య సంబంధముగా మాతగా పురుషులకంటె స్త్రీ వేయిరెట్లు శ్రేష్ఠురాలని యొప్పుకొనబడినది. మనువు ఒకచోట "పదిమంది యుపాధ్యాయులకంటె ఒక ఆచార్యుడు శ్రేష్ఠుడు, నూరుగురు ఆచార్యులకంటె తండ్రి శ్రేష్ఠుడు. వేయిమంది తండ్రులకంటె గురువుగా తల్లి శ్రేష్ఠురాలు" అని చెప్పెను. కాని ప్రత్యక్ష జీవనములో ఈ విషయమునకు స్పష్టమైన ప్రమాణమును ఏ చిహ్నమును మనువు యుగములోగాని తరువాత యుగములోగాని ఎక్కడను కనిపింపదు. స్మృతులలోగాని దీనికి 'లింగము' ఎక్కడను కనుపట్టదు. లింగమనగా చిహ్నము లేక సూచక సంకేతము. స్మృతులలో ఎక్కడనైన ఒకటో అరో వాక్యము ఉన్నచో దానికి సంకేతము శ్రుతులలో ఎక్కడో అక్కడ కనిపింపవచ్చును గదా! తప్పకుండనే దానికి పూర్వము శ్రుతులలో గార్గి, మైత్రేయివంటి విదుషీమణులు వ్రేళ్ళమీద లెక్కపెట్ట దగినంతమంది చెల్లాచెదురుగా ఉదాహరణములు కని

పించుచున్నవి. అయినను స్త్రీ ఆచార్యురాలైన సంగతి ఎక్కడను వ్రాయబడినది దొరకదు. స్త్రీలకు గురుకులములే లేనప్పుడు ఇంక స్త్రీ ఆచార్యురాలగుట యెట్లు సంభవించును?

నేడు మనము స్త్రీల భూమికలో క్రాంతి కలిగింప గోరుచున్నాము. గురువుగా స్త్రీ పురుషుల కంటె వేయిరెట్లు శ్రేష్ఠురాలు అను ఆధునిక శిక్షణ శాస్త్రమునకు ఇదియొక మహనీయమైన ప్రమేయ విషయము. దీని ప్రత్యక్ష ప్రయోగము మనకు ప్రగతిశీలమైన రాష్ట్రములలో గనిపించును. క్రాంతికారియైన రాష్ట్రములలో అగ్రగణ్యమని తలపబడు రష్యాలో శిక్షకులకంటె శిక్షికల యోగ్యత అధికమని మన్నింపబడుచుండెను. శిక్షణ క్షేత్రములో ఈ ప్రమేయము యొక్క ప్రయోగము నిష్ఠతో కానంతవఱకు మనము సమాజములో విలువలలో మార్పు గలిగింపలేము. కనుకనే ఏ యర్థములో బాలుర విషయములో స్నాతకశబ్దము రూఢమై పోయినదో ఆ యర్థములో ఇప్పుడు బాలికలకు కూడ శిక్షణములోను జీవనములోను ప్రయోగింపబడవలెను.

'ఒకరినొకరు ఉద్ధరించలేరు' అన్నది ఉత్క్రాంతిక లేక వికాసమునకు మూలభూతమైన సిద్ధాంతము. హరిజనులను సవర్ణులు ఉద్ధరింపలేదు. కనుక హరిజన సేవను గురించి ఆందోళనము చేయునపుడు "అస్పృశ్యతా నివారణము హరిజనులను ఉద్ధరించుటకుగాదు. అది సవర్ణులను ఉద్ధరించుటకే" అని బాపు చెప్పుచుండెడివారు. 'అస్పృశ్యభావన' వలన సవర్ణులు అధఃపతనము పొందిరి. కనుక ఆత్మశుద్ధికై వారు హరిజన సేవ చేయవలెను. హరిజనులను హరిజనులే ఉద్ధరింప

గలరు. "మనలను మనమె యుద్ధరించుకొనగలము" అనునది బాధలేని సిద్ధాంతము.

ఇదే న్యాయము స్త్రీలకును వర్తించును. పురుషుడు స్త్రీని పరాధీనురాలినిగా నుంచెను. వికాసము కానీయలేదు. ఈ పాపమునకు అతడు ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. కాని అది తన కల్యాణమునకే. అని తన్ను ఉద్ధరించుకొనుటకే అగును. స్త్రీలమీాద దయగాను, కృపగాని, కరుణగాని గాదు. స్త్రీల యుద్ధరణ పురుషుడు చేయలేడు. అదిమాత్రము స్వాయముగా ఆమెయే చేసికొనవలసి యున్నది. ఇతరుని చావు వలన మనకు స్వర్గము దొరకదు.

నేడు ఈ యువతులు స్నాతకురాండ్రయి జీవనములోని విశాల క్షేత్రములో వాస్తవిక సంసారములో ప్రవేశించుచున్నారు.

నేడే పత్రికలలో శ్రీమతి సుచేతా కృపలానిని గురించి ఒక వార్త ప్రకటింపబడినది. దానిని చదువగా నా మనస్సు స్వాస్థ్యముతప్పి విచార వ్యగ్రమైపోయినది. మనస్సులో ఆలోచనల విపత్తి వ్యాపించెను. ఆ వార్త మన సమాజములో స్త్రీల ప్రస్తుత భూమికను ఉత్తేజపఱచెడి ప్రతిబింబము. నవఖాలీ దుండగులు సుచేతను ఎత్తుకొనిపోవుటకు కుట్రపన్నిరట. సుచేత ఏమి మామూలు స్త్రీకాదు. ఆమె కూడ కాంగ్రెసు ప్రధాన మంత్రిణి కాగలదు. రాష్ట్రీయమునకు అధ్యక్షురాలు కాగలదు. ముఖ్యమంత్రిణి కాగలదు. కేంద్రీయ మంత్రులలో ఒకతె కాగలదు. ఒకప్పుడు జవహర్‌లాల్‌వలె రేపు ఆమె కేంద్రీయ మంత్రిమండలములో

ప్రధానమంత్రినికూడ కాగలదు. లేక భారతీయ లోకతంత్రము నకు అధ్యక్షురాలు కాగలదు. ఏ విశ్వవిద్యాలయమునకైనను తగిన యోగ్యత నిశ్చయముగా ఆమెలో వున్నది. ఇట్టి స్త్రీ సంబంధములో ఈ వార్తయా? ఈ వార్త మనకు క్రోధము వచ్చునంతవరకు పూర్తి బాధయున్నది అయినది. అయినను ఇది కొంచెముకూడ అసహజముగాని, విలక్షణము గాని కాదు. ఈ వస్తువు స్త్రీల వర్తమాన స్థితిని ద్యోతకము చేయుచున్నది.

"అరే దీనిలో ఏమి విలక్షణ విషయమున్నది? సరిహద్దు ప్రాంతములో స్త్రీలను వలెనే పురుషులనుకూడ ఎత్తుకొని పోవుదురు. గొప్ప గొప్ప పురుషులనైనను ఎత్తుకొని పోదురు. మఱి మీరు సుచేత కృపలానీయొక్క యుదాహరణము ద్వారా స్త్రీల విషయములో ఇంత విపరీతమైన యనుమానము ఎందుకు బయలుదేఱి దీయుదురు?" అని కొందఱు అనవచ్చును. ఆక్షేపము సరేకాని దానిలో ఆలోచనల గందరగోళము ఉన్నది. సరిహద్దు ప్రాంతములో పురుషులను ఎత్తుకొని పోవుదురు. ఇది నిజమె. కాని ఏ పురుషులను? ధనికులైన పురుషులనేగదా? స్త్రీల విషయములో ఇట్టిస్థితి లేదు. కేవలము అధికారముగల లేక ధనికురాండ్రైన స్త్రీలను మాత్రమే ఎత్తుకొనిపోదురను విషయము లేదు. ప్రతి స్త్రీని ఎత్తుకొనిపోవు భయము ఉండుచునే ఉండును. స్త్రీ ధనవంతురాలుగాదు. ధనమువంటిది. ద్రవ్యము, ధనము, గోధనములవలె స్త్రీకూడా ఒకరకమైన ధనమే. ఈ భయానక

స్థితినై పుగా మీ దృష్టిని మరలింప గోరుచున్నాను. మీకు కూడ అది అసహ్యముగా తోచవలసి యున్నది.

స్త్రీకి శ్రీకి (సంపదకు) మధ్య అభేదము ఉన్నంత వఱకు స్త్రీయొక్క పాత్ర శ్రీ నుండి వేఱుగా ఉండలేదు. మహాభారతములో భీష్ముడు స్త్రీని శ్రీ యనెను. మనువు గూడ వారిని 'గృహసంపద'గాను'గృహశోభ'గాను చెప్పెను. శ్రీ శబ్దము యొక్కయు స్త్రీశబ్దముయొక్కయు ఉచ్చారణలో సామ్యము ఉండనే యున్నది. మహాభారతములో ద్రౌపదిని దుర్యోధనుడు సభలోనికి రమ్మని పిలిపించెను. ఈ ప్రసంగమును మోరోపంతు వర్ణించెను. ఆ మాతతో ద్రౌపది చెప్పెను. "శ్రీహ్మాణ, నచ స్త్రీ హ్మాణ" అనగా "అరే! వారు శ్రీని కోరియుండవచ్చును. స్త్రీని కాదు" అని. కాని సమాజములో స్త్రీ యొక్క శ్రీ యొక్క యుచ్చారణలోనే కాదు, అర్థములోను గూడ భేదములేదు. విదర్భలో స్త్రీని 'లక్ష్మి' యనెడి యాచారమున్నది. 'స్త్రీల పెట్టె' లక్ష్మి పెట్టె యనబడును. మంచిదే. సాహిత్యములోను, పురాణములలోను లక్ష్మి విష్ణు పత్ని కావచ్చును. కాని ప్రత్యక్ష వ్యవహారములోనైతే ఆమె జడసంపదగనే తలపబడుచున్నది. లక్ష్మి శబ్దము ధనమును సంపదను ద్యోతకముచేయు పదము. మహాభారతములో అనుశాసన పర్వములో భీష్మాచార్యుడు దొంగిలించుకొనిపోవు వస్తువుల పట్టికను ఇచ్చెను. ఆ పట్టికలో స్త్రీ కూడ ఉన్నది. స్త్రీల ప్రశ్న లన్నిటిలోను ఇదియొక 'యక్షప్రశ్న'గా నాకు తోచుచున్నది. ఇదేగనుక విడి

పోనిచో మిగతా అన్ని ప్రశ్నలు విడిపోయినను వారి సాంఘిక భూమిక ఏమాత్రమును మాఱజాలదు.

ఈ వస్తుస్థితియొక్క పరిణామము మన భావనలమీద, ఆలోచనలమీద, సంస్కారములమీద పడినది. స్త్రీ విశ్వాసమునకు పాత్రురాలుగాదు. మీరు నా యీ మాటకు తప్పు అర్థమును చేయకుడు. స్త్రీ మిథ్య అని, కపటురాలు అని నేను చెప్పుటలేదు. ఆమె ఎల్లప్పుడును ప్రామాణికురాలు, సతనిమరాలు కావచ్చును. పూర్తిగా పురుషుల వలె ఆమె సత్యవాదిని సదాచారిణి కావచ్చును. అయినను ఆమె విశ్వాసపాత్రురాలు కాదు. నా వాక్యములోని యర్థము బహుశా ఇంగ్లీషులోని అన్‌రిలయబుల్ (Unreliable) శబ్దముకంటె మిగుల స్పష్టము కావచ్చును. అన్‌రిలయబుల్ యొక్క యర్థము డిజానెస్టీ (Dishonesty) అగౌరవనీయురాలు కాదు. అన్ని విధముల ఆనెస్టు (Honest) గౌరవనీయురాలైన వ్యక్తి కూడ అన్‌రిలయబుల్ కావచ్చును. ఉదాహరణకు చిన్న పిల్లవాడు లేక ముసలివాడు అన్నివిధముల ప్రామాణికుడు కావచ్చును. కాని శరీర పరిశ్రమకార్యములో మనము వాని మీద ఆధారపడి యుండలేము. స్త్రీ రక్షణీయురాలు అయిన కారణముచేత ఆమెను ఆమె విశ్వాసముమీద వదలి పెట్టలేము. ఈదృష్టితో చూచినచో ఆమె అవిశ్వాసనీయురాలు కాకపోయినను ఆమె తన విశ్వాసమునకు పాత్రురాలుకాదు. ఆమె విషయములో మనము నిశ్చింతగా నుండలేము. ఏలయన - ఆమె నిర్భయురాలు కాదు గదా.

'సోదరా! స్త్రీకున్న దౌర్బల్యము సహజము అను సంగతి తప్పదుగదా' అని మీరు అందురు. నేనెక్కువ వివాదములో పడవలయునని కోరను. కాని 'స్త్రీది ఈ స్వభావము గాదు. పరంపరగా వచ్చుచున్న సంస్కారమె' అని మాత్రమె చెప్పుదును. ఈ విషయములో ప్రకృతిపైని దోషము పడవేయుట తప్పు. శరీర ధర్మము దుర్బలమైనప్పటికిని అది మనో ధర్మము కానీయరాదు- అనికూడ తప్పక చెప్పవలయు నను కొనుచున్నాను. మనస్సు బలహీనమైనది కాకపోయినచో చాలును. ఈ విషయములో స్త్రీలు పురుషులను ఓడింపగలరు. మనస్సు దుర్బలముగానున్న వారికి యున్నతి కలుగుట యసంభవము. దుర్బలమైన మనస్సులో కోమల భావనలు కూడ ఉండజాలవు. బలహీనమైన మనస్సులో కరుణ ఇముడ జాలదు. "క్షీణాజనాః నిష్కరుణాభవంతి" "బలహీనులైన వారు కరుణ లేనివారై యుందురు" అను వాక్యము పదియారు అణాల సత్యము.

'స్త్రీల మనస్సు కోమలముగా నుండును' అనుదానికి అది బలహీనముగా నుండును అని యర్థము చెప్పబడుచున్నది. కాని కోమల పదమునకు అర్థము దుర్బలత్వముకాదు. 'నాజూకైన' దనగా బలహీనమైనది అని యర్థముగాదు. కాని స్త్రీలు 'భీరువు'లనబడిరి, కనుక వారిలో చంచలత్వము ఉండునని కల్పింపబడినది. 'కామినికూడ లక్ష్మివలె చంచలగా నుండును' అని యన్నిచోట్ల తలపబడుచున్నది. దశరథునివంటి చక్రవర్తికూడ కైకేయి యొక్క పట్టుదలకు లొంగిపోయెను. అప్పుడు వాల్మీకి "అనిత్యహృదయాహితాః" అనగా" స్త్రీలు

అస్థిరవృత్తి గలవారు" అనెను. Frailty! thy name is woman; 'ఓ చంచలతా! నీ పేరు స్త్రీ' అను వాక్యములో షేక్స్పియరు కూడ వాల్మీకి పైవాక్యమునకు అనువాదము చేసెనా అన్నట్లున్నది. ప్రాచీనులైన సుభాషితకారులు కూడ ఇంతకంటెను ముందుకుపోయిరి. "పురుషుల భాగ్యములవలె స్త్రీల చరిత్రము దేవతలుగూడ తెలుసుకొనలేరు. ఇంక మానవుని సంగతి పామరుని సంగతి లెక్కయేల" అన్నంత వఱకు వారు చెప్పివైచిరి.

స్త్రీల విషయములో "వారి పిఱికితనమె" ఇట్టి ధారణ గలుగుటకు ముఖ్యమైన కారణము. భీతికి నీతికి, భీతికి ప్రీతికి, ఆనపకాయకు కత్తికి వంటి వంకరయున్నది. ఇందువలన వాస్తవిక నీతికి, వాస్తవిక ప్రీతికి స్త్రీ జీవనములో స్థానమె లేకుండ పోయినది. నవలలలోను కథలలోనుగల ప్రేమ వేఱు. స్వాధీనము సమృద్ధము అయిన జీవనమున కెట్టి ప్రేమ యవసరమో అది వేఱు.

సిగ్గు, పిఱికితనము ఈ రెండు స్త్రీలకు అలంకారములుగా అంగీకరింపబడినవి. కనుక వారు ప్రపంచములో బహిరంగముగ బ్రతుకనైన బ్రతుకలేక పోవుచున్నారు. వారు జన్మ అంతయు సిగ్గుపడుచునే జీవించుచున్నారు. భయపడుచు భయపడుచునే జీవించుచున్నారు. వారికి జీవించుటలో గూడ సిగ్గు కలుగుచున్నది. "మేము బ్రతుకుచున్నాము" అని చెప్పుటకై ప్రపంచము ముందు క్షమా ప్రార్థన చేయుచున్నారా? అన్నట్లు పాపము వారు జీవనము గడుపుచున్నారు.

స్త్రీ జీవనములోని ఈ మూలములోగల ప్రశ్నను మీయందఱ దృష్టిలోనికి తీసికొని రావలెనని కోరుచున్నాను. సమాజములో కేవలము స్త్రీ సురక్షితురాలైనంత మాత్రము చేత ఆ సమస్య తీఱిపోదు. ఆమె పురుషులతో సమానము యొక్క భూమికను పొందజాలదు. పురుషులద్వారా స్త్రీ రక్షణ చేయవచ్చును. దుష్టపురుషు లందఱను వశింపచేసినచో సురక్షితురాండ్రు కాగలరు. అప్పుడు పురుషులవల్ల భయము కలుగదు. కాని యింత మాత్రము వలన వారు స్వతంత్రులు ఎన్నటికిని కారు. స్త్రీ స్వరక్షిత (తనచే రక్షించుకొన బడినది) కానంతవరకు నిజమైన యర్థములో ఆమె సురక్షితురాలు కానేరదు. గ్రామములోని దుష్టులగు గుండాలకు ప్రతీకారము చేయు క్షమత్వము వారిలో లేనంతవఱకు స్త్రీ జీవనము సురక్షితము, స్వతంత్రము కానేరదు. స్వరక్షితురాలు కాని స్త్రీ సురక్షిరాలుకూడ కాజాలదు. గడచిన ప్రపంచయుద్ధములో చాలమంది స్త్రీలు యుద్ధములో అద్భుతమైన శౌర్యము చూపిరి. విలక్షణమైన ధైర్యసాహసములతో గూడిన కార్యములను జేసిరి. కాని ఇంతచేసినను ఆ రాష్ట్రములలో స్త్రీ సురక్షణను గూర్చిన ప్రశ్న మిగిలియే పోయెను. శత్రువుల, నుండి రక్షింపదగిన వస్తువులలో స్త్రీలను లెక్కపెట్టుటకూడ జరుగుచుండెను. అంత గొప్ప వీరురాలు ఝాన్సీ లక్ష్మిబాయి కూడ సమరరంగములో పరాకాష్టము జూపించిన ఆమెకూడ చివరకు తన శరీర రక్షకై అగ్నిశరణు చొచ్చవలసి వచ్చినది. స్త్రీల ప్రతిష్ఠ, వారి గౌరవము, వారి శీలము ఈ విధముగా శరీరనిష్ఠగా తయారయిపోయెను.

ఇంకొక యుద్ధములో గత మహాయుద్ధమునందు స్త్రీల శరీరనిష్ఠకు ప్రమాణము లభించినది. శత్రుపక్షములో రహస్యముగ భేదములు కలిగించుటకై స్త్రీలు గూఢచారుల పనిని నెఱవేర్చ నియోగింపబడిరి. మోహినులగు స్త్రీలు శత్రువుల దగ్గఱకు పంపబడిరి. ఈవిధముగా పురుషుల మనస్సులో నున్న స్త్రీ శరీర విషయక కామమువల్ల లాభము పొందబడెను. "ఈ స్త్రీలు తమ దేశహితమునకై తమ శీలమునుగూడ అమ్మివైచిరి." అని కొందఱు చెప్పుదురు. కాని స్త్రీలు పురుషుల కామముకొఱకు తమ శరీరమును దురుపయోగము చేసిరని నాకు తోచుచున్నది. చివరకు మునుల విషయములో అప్సర స్త్రీలు ఏమి చేసిరి? ఇది "సౌందర్యవ్యాపారము" అనబడును. ఈ విధముగా తన శరీరమును ఉపయోగించుట ఏ స్త్రీకిని అలంకారము గాదు. దానిలో స్త్రీ శరీరము యొక్క యవహేళనము, మానవతకు అవమానముగాక మఱేమి ?

స్త్రీని 'ప్రేమజీవిని' అందురు. ఆమె హృదయము 'ప్రేమ యొక్క యఖండ ప్రవాహము' అనబడుచున్నది. "దుర్బలమైన మనస్సులో ప్రేమ యుండనే యుండదు" అని మిక్కిలి వినయముతో చెప్పగోరుచున్నాను. నేడు స్త్రీల యొక్క ప్రేమ అనబడునది ప్రేమ కాదు, నిష్ఠ. ఒక దాసుని చిత్తములో తన యజమానిని గుఱించి అచలమైన నిష్ఠ యుండును పూర్వకాలములో మర్యాదగల నౌకరుల స్వామి భక్తి ప్రసిద్ధమై యుండెడిది. కాని అది నిష్ఠయేకాని భక్తి గాని, ప్రేమగాని కాదు. పతి నిష్ఠ యనగా పతిప్రేమ గాదు.

పాతివ్రత్యము వేఱు - ప్రేమ వేఱు. దాసుని మనస్సులో నిష్ఠ యున్నప్పుడు ప్రేమ యుండవలసిన పనిలేదు. ప్రేమ విషయములో సమాన సంబంధము ఉండవలెను. దాసిలో భయము యొక్క కణము గూడ ఉండరాదు. "వినా భయ హో యనప్రీత్" "భయము లేనిదే ప్రీతి యుండదు" అని లోకులు అందురు. కాని వాస్తవికస్థితి దీనికి విపరీతము. భయము, ప్రేమయు ఒకచోట నుండవు. పురుషునివల్ల స్త్రీకి భయము ఉన్నంతవఱకు ఆమె వానిని నిజమైన హృదయముతో ప్రేమింపలేదు.

కనుక నేను బాలికలకు చెప్పు మొదటి సలహా ఏమనగా వారు భయము వదలిపెట్టవలయునని. ఎవనివల్ల భయము కలుగునో వానిని ఎవరును ఇష్టపడరు. బాలుడెప్పుడును మాష్టరును ఇష్టపడడు. కఠోరమైన స్వభావముగల తండ్రి తమ యింటిలో నుండవలెనని బాలకు లెన్నడును ఇష్టపడరు. పతి పేరువినగానే భయపడు స్త్రీ ఎపుడును తన భర్త అతని పనిలో ఉండవలెననియె కోరును. పోలీసులతో కలిసి యుండుట మనకు నచ్చదు. ఇతరులవలన భయము కలిగి నప్పుడే పోలీసుయొక్క అవసరము వచ్చును. ఇట్లే స్త్రీకూడ ఇతర పురుషులనుండి తాను రక్షణ పొందుటకు ఎవరోయొక పురుషుని ఆశ్రయించును. అతనికి ఆమె తన సర్వస్వమును అర్పించివైచును. ఈ సర్వస్వదానమును బాగుగా నిష్ఠ అన వచ్చునుకాని, సమాన భూమికపైని సమాన సంబంధముగా చూపు ప్రేమ మాత్రము గాదు. సింహమునుండి భయపడు చున్నంతవఱకు దానితో కలిసి మెలసి యుండలేము.

సింహము మేకపిల్లవలె తిన్నదైనప్పుడే మనము దాని యొంటిపైని చేయివేసి నిమరగలము. దానితో స్నేహము చేయగలము. పురుషుల భయమును వదలిపెట్టిన రోజుననే స్త్రీ పురుషుని వాస్తవముగా ప్రేమింపగలదు. బలముగల మనస్సే, బలముగల హృదయమె ప్రేమకు పాత్రము కాగలదు.

ఇంత ఎక్కువ వివేచన చెప్పినప్పుడే నేను స్త్రీ జీవనముయొక్క మూలమైన సమస్యను ఉల్లేఖించితిని. ఈ యుల్లేఖము కొంచెము విస్తరమైనది. కొంత యెక్కువయైన కథయైనది. కాని అది యుల్లేఖమె. స్త్రీ స్వరక్షితురాలు కావలసి యున్నది. ఆమె లజ్జను, భయమును వదలిపెట్టి దానిని ఇట్లు ఋడతపెట్టి శిక్షణతో కలపవలయును. ఇది యాధునికమైన స్త్రీ శిక్షకు ఆధారభూతమైన సిద్ధాంతము. ఈ మానసిక క్రాంతి మంచి శిక్షణవలననే కాగలదు.

శిక్షణ పద్ధతికి సంబంధించిన యితర సమస్యలు స్త్రీ పురుషు లిద్దఱకు సామాన్యమె. నేడు నేను వానిని బాగుగా సరాసరిగా ఉల్లేఖింపగలను. శిక్షణలో సామంజస్యము, అనుబంధము ఉండవలెనని నేటి శిక్షణశాస్త్రము చెప్పుచున్నది. శిక్షణలోని విభిన్నవిషయములపైని పరస్పర సంబంధమె సామంజస్యము. మఱి సమస్త శిక్షణకు జీవితము సంబంధించి యుండుటయే అనుబంధము.

పూర్వకాలములో పాఖండవాదులు ఉండెడివారు. ఇప్పుడో ఖండవాదులు ఉన్నారు. జీవనమును అనేక ఖండములుగా చేసి వారికై పాఠ్యక్రమము ఏర్పాటు చేయబడెను.

జీవనములోని ఒక వ్యాపారమునకు ఇంకొక వ్యాపారముతో ఏ సంబంధమును లేదు. 'Work while you work, play while you play' ఆడుకొను సమయములో కేవలము ఆడుకొనుము, పనిచేయు సమయములో కేవలము పనిచేయుము. ఆటలో పనియు, పనిలో ఆటయు కారాదు. శ్రమలో ఆనందము, ఆనందములో శ్రమ ఉండరాదు. ఈ విధముగా అసమంజసమైన ఏకాంగి దర్శనము జీవితమును కలుషితమొనర్పదొడగుచున్నది. కనుక కొందఱు శిక్షణవేత్తలు "శిక్షణములో మాధుర్యమును తీసికొనిరండు" అను క్రొత్త నినాదమును బయలుదేఱదీసిరి. కాని శిక్షణము కేవలము ఆనందమయ మగుటవలన పని నడవదు. అది జీవనమునకు ఉపయోగి కూడ కావలయును. ఇంతవఱకు అది ఎట్టిని ఇటుక భవనములలో రాతి భవనములలో లభించుచుండెను. ఇప్పుడు క్రీడాంగణములో దొరక దొడగినది. కాని భావి కాలములో దాని సంబంధము జీవితములోని అన్ని క్షేత్రములలోను ఉండవలెను. ఇందుకై 'Polytechnisation' వివిధ విద్యా శిక్షణము అను నొక కఠినమైన సుందరమైన శబ్దము ప్రయోగింపబడుచున్నది. సారాంశ మేమనగా—సామాజిక పరిస్థితితోను ప్రగతితోను శిక్షణకు ప్రత్యక్ష సంబంధము ఉండవలయును.

శిక్షణకు సామంజస్యము అనుబంధములే కాకుండ ఇంకొక మూడవ సిద్ధాంతముకూడ నున్నది. ఇంగ్లీషులో దానిని Culture అందురు. దానిని మనము 'వినయ'మని యందుము.

వినయము అనగా 'సదభిరుచి.' అది మానవుని రుచినిబట్టి అరుచినిబట్టి వ్యవహారమునుబట్టి వ్యక్తమగుచున్నది. మన ప్రాచీన సాహిత్యములో విద్యకు వినయమునకు విడదీయరాని సంబంధ మంగీకరింపబడినది. మానవుని యభిరుచి యెట్టిదో అతని కూర్చుండుట, లేచుట, మాట, నడక, చూచుట, వినుట మొదలగు జీవితములోని వ్యవహారము లన్నిటివల్ల వ్యక్తమగు చుండును. సంస్కృతి యనబడెడి దాని యొక్క మూల్యములలో ముఖ్యముగా రెండు గుణములు సమావేశమయి యున్నవి. అందులో ఒకటి సుసంస్కృతమైన యభిరుచి. రెండవది సంతులన (బేలెన్సు). పోలిక లేక తారతమ్యము. వినయము లేని విద్యలో సంతులన యుండదు. మానవుని మనోరంజన ములో గూడ - కాదు - వాని మనోరంజనములోనే ముఖ్య ముగా వాని అభిరుచి వ్యక్తమగుచున్నది. ఇతర జీవులకు కష్టమిచ్చెడి మనోరంజనము సదభిరుచి లేనిదై యగుచు నుండును. బాలుడు కప్పలమీద రాళ్ళురువ్వుచు వాని ప్రాణములు తీయుచున్నచో ఆ యాట అసురమని అంగీక రింపబడుచున్నది. ఏ యాటలో ఇతరుల సుఖమును గుఱించిన యాలోచన యున్నదో అదే సుసంస్కృతమైనదని సదభిరు చితో గూడినదని చెప్పబడును. ఈ వినయశీలత్వమె సమాజ శాస్త్రము యొక్క భాషలో 'సామాజికత' అనబడును. శిక్షణ వల్ల ఈ సామాజికత పెరుగవలయును. జీవనములోని ప్రతి యొక వ్యవహారములోను మనకు ఇతరులతోపాటు పనిచేయు నట్టి కళ ప్రాప్తింప వలయును. స్త్రీ పురుషుల పరస్పర వ్యవ

హారములో గూడ ఈ కళ వ్యక్తము కావలయును. జీవన వ్యాప్తియైన సదభిరుచికి ఇదే గీటురాయి.

పురుషులతోపాటు నిర్భయురాలయి యుండుటకు స్త్రీకి తన యెముకలలో పట్టిపోయిన తప్పు భావములన్నియు ఆమె త్యజించి వేయవలెను. స్త్రీ శరీరము గాజుపాత్ర వంటిది. కనుక దాని గౌరవము కరకరమని విఱిగిపోయెడి సన్నని యెముక వంటిది అనునది ఈ తప్పు భావనలలో ఒకటి. వారు ఈ భావమునే గనుక పట్టుకొని యున్నచో గాజు పాత్రవలె అది వ్యవహరింపబడును. వారి జీవనమువీాద 'Glass with care' 'ఇది గాజు-జాగ్రత్త' అని ముఖమువీాద ఒక లేబిలు అంటించవలసి యుండును. గాజుపాత్రలు ఇతర పాత్రలతోపాటు ఎన్నడును ఉంచబడవు. పైగా అవి ఒక దానితో ఒకదానిని గూడ ఉంచరాదు. ఒకదానితోగూడ ఒకదానిని ఉంచవలసి వచ్చినచో వాని మధ్యదూదిగాని కాగితములు లేక పొల్లుగాని నింపవలసి వచ్చును. స్త్రీల మనస్సులో ఇటువంటి తప్పులు, పనికిమాలిన విషయములు ఉన్నంతవఱకు స్త్రీల మధ్యకూడ పరస్పర మైత్రి ఉండదు. వారిలో గూడ పరస్పరము అవిశ్వాసమె యుండును. మధ్య మధ్య పొల్లు నింపవలసి యుండును. పురుషులలో మాత్సర్యము ప్రసిద్ధము గాదు కాని స్త్రీలలో మాత్సర్యము, సవతి ప్రేమ యుండుట కిదే కారణము. పురుషులు తమ స్నేహితులకై భార్య నగలు అమ్మిన కథలు వినబడుచున్నవి. కాని ఎక్కడా స్త్రీలు తమ స్నేహితురాండ్రకై భర్తయొక్క బంగారు కడియాలో, గడియారములో అమ్మిన కథలు విన

బడుటలేదు. స్త్రీ ప్రేమ తన కుటుంబపు ఒక హద్దులో మాత్రమే తన చమత్కారమును చూపించును. ఇప్పుడు సమాజముయొక్క వ్యాపక క్షేత్రములో వారి తేజస్సు మాధుర్యము, ప్రస్ఫుటము గావలయును. ఆ ప్రేమయొక్క ఆధిక్యమువలన నిరపేక్షత వలన మన సామాజిక జీవనము ఉన్నతమును ఉదాత్తమును కావలయును. ఇందుకు "భీరుత అనునది స్త్రీలకు భూషణముగాదు దూషణమె" అనునది బాలికల హృదయములలో అంకితము కావలయును.

"భీరుతవలెనే లజ్జకూడ స్త్రీకి ఒక గుణము" అను భ్రమకూడ లోకులలో వ్యాపించియున్నది. నిజమునకు లజ్జ గుణముగాదు సరిగదా దోషమే. భయమువలె అదికూడ చాల పెద్ద దుర్గుణమె. వారి విషయములో మర్యాద నియమముల యర్థములోనే భయము లజ్జయు చెప్పబడెను. ఇక్కడ భయ శబ్దముయొక్క యర్థము మర్యాదయు, లజ్జా శబ్దముయొక్క అర్థము తారతమ్యమునై యున్నవి. శిష్టాచారము యొక్క, నమ్రతయొక్క హద్దులను స్త్రీలవలె పురుషులును పాటించవలసినవే. నమ్రత లేక వినయము రెండు జీవనమునకు అలంకారములే. లజ్జకు అర్థము వినయము కాదు. లజ్జయనగా కులీనత్వమును కాదు, నమ్రతయు కాదు. మీరందఱు బురఖా లేక పరదాలో జీవించుటకు బదులు విశాలమైన గాలిలో జీవించు సామర్థ్యము కలిగియుండవలెను. మీరు గాజుపాత్రలైనచో మిమ్ము అలమారులో జాగ్రత్తగా ఉంచవలసి వచ్చును. జాగ్రత్త జాగ్రత్తగా మిమ్ము ఉపయోగింపవలసి యుండును. మీరు గాజుపాత్రగా

నుండుటకే గర్వపడుచున్నచో . మీ జీవితములో గాజువంటి మెరపు పారదర్శకత్వము తప్పక ఉండవలెను. అంతేగాని దానియొక్క నాజూకుతనము గాదు మీకు ఉండవలసినది. దానివలె కరకరమని పగిలెడి స్వభావముగాదు. వినయ స్వభావముతో బహిరంగముగా నుండుటకు ఏమియు విరోధము లేదు.

సంక్షేపముగా మీకు ఆఱు విషయములు చెప్పితిని.

౧ స్త్రీ సురక్షితురాలుగా కాక స్వరక్షితురాలయి యుండవలెను.

౨. నేటినుండి శిక్షణ వికాసమునకై దానిలో సామంజస్యము, అనుబంధము అను నీ రెండు తత్త్వములు దాఖలు కావలయును.

3. శిక్షణయొక్క స్వాభావిక పరిణామము వినయములో నుండవలెను.

౪. స్త్రీ పురుషులతో సమాన భూమికపైని స్త్రీలు మిత్రులవలె ఉండు కళను సాధింప వలయును.

౫. సమానత్వము అనగా సమాన రూపత్వముగాదు. స్త్రీ పురుషుల సమానత్వమును గుర్తించినదై యుండవలెను. దీని యర్థము పురుషునివలె ఉండుటకాదు. వికాసము పొందిన స్త్రీ యనగా "నకలు పురుషు"డని కాదు. ఇక్కడ సమానత అనగా తుల్యత్వము. స్త్రీల భూమిక పురుషుల భూమికతో తుల్యముగా ఉండవలెను. సరసముగా కూడ నుండవచ్చును. కొన్ని విషయములలో సమానముగా కూడ ఉండగలదు. కాని వానికంటె తక్కువ

క్లాసులో ఎన్నడును ఉండదు. స్త్రీల ప్రతిష్ఠ కేవలము వీరమాత, వీరపత్ని అగుటలోనే కాదు. వీరాంగన అగుటలోనే యున్నది. వీరపురుషుని పత్ని అనుబంధమును పరిశీలించుట వలన ఆమె వీరాంగన కాజాలదు. తన యధీనములో పరాక్రమము ఉన్నపుడే ఆమె వీరస్త్రీ కాలదు. వీరపురుషుని వలె వీరస్త్రీ అగుటలోనే ఆమెకు భూషణము గర్వము అగునని స్వీకరింపవలెను.

౬. 'నవయుగము వచ్చె'నని భగవంతుడు చెప్పియేయున్నాడు. ప్రాతవిలువలు పోయి వానికి బదులు క్రొత్త ప్రపంచపు విలువలు వచ్చును. ఆ క్రొత్త విలువలకు ఆధారమైన గొప్ప విలువ స్త్రీ పురుషులు సామాన్య మనుష్యులు అనుటలోనే కలదు. దాని ప్రతిష్ఠ శిక్షణ వలన పెరగవలయును. జీవితములో అది రూఢమై పోవలయును.

ఈ దృష్టితో ఈ విద్యాపీఠము నవయుగమునకు జన్మను ప్రసాదించుగాక! నేడు ఇక్కడనుండి స్నాతకురాండ్రయి వెలుపలికి వెళ్ళు యువతులు నవయుగమునకు జన్మనిచ్చు మాతలగుదురుగాక. ఈ యర్థముతో మీయొక్క మాతృత్వము మీ దేశమునకు ఇతర దేశములకు లాలామభూతమై సిద్ధించునుగాక! ♦



• దీక్షాంతభాషణము. మహిళాశ్రమము, వార్ధా, ౧౨-౨-౧౯౪౭